మే 14, తెలుగు అధికారభాషాదినోత్సవం ❖ మే 28, తెలుగు వారసత్వ దినోత్సవం (సురవరం ప్రతాపరెడ్డి జయంతి)

సంపుటి : 9
సంచికలు: 2,3
పుటలు : 52
రు. 25లు
ISSN NO: 2582-8738
యు.జి.సి. గుర్తింపు పొందినది



తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు

ఏప్రిల్,మే 2023





తెలుగుజాతి ఆత్మగౌరవ ప్రతీకలు

**మే నెల 28వ తేదీ తెలుగుజాతి జనులందరికీ విలువైన రోజు. ఆనాడే జాతి ఆత్మగౌరవానికి సంకేతాలుగా నిలిచిన సురవరం ప్రతాపరెడ్డిగారు(1896), నందమూరి తారక రామారావుగారు(1923) జన్మించారు.**

నిజాం ప్రభుత్వం నిరంకుశంగా పాలిస్తున్న కాలంలో తెలుగువారి భాషావికాసాలకు ఎలాంటి ప్రోత్సాహం లేని రోజుల్లో విద్యావ్యాప్తికి ఏ విధమైన అవకాశాలు లేనికాలాన 'గోలకొండ' పత్రికను నిజాం రాజ్యంలోని తెలుగువారి గొంతుకగా నిలిపి, ఆంధ్రోద్యమానికి ఆద్యుడుగా, అండగా నిలిచి, ప్రశ్నించడం నేర్పిన ఉద్యమనేత సురవరం ప్రతాపరెడ్డి. తెలుగువారికి దిశానిర్దేశం చేసి ప్రజలలో సామాజిక సాంస్కృతిక చైతన్యాన్ని రగిలించిన తెలుగుజాతి వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డి. అన్ని ప్రాంతాల తెలుగువారిని చైతన్యవంతం చేసి జాతిస్ఫూర్తిని నిలిపిన ఘనుడు.'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' ను రచించిన ప్రత్యేకత ఆయనది. ఆంధ్రులన్నా తెలంగాణమన్నా అంతా తెలుగువారేనని నినదించిన జాతినేత. తెలుగు భాషోద్యమ సమాఖ్య పిలుపునను సరించి సురవరం ప్రతాపరెడ్డిగారి పుట్టినరోజు మే 28వ తేదీని 'తెలుగు వారసత్వ దినోత్సవం'గా జరుపుకుంటున్నాం.

స్వాతంత్ర్యం వచ్చి,భాషారాష్ట్రాలు ఏర్పడిన తర్వాత కూడా తెలుగువారి భాషాసంస్కృతులకు ముప్పు ఏర్పడటం, రాష్ట్రాలపై కేంద్రం పెత్తనం చూసిన నందమూరి తారక రామారావు రాజకీయరంగంలో అడుగిడి అనతికాలంలోనే ఒక బలమైన శక్తిగా ఎదిగి అధికారపీఠాన్ని చేపట్టారు.భాషా రాష్ట్రాల వికాసానికై ఫెడరల్‌వ్యవస్థను కాపాడుకోవాలని, మాతృభాషల రక్షణతోనే దేశం బలోపేతమవుతుందని నినదించారు. తెలుగుభాష, జాతిఅభివృద్ధి ఉన్నత శిఖరాలనందుకోవాలని, అందుకోసం నిర్దిష్ట ప్రణాళికను ప్రకటించారు. నాలుగైదు రోజుల వ్యవధిలోనే రాష్ట్ర పరిపాలనను తెలుగులోకి తెచ్చిన పాలకుడు ఆయనే. తెలుగునేల రెండు రాష్ట్రాలుగా విడిపోయిన తర్వాత కూడా నేటికీ తెలుగు ప్రజలందరి మన్ననలను పొందుతూ, మొత్తం తెలుగువారి ఆదరాభిమానాలను పొంది జాతి కీర్తిపతాకగా నిలిచారు.

**ఆత్మన్యూనత వద్దు.... ఉద్యమచైతన్యంతో ముందుకు సాగాలి**





# మే 14 నుండి 28 వరకు 15 రోజులపాటు తెలుగుజాతి ఆత్మగౌరవ పరిరక్షణ కోసం ఉద్యమ కార్యక్రమాల ప్రారంభం

రెండు తెలుగు రాష్ట్రాల్లో అన్నిస్థాయిల్లో, అన్ని రంగాల్లో తెలుగులోనే పరిపాలన జరగాలి. ఇదే మన కోరిక. ప్రజల అవసరం ఇది. ప్రజల హక్కు ఇది. భాషారాష్ట్రాలు ఏర్పడిందే ఇందుకు. రాష్ట్రస్థాయి నుండి గ్రామాల పరిపాలన వరకు తెలుగులోనే అన్ని పనులూ జరగాలి. న్యాయస్థానాల్లో ప్రజలభాషలోనే తీర్పులతో సహా అన్ని పనులూ జరగాలి. తెలుగు నేలపైన ప్రైవేటురంగంలో కూడా తెలుగే కన్పించాలి, వినిపించాలి. వినిమయ సరుకుల ప్యాకెట్లపై తెలుగులో వస్తు సమాచారం ఉండాలి. ఇవన్నీ జరిగితేనే మనవి తెలుగు రాష్ట్రాలు అవుతాయి. మన ఆత్మగౌరవానికి నిదర్శనాలు ఇవి. ఇందుకోసం ఒక ఏడాది కార్యక్రమాన్ని చేపట్టాలి.

1966 మే 14న తెలుగుభాషను అధికారభాషగా, పాలనా భాషగా, ప్రకటిస్తూ చట్టం వచ్చింది. దీన్ని పూర్తిగా పాటించడం పాలకుల విధి. ప్రభుత్వాన్ని కదిలించి చేయించుకునే హక్కు ప్రజలకు ఉంది. ఇది ప్రభుత్వ వ్యతిరేక చర్య కాదు. ఇది రాజ్యాంగం ప్రజలకు ఇచ్చిన హక్కు. అంతేకాదు, కేంద్రంతో ఉత్తరప్రత్యుత్తరాలను తెలుగులో రాసే హక్కు మనకు ఉంది. పార్లమెంటులో మన ప్రతినిధులకు కూడా తెలుగులో మాట్లాడే హక్కు ఉంది. దాన్ని వాళ్ళు ఉపయోగించుకొనేట్లు మనం ఒత్తిడి చెయ్యాలి. గుర్తుంచుకోండి – తెలుగు ఒక ప్రాంతీయ భాష కాదు, జాతీయ భాష. భారత రాజ్యాంగంలో పేర్కొన్న 22 భాషలూ జాతీయ భాషలే.

కానీ, మన భాషాహక్కులను కాపాడుకోవడంలో ఒక భాషాజాతిగా మనం ఘోరంగా విఫలమయ్యాం. ఇప్పుడైనా మనం కళ్లు తెరవాలి.మన ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలి. ఇది అందరి ఉద్యమం. కేవలం భాషోద్యమకారులది కాదు. తెలుగుప్రజలందరి ఉద్యమం. మే 14 నుండి 28 వరకు రెండు రాష్ట్రాలలో జరుగనున్న ప్రారంభ కార్యక్రమాల వివరాల కోసం సంప్రదించండి.

**మే 14న విజయవాడలో జరుగనున్న ప్రారంభ కార్యక్రమంలో పాల్గొనండి.**

డా. సామల రమేష్‌బాబు
గౌరవాధ్యక్షుడు
ఫోన్: 98480 16136

ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు
అధ్యక్షుడు
ఫోన్: 98661 28846

## తెలుగు భాషోద్యమ సమాఖ్య

ప్రభుత్వ నమోదు సంఖ్య 1288/2003

**కార్యాలయం:** ప్లాట్ నెం. 89, ఇంటి నెం. 54-1/4. 1ఎ, వెటర్నరీ కాలనీ, 4వ వీధి, 2వ అడ్డరోడ్డు, విజయవాడ -500008

VPVM07A102

◆ తెలుగు అభివృద్ధి, సాధికారతల కోసం...
◆ తెలుగు భాషోద్యమ నిర్మాణం కోసం...
◆ ఆంధ్ర, తెలంగాణ, ఇతర రాష్ట్రాలు, విదేశాల్లోనూ ఉన్న తెలుగువారి కోసం...


తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

సంపాదకుడు : డా॥ సామల రమేష్‌బాబు 9848016136

తోడ్పాటు : డా॥ గారపాటి ఉమామహేశ్వరరావు, డా॥ వెన్నిసెట్టి సింగారావు, డా॥ సుందర్ కొంపల్లి, రహ్మానుద్దీన్ షేక్, సరస్వతుల రామనరసింహం(సరసి), తమ్మా శ్రీనివాసరెడ్డి





ఏప్రిల్, మే 2023


### రచయితలకు సూచనలు

తెలుగు భాష, సాహిత్యం,సాంస్కృతికతలతో పాటు తెలుగువారి చరిత్రకూ, సంస్కృతికీ, సాధికారతకూ, ప్రగతికీ చెందిన సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలపై రచనలకు స్వాగతం. రచనలను వ్యాసం, కథ, వచన కవిత, పాట - ఏ రూపంలోనైనా పంపవచ్చు.

1. వ్యాసాలు, కథలు ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకూడదు. కవితలు 20 నుంచి 30 పంక్తులకు మించకూడదు. విమర్శలు విషయం పైనే ఉండాలి. వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. సరళమైన తెలుగులో వ్రాయాలి.

2. రచనలను యూనికోడ్‌లో గాని, అనుఫాంట్స్‌లో గాని టైప్ చేసి పి.డి.ఎఫ్ మరియు పి.ఎం.డి. రెండింటిలోనూ పంపాలి. లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్‌చేసి editorammanudi@gmail. com కు పంపాలి. కొరియర్ / రిజిస్టర్డ్ / సాధారణ పోస్టులో కూడా పంపవచ్చు.

3. రచనతో పాటు పోస్టల్ చిరునామా, ఫోన్ నంబరు, ఉంటే ఇ-మెయిల్ చిరునామా కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము.

**4. హామీపత్రం తప్పనిసరి: రచన సొంతమేనని, ఇతర పత్రికలకుగాని, ఇంటర్నెట్ పత్రికలకుగాని పంపలేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీ పత్రాన్ని తప్పనిసరిగ రచనతో జోడించాలి. హామీ పత్రంలేని రచనలను, ముందుగా సామాజిక మాధ్యమాల్లో పెట్టిన రచనలను ప్రచురణకు స్వీకరించలేము.**

**5.**దయచేసి ప్రచురణ కోసం పంపే రచనలను, వార్తలను ప్రతి నెల **15**వ తేదీలోపుగా మాకు చేరునట్లు పంపండి. **20**వ తేదీ దాటిన తరువాత చేరే వాటిని వెంటనే పరిశీలించడం వీలుకాదు. వ్యాసాలను ప్రచురించడానికి కనీసం **1-2** నెలల వ్యవధి పట్టవచ్చు.

### లోపలి పుటలలో....



కార్టూన్లు
సరసి

కంప్యూటర్
యన్.రాజారావు

ammanudi.org వలగూటిలో అమ్మనుడి పాత సంచికలను చదువగలరు

రచనలను, వార్తలను, వాట్స్‌యాప్‌లో పంపవద్దు: 'అమ్మనుడి'లో ప్రచురణకై వార్తలు, ఫోటోలు, రచనలను కొందరు వాట్స్‌యాప్(WhatsApp) లో పంపుతున్నారు. వాటిని ప్రచురణకు స్వీకరించలేము. దయచేసి కొరియర్‌లో / రిజిస్టర్డ్ పోస్టులో, లేదా **editorammanudi@gmail.com** కు పంపించండి. - సంపాదకుడు


రచనలు, ఉత్తరాలు పంపుటకు చిరునామా:
సంపాదకుడు: **అమ్మనుడి**, జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం,విజయవాడ-520004.
సంపాదకుడు : 9848016136 *e-mail* : editorammanudi@gmail.com




తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు మాసపత్రిక





చందా వివరాలు: జీవిత చందా: రూ.5000

4 సం॥: రూ.1000, 1 సం॥ :రూ.300

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు చెక్కు లేదా డి.డి.ని **'తెలుగుజాతి'** పేర పంపాలి.

**బ్యాంక్‌ఖాతా, ఫోను వివరాలు**

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'తెలుగుజాతి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**TELUGU JAATHI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **914020020387880**

**IFSC Code : UTIB0000556**

**Telugu Jaathi**
**+91 94929 80244**



ఈ QRకోడ్‌ను స్కాన్ చేసి లేదా QRకోడ్ క్రింద ఇచ్చిన యుపిఐ ఐడి నెంబరుకు మీరు విరాళాలు, చందాలు పంపవచ్చును.

**9492980244@okbizaxis**

ఆన్‌లైన్‌లో చందాను పంపేవారు వెంటనే ఇంటినెంబరు, వీధి పేరు, పోస్టాఫీసు, ఊరిపేరు, పిన్‌కోడ్ నెంబరుతో సహా తమపూర్తి చిరునామాను, ఫోన్‌నెంబరు, మెయిల్‌ఐడి తదితర వివరాలను జాబు ద్వారా తెలుపగలరు.

**94404 48244** లేదా **94929 80244** ఫోన్‌కు సందేశం గాని, వాట్సయాప్ ద్వారా గాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరాలకు చిరునామా


**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి' 8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి,** గుంటూరు జిల్లా - 522 211.
ఫోన్ : 94404 48244, 94929 80244,
ఇ-మెయిల్ : ammanudi2015@gmail.com


**చందాదారులకు సూచనలు**

1. చందా కాలం, ముగింపు తేదీ- పత్రిక కవరుమీద మీచిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా కాలం ముగిసిపోయిన తర్వాత పత్రిక పంపబడదు. దయచేసి వెంటనే చందా పైకం పంపి, చందాను కొనసాగించుకోగోరుతున్నాము.
3. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
4. మీ ఇంటి నెంబరుతో సహా పూర్తి చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో సహా తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలుపండి.
5. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.
6. 'అమ్మనుడి' పత్రికను చందాదారులకు మాత్రమే పోస్టులో పంపించగలము. బయట ఎక్కడా అంగళ్లలో అమ్మకమునకు పెట్టడంలేదు. కనుక కావలసినవారు దయచేసి చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలియజేయండి.

## 2023 జూన్ సంచిక నుండి తప్పక చదవండి


బంగోరె

కందుకూరి వీరేశలింగం పంతులుగారిని కథానాయకుణ్ణి చేసి, ఆయన జీవించివుండగానే తమిళంలో ఒక నవల వచ్చింది. విశేషమేమిటంటే -ఆ నవలను తమిళ మహాకవి సుబ్రహ్మణ్యభారతి వ్రాశారు. దానికి తెలుగు అనువాదానికి ప్రఖ్యాత పరిశోధక రచయిత 'బంగోరె' విపులంగా ముందుమాటలు వ్రాశారు. ఇంతకూ ఆ నవల అసంపూర్ణం. ఐనా చదువతగ్గది.

మిత్రులు, సాహితీవేత్త సన్నిధానం నరసింహశర్మగారు వ్రాసిన పరిచయవాక్యాలతో పాటు,'బంగోరె' గారి రచనను 'అమ్మనుడి'లో వచ్చే నెలనుండి ప్రచురిస్తున్నాము. చదివి, మీ అభిప్రాయాలను మాతో పంచుకోవలసిందిగా కోరుతున్నాము.

-సంపాదకుడు

**తెలుగుజాతి (ట్రస్టు) ప్రచురణ**

# ఇవీ సంగతులు...

## భాషాభివృద్ధి సంస్థను ప్రతివాదిగా చేర్చండి: హైకోర్టు

రాష్ట్రంలోని ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు భాష అమలుకు తెలుగుభాషాభివృద్ధి సంస్థ(అథారిటీ) ఏమి చర్యలు తీసుకుందో పరిశీలించి తగిన ఆదేశాలిస్తామని హైకోర్టు పేర్కొంది. అందుకోసం తెలుగుభాషాభివృద్ధి సంస్థను వ్యాజ్యంలో ప్రతివాదిగా చేర్చాలని పిటిషనర్‌ను ఆదేశించింది. ఈ మేరకు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ప్రశాంత్‌కుమార్ మిశ్రా, జస్టిస్ ఎన్ జయసూర్యతో కూడిన ధర్మాసనం మంగళవారం ఆదేశాలిచ్చింది. విచారణను రెండువారాలకు వాయిదా వేసింది. రాష్ట్రంలోని ప్రభుత్వ కార్యాలయాల్లో జరిపే ఉత్తర, ప్రత్యుత్తరాలు, ప్రభుత్వం జారీచేసే జీవోలను తెలుగులో ఇచ్చేలా ప్రభుత్వాన్ని ఆదేశించాలని, తెలుగుభాషా చట్టాన్ని సరైన స్ఫూర్తితో అమలు చేయాలని కోరుతూ గుంటుపల్లి శ్రీనివాస్ హైకోర్టులో పిల్ వేశారు. ఈ వ్యాజ్యం మంగళవారం మరోసారి విచారణకు వచ్చింది. ప్రభుత్వ కార్యాలయాల్లో 80 శాతానికి పైగా తెలుగు భాషను అమలు చేస్తున్నామని ప్రభుత్వ న్యాయవాది శ్రేయాసరెడ్డి వివరించారు. పూర్తి వివరాలతో అఫిడవిట్ వేశామని కోర్టు దృష్టికి తెచ్చారు. తెలుగుభాషాభివృద్ధి సంస్థను ఏర్పాటు చేశామన్నారు. అయితే, ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు అమలుపై ప్రభుత్వం వేసిన అఫిడవిట్ సత్యదూరంగా ఉందని పిటిషనర్ తరపు న్యాయవాది కారుమంచి ఇంద్రనీల్ బాబు వాదించారు. కోర్టు జోక్యం తరువాతే ప్రభుత్వం తెలుగుభాషాభివృద్ధి సంస్థను ఏర్పాటు చేసిందని చెప్పారు. తెలుగు భాష అమలుచేయనివారికి శిక్ష విధించే అధికారం అథారిటీకి ఉంటుందన్నారు. (ఆంధ్రజ్యోతి, ఏప్రిల్ 18)

## తెలుగు అమలయ్యేలా చూసే బాధ్యత నాపై ఉంది : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ప్రశాంత్‌కుమార్ మిశ్రా

న్యాయ వ్యవస్థలో భారతీయ భాషలను బలోపేతం చేయాల్సిన అవసరం ఉందని ఇటీవల జరిగిన ఓ సదస్సులో చర్చకు వచ్చిందని హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ప్రశాంత్‌కుమార్ మిశ్రా గుర్తుచేశారు. ఈ నేపథ్యంలో ఏపీ న్యాయ వ్యవస్థలో తెలుగు అమలయ్యేలా చూడాల్సిన బాధ్యత తనపై ఉందన్నారు. ఏపీలోని ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు భాష అమలు విషయంలో దాఖలైన వ్యాజ్యం విచారణ సందర్భంగా సీజే ఈ వ్యాఖ్యలు చేశారు. అయితే తెలుగుభాష అమలు చేసేందుకు తీసుకున్న చర్యలపై అదనపు అఫిడవిట్ దాఖలు చేసేందుకు సమయం ఇవ్వాలన్న ప్రభుత్వ న్యాయవాది అభ్యర్థనపై సానుకూలంగా స్పందించిన జస్టిస్ ప్రశాంత్‌కుమార్ మిశ్రా, జస్టిస్ ఆర్. రఘునందనరావుతో కూడిన ధర్మాసనం విచారణను మూడు వారాలకు వాయిదా వేసింది. ఏపీలోని ప్రభుత్వ కార్యాలయాల్లో ఉత్తర, ప్రత్యుత్తరాలు, ప్రభుత్వం జారీచేసే జీవోలను తెలుగులో ఇచ్చేలా ప్రభుత్వాన్ని ఆదేశించాలని, తెలుగుభాషాచట్టాన్ని సరైన స్ఫూర్తితో అమలుచేయాలని కోరుతూ గుంటుపల్లి శ్రీనివాస్ హైకోర్టులో పిల్ వేసిన విషయం తెలిసిందే. ఈ వ్యాజ్యం మంగళవారం మరోసారి విచారణకురాగా పిటిషనర్ తరపు న్యాయవాది కారుమంచి ఇంద్రనీల్ బాబు వాదనలు వినిపించారు. ప్రభుత్వ న్యాయవాది శ్రేయాసరెడ్డి స్పందిస్తూ, తెలుగు భాషను అమలు చేసేందుకు ప్రభుత్వం అన్ని చర్యలూ తీసుకుంటుందన్నారు. పూర్తి వివరాలతో అదనపు అఫిడవిట్ వేసేందుకు సమయం ఇవ్వాలని అభ్యర్థించారు. అంగీకరించిన ధర్మాసనం విచారణను వాయిదా వేసింది. (ఆంధ్రజ్యోతి, ఏప్రిల్ 29)

## టెక్సాస్ వర్సిటీలో తెలుగు బోధనా తరగతుల పునః ప్రారంభం: చిట్టెన్ రాజు

ప్రపంచాన్ని వణికించిన కరోనాతో పాటు ఇతర కారణాల రీత్యా ఆస్టిన్‌లోని యూనివర్సిటీ ఆఫ్ టెక్సాస్‌లో తెలుగు శాఖ గత కొన్నేళ్లుగా నిస్తేజంగా ఉన్నప్పటికీ మళ్లీ కాస్త ఆర్థిక పరిపుష్టిని సాధించిందని వంగూరి ఫౌండేషన్ అధ్యక్షులు చిట్టెన్‌రాజు అన్నారు. (ఈనాడు, ఏప్రిల్ 16)

## మాతృభాషల వల్లే దేశానికి ఆర్థిక పరిపుష్టి: గారపాటి....
## జనభాషల అభివృద్ధితోనే పత్రికల అభివృద్ధి: ఎడిటర్ కె.శ్రీనివాస్



హైదరాబాద్‌లోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో నాలుగు రోజులుగా జరుగుతున్న యన్.టి.ఆర్ శతజయంతి ఉత్సవాలలో భాగంగా ఏప్రిల్ 28 శుక్రవారం 'భాషాభివృద్ధిపీఠం' ఆధ్వర్యన, జరిగిన సభలో తెలుగు భాషోద్యమసమాఖ్య అధ్యక్షులు ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు ప్రసంగిస్తూ మాతృభాషల అభివృద్ధితోనే దేశం ఆర్థికంగా అభివృద్ధి చెందుతుందని గణాంకాలతో సహా వివరించారు. తెలుగు భాషను అభివృద్ధి చేసుకుంటేనే తెలుగు పత్రికలు వర్ధిల్లుతాయని ఆంధ్రజ్యోతి సంపాదకులు డా.కె.శ్రీనివాస్ స్పష్టం చేశారు. విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య తంగెడి కిషన్‌రావు, భాషాభివృద్ధి పీఠాధిపతి ఆచార్య శ్రీమతి వై.రెడ్డిశ్యామల తదితరులు ప్రసంగించారు.

# సంస్కృతం పట్ల అంత ప్రేమ,జనభాషల పట్ల నిరాదరణ ఎందుకు?

## పార్లమెంటులో ప్రభుత్వాన్ని నిలదీసిన సభ్యుడు జయరాం రమేష్




మార్చి 29న సోషల్ మీడియాలో మైసూరుకి చెందిన స్కాలర్ ధర్మేష్ ఫెర్నాండెజ్ చేసిన వీడియోపోస్ట్‌లో కాంగ్రెస్ నేత జైరాం రమేష్ పార్లమెంటుని ఉద్దేశించి చేసిన ప్రసంగాన్ని ఉన్నదున్నటు ఇస్తున్నాం:

**జైరాం రమేష్ ప్రసంగం:**

సంస్కృతం మాట్లాడే భాష కాదు. ఇది చాలా మంది మాట్లాడే భాష అంతకన్నా కాదు. భారతదేశంలో సుమారు 15000 మంది మాత్రమే అత్యధికంగా సంస్కృతం మాట్లాడతారు. సంస్కృతం మాట్లాడుకునే భాష కానే కాదు, ఇది కేవలం పూజారుల మరియు కోర్టుల పరిభాష. అయినప్పటికీ అది జనాదరణ పొందిన భాష మాత్రం కాలేదు. ............ప్రాంతీయ భాషల్లో భక్తి ఉద్యమం జరిగింది. అయితే సంస్కృతం మన సాంస్కృతిక వారసత్వంలో భాగం కాబట్టి దానికి మేము గర్విస్తున్నాము.

అయితే, ఫిబ్రవరి 3, 2020న పార్లమెంటులో అన్‌స్టార్డ్ ప్రశ్న వచ్చింది.

లోక్‌సభలో నక్షత్రం లేని ప్రశ్న సంఖ్య 171 ఏమి తెలియజేస్తుందంటే, సంస్కృతం కోసం చేసిన ఖర్చు ఎంత? మరియు ఇతర సంప్రదాయ భారతీయ భాషలపై చేసిన ఖర్చు ఎంత? అని- సాంస్కృతికశాఖా మంత్రిని ఆ ప్రశ్న అడుగుతున్నాము అని.

ప్రశ్నను తెలియజేసి తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ జైరాం రమేష్ (రాజ్యసభ సభ్యుడు) ఇంకా ఏమన్నారంటే ఇతర ప్రాంతీయ భాషల ఖర్చుతో పోలిస్తే మనం సంస్కృతానికి ఇవ్వాల్సిన దానికంటే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చే ప్రమాదం ఉన్నందున నేను ఈ సమాచారాన్ని ఈ పార్లమెంట్ కి అందించాలనుకుంటున్నాను.

**3 ఫిబ్రవరి 2020 నాటి సాంస్కృతిక శాఖామంత్రి సమాధానం ప్రకారం, భారత ప్రభుత్వం గత 3 సంవత్సరాలలో సంస్కృతం యొక్క ప్రచారం కోసం రూ.640 కోట్లు ఖర్చు చేసింది. కానీ ఇతర సంప్రదాయ భారతీయ భాషలపై ఖర్చు చూడండి.**

**భారత ప్రభుత్వం, భారతదేశంలోని ఆరు సంప్రప్రదాయ భాషలైన తమిళం కోసం రూ.24 కోట్లు, తెలుగు కోసం రూ.3 కోట్లు, కన్నడం కోసం 3 కోట్లు, మలయాళం మరియు ఒడియా భాషల కోసం సున్నా రూపాయలను ఖర్చు చేసింది. కానీ సంస్కృతానికి ఏకంగా రూ 650 కోట్లు ఖర్చు చేసింది.**

**ఇది మనం అనుసరించాల్సిన విధానానికి పూర్తిగా వ్యతిరేకం. ఇవి ఆరు కూడా లక్షలాది మంది మాట్లాడే భాషలు. తమిళం ఒక్క తమిళనాడు భాష కాదు అది ఒక జాతీయ భాష. కన్నడ ఒక్క కర్ణాటక భాషే కాదు జాతీయ భాష. మలయాళం, ఒడియా మరియు తెలుగు భాషలు జాతీయ భాషలు. వీటిని లక్షలాది మంది మాట్లాడతారు. కానీ కేవలం 15000 మంది మాట్లాడే భాష కోసం రూ.650 కోట్లు ఖర్చు చేస్తున్నాం. దీనిని స్వయంగా సాంస్కృతిక మంత్రిత్వశాఖ అంగీకరించింది.**

ఇది మనకు నచ్చకపోవచ్చు కానీ చారిత్రాత్మకంగా సంస్కృతం ఎల్లప్పుడూ ముఖ్య(lead) భాషగా మాత్రమే ఉంది. నా స్నేహితుడు భూపేందర్ యాదవ్ తల పంకిస్తున్నట్లు నేను గుర్తించాను. నేను అతనికి ఒక విషయం గుర్తు చేస్తాను. లంకలో హనుమంతుడు సీతను మొదటిసారి చూసినప్పుడు వాల్మీకి రామాయణం ఏమి చెబుతుందో, అతను తనకు తాను ఏమనుకున్నాడు అనే విషయాన్ని నేను వాల్మీకి రామాయణం నుండి వినిపించాలనుకుంటున్నాను.

యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరేవ సంస్కృతామ్
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి

అంటే నేను సంస్కృతంలో మాట్లాడితే సీత రావణుడినని భావించి భయపడుతుంది.హనుమంతుడు చెప్పేది, వాల్మీకి రామాయణం చెప్పేది ఇదే!

సుందర కాండలో హనుమంతుడు ఇంకా ఏమి చెబుతాడంటే,

అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్

అంటే నేను ప్రజల భాషలో మాత్రమే మాట్లాడతాను అని అర్థం

హనుమంతుడు కూడా సీతతో సంస్కృతంలో మాట్లాడలేదు. అతను ప్రజల భాషలో మాట్లాడాడు. అందుకే ఈ ప్రభుత్వం ప్రజల భాషలో మాట్లాడాలని, మరియు తమిళం, తెలుగు, కన్నడ, ఒడియా మరియు మలయాళం భాషలపై ఎక్కువ నిధులు ఖర్చు చేయాలని, మరియు సంస్కృతం కోసం మాత్రమే నిధులు అధికంగా ఖర్చు చేయకూడదని కోరుకుంటున్నాను. ఎందుకంటే అది భారతీయ నాగరికతకు సంబంధించిన చాలా వక్రీకరించిన విషయం - అని ముగించారు జైరాం రమేశ్.

సంపుటి : 9 సంచికలు : 2,3
అమ్మనుడి
ఏప్రిల్,మే 2023

సంపాదకీయం

# ఆత్మన్యూనత వద్దు...
# ఉద్యమచైతన్యంతో ముందుకు సాగాలి

1953 అక్టోబరు 21న తొలి భాషారాష్ట్రంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడగా, నిజామాంధ్రులతో కలిసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం 1956 నవంబరు 1న ఏర్పడిందని అందరికీ తెలుసు. తర్వాత 10 ఏళ్లకు 1966లో ఆంధ్రప్రదేశ్ అధికారభాషా చట్టం వచ్చింది.'ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధికార భాష తెలుగై ఉండవలెను' అని ఆ చట్టం నిర్దేశించింది. ఆ సమైక్యరాష్ట్రం 2014 జూన్ 2న మళ్లీ ఆంధ్రప్రదేశ్, తెలంగాణ అనే రెండు రాష్ట్రాలుగా విడిపోయింది. 1966 చట్టం ఇప్పుడు రెండు రాష్ట్రాలలోనూ వర్తిస్తుంది.

ఈ రెండు రాష్ట్రాలు అభివృద్ధిలో పోటీపడుతున్నామంటున్నాయి. ఆంగ్లమాధ్యమంలో పోటీ పడుతున్నామంటున్నాయి. పారిశ్రామిక రంగంలో,వ్యాపారంలో, వ్యవసాయంలో, సమాచార సాంకేతిక రంగాల్లో ముందడుగులో ఉన్నామంటున్నాయి. రాజకీయంగా దిగజారుడుతనంలోనూ పోటీపడుతున్నాయి. రెండు రాష్ట్రాల్లోని ప్రజలూ మన పాలకుల పోకడలను చూసి నవ్వుకొంటున్నారు. ఐనా మన పాలకులకు, మన అధికారులకు ఇదేమీ పట్టదు.

ఏ చట్టాన్నిగాని, ఉత్తర్వునుగాని తెలుగురాష్ట్రాలు రెండూ అంగ్లంలోనే ఇస్తాయి. కోర్టులకు వెళ్ళీ, ఉద్యమాలు చేసీ, నానా యాగీ చేస్తున్న కొందరు ప్రజలున్నారు గనుక, కోర్టులు చివాట్లు పెడుతున్నాయి గనుక, అడపాతడపా, అడిగినప్పుడు ఆ జి.ఒ.లను,చట్టాలను తెలుగు అనువాదంలో విడుదల చేస్తున్నారు. కాని, కొన్ని సాంకేతిక కారణాలవల్ల తెలుగులో వచ్చిన చట్టాలను, ఉత్తర్వులను అధికారపత్రాలుగా కోర్టుల్లోనూ, కొన్ని పరిపాలనా సందర్భాల్లోనూ గుర్తించడం లేదు. పాలకుల బలహీనతలు తెలిసిన అధికారవర్గం యధావిధిగా బ్రిటిష్‌వారు నేర్పిన దారిలో, పైఅధికారులు చూపిన బాటలోనే పాత జి.ఒల, చట్టాల వరవడిని కొనసాగిస్తున్నారు. ఇదీ తెలుగు భాషారాష్ట్రాల పాలనా చరిత్ర! అడిగిన వెంటనే మన ప్రభుత్వశాఖాధిపతుల ఆంగ్ల ఉత్తర్వులనే మనకు అందిస్తారు.

ఈ పోకడను 1988 మార్చి 14న నాటి ముఖ్యమంత్రి నందమూరి తారక రామారావు ఖండిస్తూ 1988 మార్చి19న ఉత్తర్వులిచ్చారు. (18.3.1988 ఉగాది నుండి ప్రారంభమైన 'విభవ' నామ సంవత్సరాన్ని 'అధికారభాషా సంవత్సరం'గా ప్రకటించారు. దాని ప్రకారం 2-4-1988 నుండి రాష్ట్ర పరిపాలన మొత్తం తెలుగులోకి మారిపోయింది.. ఆరోజు నుండి తనకు చేరిన తెలుగులో లేని ఏ ఉత్తర్వులనైనా, ప్రతిపాదననైనా ఏ చర్యా తీసుకోకుండా తిప్పిపంపివేసే అధికారాన్ని ప్రతి గెజిటెడ్ అధికారికీ దఖలు చేశారు. తన కార్యాలయం నుండి వెంటనే అమలు చేశారు. 'ఆ మెమో అ.భా.31 /ప్రధానపరిపాలనశాఖ/ మెమో నెం.167/అ.భా.3/ 88-1 తేదీ 19.3.1988.'

ఇక్కడ ముఖ్యమైన అంశం 1956 నుండి 1988 వరకు తన పూర్వ పాలకులు చేయలేని పనిని ఒకే ఒక్క నిర్ణయంతో మొత్తం రాష్ట్రపాలనకు 'తెలుగు కుదుపు' ఇచ్చారు. పరిపాలనను ఎలా సాగించాలో చేసి చూపారాయన. మొత్తం రాష్ట్రపాలన అంతా తెలుగులోకి వచ్చేసింది.

మన భాషలో మనం పరిపాలించుకోలేకపోతే మన భాషాజాతికొక ప్రత్యేక రాష్ట్రం దేనికి? ఇదీ ఆసలైన ఆత్మగౌరవానికీ, ప్రజాస్వామ్యపాలనకూ సంకేతం. తెలుగు విశ్వవిద్యాలయాన్ని స్థాపించడం, టాంక్‌బండ్ మీద తెలుగు తేజాల విగ్రహాల ప్రతిష్ఠాపన, తెలుగువారికి జాతీయస్థాయిలో గుర్తింపు వచ్చేవిధంగా రాజకీయ

సంపాదకీయం

వాతావరణాన్ని నిర్మాణం చేయడం, ఇలాంటి సంగతులెన్నో ఉన్నాయిగాని, మనకిక్కడ ప్రధానమైన అంశం తెలుగులో తెలుగురాష్ట్రాల పాలన.

ఆయన కంటే ఇరవైఏడు ఏళ్లక్రితం1896లో సరిగ్గా ఇదే రోజునే సురవరం ప్రతాపరెడ్డి జన్మించి, జీవితాన్నంతా తెలుగుజాతి కోసం, తెలుగు ఆత్మగౌరవం కోసం పోరాడారు. నిజాం పాలనలోని తెలంగాణంలో, మాతృభాషతో తెలుగుతోసహా అన్ని విధాలుగా అణచివేతకు గురవుతున్న తెలుగువారి ఆత్మగౌరవ పరిరక్షణ కోసం అనేక పోరాటాలు చేసిన తొలితరం మహావ్యక్తి. ఆయన గొప్పరచయిత, సేవా దురంధరుడు, 'గోలకొండ' పత్రిక స్థాపక సంపాదకుడు, రాజకీయనాయకుడు. భారతదేశంలో వివిధ భాషాజాతులవారు తమ భాషా చరిత్రలు వ్రాసుకొన్నా, తెలుగు వారిలో మాత్రమే తమ జాతి సాంఘిక చరిత్ర వ్రాతరూపంలో వెలువడింది. 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' అన్న ఆ గ్రంథ రచయిత సురవరం ప్రతాపరెడ్డిగారే. పద్నాలుగేళ్లుగా ప్రతాపరెడ్డిగారి పుట్టిన రోజును తెలుగుజాతి వారసత్వదినోత్సవంగా తెలుగు భాషోద్యమ సమాఖ్య పిలుపున రెండు రాష్ట్రాల్లో జరుపుతున్నారు.

రెండు తెలుగు రాష్ట్రాలు ఏర్పడి తొమ్మిదేళ్ళవుతున్నాయి. తెలంగాణ ప్రత్యేకం కావాలని ఉద్యమాన్ని జరుపుతున్న వేడిలో తలెత్తిన 'తెలంగాణ భాషే వేరు' అనే అతివాదపోకడలను ఇప్పుడు కాలమే పరిష్కరిస్తున్నది.తెలుగువారందరినీ ఐక్యంగా ఉంచలేక, విఫలమైన పరిపాలకులు తమ అసమపాలన, వివక్షధోరణులు, అణచివేతలే ప్రజల్ని విడదీశాయన్న వాస్తవాన్ని తెలుసుకోలేదు.రాష్ట్ర విభజనను అనివార్యం చేశారు. తర్వాతైనా పోటాపోటీగా తమ ఆత్మగౌరవాన్నీ, తమ భాషా సంస్కృతులను కాపాడుకోవడానికీ వారేమైనా చేశారా అంటే- అదంతా మాటల్లోనే చేతల్లో ఏమీలేదు. తెలంగాణ ఏర్పడిన కొత్తల్లోనే ప్రపంచ తెలుగు మహాసభల పేరిట హైదరాబాదులో కోట్లాది రూపాయల ఖర్చుతో చేసిన ఆర్భాటం, అంతకుముందు సమైక్య ఆంధ్రప్రదేశ్‌లో పాలకులు చేసినటువంటి ఆర్భాటాల్నే మరింత ఘనంగా గుర్తుచేసింది. పరిపాలన విద్యారంగాల్లో తమ మాతృభాషను అభివృద్ధి చేసుకోవడానికి,తామే చర్యలు తీసుకొంటున్నారో చెప్పడంలో విఫలమైంది. రెండు తెలుగు రాష్ట్రాలూ కార్పొరేట్‌శక్తుల చేతుల్లోనూ, సామాజిక, రాజకీయ శక్తుల చేతుల్లోనూ కీలుబొమ్మలుగానే తయారైనాయి.

ఈ పరిస్థితుల్లో ఈ నెలలోనే వస్తున్న రెండు సందర్భాలను - అధికారభాషాచట్టం వచ్చిన మే 14ను, ఆత్మగౌరవ ప్రతీకలుగా, తెలుగుజాతి భాష సాహిత్యం, సంస్కృతి వికాసానికై ఎంతో అంకితమై చరిత్రలో నిలిచిపోయిన సురవరం ప్రతాపరెడ్డి, నందమూరి తారక రామారావుల పుట్టిన రోజు (మే 28)నూ మనం ఘనంగా జరుపుకోవాలి.

ఈ సందర్భంగా ఒక ఏడాదిపాటు తెలుగుజాతి స్వాభిమానసాధన కార్యక్రమాలను రూపొందించి, తెలుగునేల నాలుగు చెరగులా నిర్వహించాలి. ప్రభుత్వ పాలనను ప్రజల భాషలోకి తెచ్చేందుకు, ప్రజాస్వామ్యహక్కుగా ఈ అంశాన్ని ప్రచారంలోకి తేవాలి. త్వరలో రానున్న ఎన్నికలను లక్ష్యంగా పెట్టుకుని రాజకీయపార్టీలపై వత్తిడి తెచ్చేందుకై ఉద్యమ కార్యక్రమాలను చేపట్టాలి. ఇదే సమయంలో మరొక్క ముఖ్యవిషయాన్ని గమనించండి.తెలుగు సమాజాన్ని ఆత్మన్యూనతకు గురిచేసేందుకు కనిపించని కుట్రలు జరుగుతున్నాయి. వీటినుండి జాతిని కాపాడవలసిన విద్యాధికవర్గాలు,రాజకీయనాయకులే ఈదాడిలో ముందున్నారు. ప్రతిదానికీ తెలుగువారిలో ఐకమత్యం లేదు, తెలుగువారికి తమ భాషమీద ప్రేమ లేదు తెలుగువాడు మరొక తెలుగువాడితో తెలుగులో మాట్లాడడు.... ఇలాంటి మాటలు వాళ్ళంటున్నారుగదా అని, నిజమే కాబోలునని మనం భ్రమపడకూడదు. అలాంటి ప్రచారాలను వినకూడదు, అనుమతించకూడదు.ఇదంతా ఈనెల 14 నుండి 28 వరకు 15 రోజులపాటు తెలుగు భాషోద్యమ సమాఖ్య చేపట్టిన తెలుగుజాతి ఆత్మగౌరవ పరిరక్షణ ఉద్యమ కార్యక్రమాలలో పాల్గొని విజయవంతం చెయ్యండి.

తెలుగువాళ్లుగా మనం ఆత్మన్యూనతలోంచి బయటకురావాలి. మనం ఎవరికీ తక్కువ కాదు.మనం అన్ని రకాలుగా శక్తిమంతులం. మనల్ని శక్తిహీనుల్ని చెయ్యడానికి అంతర్గత, బాహ్య స్వార్థశక్తులు కుట్రపూరితంగా వ్యవహరిస్తున్నాయి. కనుక- జాగ్రత్తగా ఉండాలి. ఉద్యమ చైతన్యంతో ముందుకు సాగాలి.

తేదీ:1 మే 2023

సామల రమేష్‌బాబు

సామల రమేష్‌బాబు
9848016136

# తెలుగుజాతి వారసత్వాన్ని కాపాడుకోవాలి



మానవ సమూహాల వైవిధ్యానికి భాషలే తొలి గుర్తింపులు. భావ సంచయనం వినిమయం, ఆచార సంప్రదాయాలు, కళలు, సంస్కృతీ విలసనం అంతటికీ దండలో దారంలా జాతి గుర్తింపుకు భాషే ఆధారంగా ఉంటుంది. ఆ భాష జనులు భౌగోళికంగా ఒకే చోట వున్నా, ఎక్కువచోట్ల ఉన్నా ఆ సంస్కృతీ బంధం వారిని పెనవేసుకొనే ఉంటుంది. రాజులు, రాజ్యాలు మారినా వారి సాంఘిక చరిత్ర తన ప్రత్యేకతను కాపాడుకొంటూనే ఉంటుంది.

తెలంగాణ వైతాళికుడుగా పేరుగాంచిన కీ.శే. సురవరం ప్రతాపరెడ్డికి ఈ విషయంలో స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. అందుకే ఆయన 'ఆంధ్రుల చరిత్ర'ను రాజుల, రాజ్యాల చరిత్రగా గాక 'ఆంధ్రుల సాంఘిక చరిత్రగా' వ్రాశారు. ఎంతో పరిశోధన చేసి దాదాపు ఇరవయ్యేళ్లపాటు ఈ విషయంపై వ్యాసాలు వ్రాసి,వాటి సమగ్ర రూపంగా 'ఆంధ్రుల సాంఘిక చరిత్రను ఆయన ప్రచురించారు. 'రాజుల, రాజ్యాల చరిత్ర వ్రాయుట అంత కష్టముకాదు. కాని, సాంఘిక చరిత్ర వ్రాయుట కష్టము. దీని కాధారములు తక్కువ. తెలుగు సారస్వతము, శాసనములు, స్థానిక చరిత్రలు కైఫీయత్తులు), విదేశీ జనులు చూచి వ్రాసిన వ్రాతలు, శిల్పములు, దాన పత్రములు, సుద్దులు, జంగము కథలు, పాటలు, చాటువులు, పురావస్తు సంచయములు (Collections) ఇవి సాంఘిక చరిత్రకు పనికివచ్చు సాధనములు' అని ఆయన ఈ సందర్భంగా వ్రాశారు. తొలుత ఈ గ్రంథాన్ని ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రకటించింది. తర్వాత కేంద్ర సాహిత్య అకాడమీ ఈ గ్రంథానికి జాతీయ బహుమతినిచ్చి గౌరవించింది. తెలుగు ప్రజలకు సురవరం ప్రతాపరెడ్డి ఇచ్చిన శాశ్వతమైన కానుక ఈ గ్రంథం. ఇది తెలుగు ప్రజల చరిత్ర. ప్రజాసామాన్య జీవన చరిత్ర. తెలుగు ప్రజల జీవితం, సామాజిక అంశాలు, మత, సాంస్కృతిక, జానపద విషయాలతో కూడిన సమగ్రమైన సాంఘిక చరిత్ర. తెలుగుజాతి ఎలా ఎదిగిందో ఎలా పతనమైందో, జాతికి ప్రాణప్రదమైన మౌలిక అంశాలు ఏమిటో తెలియజెప్పిన గొప్ప రచన, 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' ఏ ప్రాంతంలోని తెలుగువారికైనా ఒకదారి దీపంగా చిరకాలం నిలిచి ఉంటుంది.

తెలుగుజాతి వారసత్వాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించిన ఈ పుస్తకాన్ని ఇచ్చినందుకు జాతి యావత్తు ఆయనకు రుణపడి ఉంటుంది. తెలుగుజాతి వారసత్వాన్ని బహుశా అందరికంటే స్పష్టంగా అర్థం చేసుకొని, దాన్ని సరైన అర్థంలో వివరించిన దార్శనికుడు ప్రతాపరెడ్డి. అందుకే వివిధ సందర్భాల్లో ఆయన 'ఆంధ్ర' 'తెలుగు' పదాల్ని నిర్వచించారు. గోలకొండ పత్రికలో ఒక సంపాదకీయంలో ఆయన ఇలా అన్నారు. 'ఆంధ్ర అనుపదము అది పుట్టిన నాటి నుండి ఈనాటి వరకు ఒక భాష అనుఅర్థము వచ్చునది. ఆంధ్ర అనుపదము ఒక కాలము కాదు,వర్ణమును తెలుపదు, మతమునకు సంబంధించదు. ఆంధ్రులు అంటే తెలుగు వారు. అట్టి పదమునకు పరిమిత అర్థము నిచ్చుటకు మాత్రము మనకధికారము లేదు.

ప్రతాపరెడ్డి 1930 మార్చి 3వ తేదీ జోగిపేటలో తొలి నిజాం రాష్ట్ర, ప్రథమాంధ్ర మహాసభ అధ్యక్షోపన్యాసంలో **'ఆంధ్రదేశపు మట్టి అది మాకు కనకంబు/ఆంధ్రదేశపు జలము మాకు అమృతము రసము/ ఆంధ్రదేశపు గాలి అది ప్రాణమ్ము/ఆంధ్రదేశమే మాకు అమర దైవతము'** అని పద్యాన్ని చదివారు. తెలంగాణమంటేనే తెలుగు నేల, ఆంధ్రదేశం అని అర్థం. ఆంధ్రజాతి ఇది. తెలుగు ప్రజలుండే ఈ నేల తెలుగు నేల. అంటే ఆంధ్రదేశం. ఇవి ఒకదానికొకటి పర్యాయ పదాలు. ఏలికల్నిబట్టి తెలుగు నేల విభాజితమవుతూ వచ్చింది తప్ప తెలుగువారు నివసించేదంతా తెలంగాణమే.ఆంధ్రదేశమే. ఇదే ఆయన స్పష్టం చేశారు.

1921 లో హైదరాబాదులో జరిగిన హిందూ సంస్కార సభలో ఒకరి తెలుగు ప్రసంగానికి శ్రోతలు అడ్డుపడటంతో తెలుగువారి స్వాభిమానం ఉప్పొంగి ఆంధ్ర జనసంఘ స్థాపనకు దారితీసి, కాలక్రమంలో 'ఆంధ్రమహాసభగా రూపాంతరం చెంది తెలుగువారి సాంస్కృతిక, రాజకీయ మహోద్యమంగా పరిణమించింది. సురవరం ప్రతాపరెడ్డి ఆ స్వాభిమానోద్యమానికి చుక్కానిగా నిలిచాడు. సారధ్యం వహించాడు. బ్రిటీషాంధ్రుల కంటే నిజాం రాష్ట్రాంధ్రులు అన్ని రంగాలలో వెనుకబడియున్నారనీ, ఈ స్థితిని మార్చడానికి ఉద్యమించాలన్నాడు. అన్ని రంగాల్లో ఉద్యమాన్ని నడిపాడు. విముక్తులైన బ్రిటీషాంధ్రులు, నిజామాంధ్రులు కలిసి విశాలాంధ్ర నేర్పరచుకోవాలన్న ఆయన ఆరాటం వెనుక తెలుగుజాతి సర్వతోముఖంగా వికసించాలనే మహత్తర ఆశయం ఉన్నది. ఆయన హృదయం తెలుగుజాతి కోసం క్షోభించింది. అస్తిత్వపోరాటం కోసం ఉద్భవించిందే నాటి ఆంధ్ర మహాసభ.ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోంచి విడిపోవాలన్నదీ అస్తిత్వ పోరాటమే. అయితే ఈ రెండు పోరాటాలకు మూలమైన తెలుగు ప్రజలు ఈ అర్థ శతాబ్ది కాలంలో పాలకుల చేత వంచించబడ్డారు. వారి దురదృష్టం ఏమిటంటే తెలుగు భాషా సాంస్కృతిక వికాసం పట్ల శ్రద్ద ఉన్న పాలకులే వారికి కరువయ్యారు. తెలుగు ప్రజల ఐక్యత పట్ల నిబద్ధత పాలకులకు ఏ మాత్రం లేకుండా పోయింది.అందువల్లే తెలుగు ప్రజల మధ్యే ప్రాంతాలవారీగా అస్తిత్వవాద ఉద్యమాలు విజృంభించాయి. ఇప్పుడు అవి మూడు నాలుగు ప్రాంతాల అస్తిత్వ వాదాలుగా రూపుదాల్చుతున్నాయి. ఇదేసమయంలో పొరుగు

## రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులకు ప్రపంచ తెలుగు భాషా పరిరక్షణ పార్టీ విన్నపం

ప్రపంచ తెలుగుభాషా పరిరక్షణ పార్టీ వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ కోటిపల్లి సుబ్బారావు సరిగ్గా సంవత్సరం క్రితం 14-4-2022న వివరంగా రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులకు ఒక విన్నపాన్ని పంపించారు. కాని, ఇంతవరకు వారినుండి ఎటువంటి స్పందన రాలేదు. మరలా ఈ అంశంపై ఇద్దరు ముఖ్యమంత్రులకు విన్నవించి, వారి నుంచి సానుకూల చర్యలను రాబట్టాలని ఆశిస్తున్నారు. ఏమీ ఫలితం లేనట్లయితే, న్యాయస్థానాలను ఆశ్రయించాలనే ఆలోచనలో వున్నట్లు తెలుస్తున్నది.

ముఖ్యమంత్రులకు శ్రీ కోటిపల్లి సుబ్బారావు వ్రాసిన లేఖలో- తెలుగును పూర్తిస్థాయి అధికార భాష మరియు పాలనాభాషగా అమలుచేయాల్సిన అవసరాన్ని గురించి ఆయన వివరంగా పేర్కొన్నారు. ఈ బాధ్యత తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలదేనని, వారే ఆ బాధ్యతను నిర్వహించకపోతే తెలుగు రాష్ట్రాలనే మాటకు అర్ధమేవుండదని స్పష్టం చేశారు. 1953/56లో తెలుగు రాష్ట్రం ఏర్పడినా 1966లో గాని అధికార భాషాచట్టాన్ని తీసుకురాలేకపోయారని, 1976 నుండి తెలుగును పాలనాభాషగా అమలుచేయాలని, రాష్ట్ర సచివాలయంలో అన్ని పనులను తెలుగులోనే నిర్వహించాలని నిర్ణయించినా, అది సరిగ్గా అమలుకు రాలేదు. ఈ విషయాన్ని ఆయన వివరంగా ముఖ్యమంత్రుల దృష్టికి తెచ్చారు.

ఇతర రాష్ట్రాలలోనూ, దేశాలలోనూ వారి భాషలను పాలనారంగంలో ఎంత బలంగా వాడుతున్నారో ఆయన తెలియజేశారు. మనదేశంలోనే ఎక్కువమంది ప్రజలు మాట్లాడేభాషగా తెలుగు వున్నప్పటికీ అది ఇప్పుడు నాలుగోస్థానానికి దిగజారిపోవడం విచారించవలసిన సంగతి అన్నారు. ఇంగ్లీషువారి పరిపాలనలోకంటే స్వాతంత్ర్యం వచ్చి, భాషారాష్ట్రాలుగా ఏర్పడిన తర్వాతే-మన పాలకుల అలక్ష్యం వల్ల విదేశీభాష అయిన ఇంగ్లీషులోనే మనం పరిపాలించుకుంటున్నామనే వాస్తవాన్ని గుర్తుచేయడానికి మనం సిగ్గుపడాల్సివస్తున్నదని, ఈపరిస్థితిని వెంటనే మార్చాలని ఆయన ప్రభుత్వాల అధినేతలకు విజ్ఞప్తి చేశారు. ఇందుకై తక్షణమే చేపట్టవలసిన చర్యలను ఆయన ప్రస్తావించారు.

విదేశీ ఉద్యోగాలకోసం, లేదా మరేదో అవసరాలకోసం ఇంగ్లీషే కాదు, ఎన్ని ఇతర భాషలనైనా నేర్చుకోవచ్చునీ ఇందుకోసం సరైన పునాది మన మాతృభాష తెలుగును గట్టిగా నేర్చుకోవడమే అని మనం తెలుసుకోవాలన్నారు. ఎంతో బలమైన మన మాతృభాషను అశ్రద్ధ చేయడమంటే మనల్ని మనం నిర్లక్ష్యం చేసుకోవడమేనని ఇది ఆత్మహత్యాసదృశమని ఆయన తెలియజేశారు.

ఇంకా అనేక విషయాలను ఆయన వివరించి అధికారభాషగా, పాలనాభాషగా పూర్తిస్థాయిలో తెలుగును అమలులోకి తేవడానికి వెంటనే చర్యలు చేపట్టవలసిందని రెండు ప్రభుత్వాల అధినేతలకు 'ప్రపంచ తెలుగుభాషా పరిరక్షణ పార్టీ అధ్యక్షులు శ్రీ కోటిపల్లి సుబ్బారావు విజ్ఞప్తి చేశారు.

ప్రపంచ తెలుగు భాషా పరిరక్షణ పార్టీ, ప్లాట్ నెం.505, సాయిరాం రెసిడెన్సీ, అలకాపురి రోడ్ నెం.16, పుప్పాలగూడ, మణికొండ, హైదరాబాద్- 500089, వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ కోటిపల్లి సుబ్బారావు, చరవాణి: 9491524786,
ఇ మెయిల్: subbaraokotipalli@gmail.com

రాష్ట్రాలలోని తెలుగువారి భాషా ప్రయోజనాలు అణచివేయబడుతున్నాయని ఈ అస్తిత్వ పోరాట నాయకులు గమనించడం లేదు. తాము విడిపోవాలని కోరుతున్న భూభాగాలకు ఆనుకొని ఇతర రాష్ట్రాల్లోకి చేరియున్న తెలుగు భూభాగాలను కూడా తమకు కలపాలని వాళ్లు కోరడంలేదు. రాయలసీమలో ఒకప్పటి భాగాలుగా ఉన్న అచ్చమైన తెలుగు ప్రాంతాలు ఎన్నో ఇప్పుడు తమిళనాడు, కర్ణాటకల్లో ఉన్నాయి. అలాగే తెలంగాణలోకి రావలసిన ఎన్నో భాగాలు కర్ణాటకలో, ఛత్తీస్‌ఘడ్, మహారాష్ట్రల్లో ఉన్నాయి. ఉత్తరాంధ్రలోకి రావలసి ఉన్న అచ్చ తెలుగు జిల్లాలు ఒరిస్సాలో ఉన్నాయి. వీటికోసం కూడా ఈ ప్రత్యేక రాష్ట్రవాదులు తమ గొంతును వినిపించాలన్న బాధ్యత మాత్రం మరిచిపోతున్నారు. అంతేగాదు, **ప్రజలు మౌనంగా బాధపడుతున్న విషయం ఏమిటంటే భాషా సాంస్కృతిక సంబంధాలను దెబ్బతీసుకోకుండానే రాజకీయ పోరాటాలను కొనసాగించుకోవచ్చుననే ముఖ్యమైన అంశాన్ని వీరు విస్మరిస్తున్నారు.**

నేటి క్లిష్ట పరిస్థితుల్లో సురవరం ప్రతాపరెడ్డి జయంతిని తెలుగుజాతి వారసత్వ దినోత్సవంగా జరుపుకోవాలని తెలుగుభాషోద్యమ సమాఖ్య పిలుపునిచ్చింది. ఈ పిలుపుననుసరించి రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల్లోనూ, పొరుగు రాష్ట్రాల్లోనూ కార్యక్రమాలు జరుగుతున్నాయి. ఇప్పుడు మన సమాజంలో అస్తిత్వ ఉద్యమాలనేకం జరుగుతున్నాయి. సామాజికంగా, రాజకీయంగా ఇవి అనేక ప్రాతిపదికలమీద నడుస్తున్నాయి. చైతన్యవంతమైన సమాజంలో ఇవి స్వాగతించదగినవే. వీటి పరిధుల్ని, పరిమితుల్ని ఏ ఒక్కరూ నిర్ణయించలేరు. కాలక్రమంలో అవి నిర్ణయమవుతాయి. కాని,తెలుగుజాతి వారసత్వ భూమికను దెబ్బతీసేవిగా అవి ఉండకూడదు.

జాతి చరిత్రలో ఎన్నో రాజ్యాలు ఏర్పడ్డాయి. నశించాయి. పాలకులు వచ్చారు. పొయ్యారు, కాని తెలుగు జాతీయులైన ప్రజలు తమ వైవిధ్యభరితమైన, సంపన్నమైన భాషా సంస్కృతులను కాపాడుకొంటూనే ఉన్నారు. ఇప్పుడున్న పరిస్థితుల్లో మన రాజకీయ నేతలతో సహా మనమంతా ఈ అంశాన్ని గుర్తుంచుకోవాలి. మీమీ రాజకీయ ఉద్యమాలను కొనసాగించుకోండి. విస్తృతమైన తెలుగుజాతి మరింత మహోన్నత భవిష్యత్తువైపుకు పురోగమించడానికి దేశం లోని 18 కోట్ల మంది తెలుగు ప్రజలంతా ఒకే రాష్ట్రంగా ఉండటం సాధ్యంకాదు. కాని, **అందరి గుండె చప్పుళ్లూ మన భాషానుబంధాన్ని గుర్తుచేస్తూనే ఉంటాయి. అందరి శ్రేయస్సును లక్ష్యంగా ఉంచుకొని, రాజకీయ అస్తిత్వ ఉద్యమాలకు లక్ష్యాలను, ప్రణాళికలను తిరిగి నిర్వచించుకోండి. విడివిడిగా ఉన్నా అందరికి అంతిమ లక్ష్యం తెలుగు జాతి శ్రేయస్సు కావాలి. అంటే తెలుగుజాతి వారసత్వాన్ని మనం గర్వంగా కాపాడుకోవాలి. సురవరం ప్రతాపరెడ్డి వంటి తెలుగుజాతి వైతాళికుడికి మనం ఇవ్వగలిగిన నివాళి ఇదే.**

ఈ వ్యాసం 2010 మే 28న 'వార్త' దినపత్రికలో ప్రచురించబడింది.

జాతి వారసత్వ దినోత్సవం - మే 28

కుర్రా జితేంద్రబాబు
9848882600

# తెలుగుజాతి వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డి

నిజాం ప్రభుత్వం నిరంకుశంగా పాలిస్తున్న కాలంలో, తెలుగువారి భాషావికాసాలకు ఎలాంటి ప్రోత్సాహం లేనిరోజుల్లో, విద్యావ్యాప్తికి ఏవిధమైన అవకాశాలు లేనికాలాన 'గోలకొండ' పత్రికను నిజాం రాజ్యంలోని తెలుగువారి గొంతుకగా నిలిపి, ఆంధ్రోద్యమానికి ఆద్యుడుగా,అండగా నిలిచి ప్రాథమిక చట్టాలను ప్రజలకు గుర్తుచేసి, సభపెట్టుకునే స్వాతంత్ర్యం,మాట్లాడే స్వాతంత్ర్యం ప్రజలకు ఉండాలని ప్రజల పక్షాన నిలిచి ప్రశ్నించడం నేర్పిన సేవాదురంధరుడు సురవరం ప్రతాపరెడ్డి. పత్రికా సంపాదకుడుగా, కవిగా, పండితుడుగా, పరిశోధకుడుగా, విమర్శకుడుగా, దేశాభిమానిగా తన ప్రజ్ఞాపాటవాలను కలబోసి తెలుగువారికి దశ,దిశానిర్దేశం చేసి ప్రజలలో సామాజిక, సాంస్కృతిక చైతన్యాన్ని రగిలించిన తెలుగుజాతి వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డిగారు. మరొక సంగతి దేశంలోని వివిధ భాషాజాతులవారు వారి భాషాచరిత్రలను ప్రకటించుకున్నారుగాని, 'సాంఘిక చరిత్ర'ను ప్రకటించుకొన్నట్లు తెలియదు. తొలుతగా తెలుగువారి సాంఘిక చరిత్రను 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' అనుపేర రచించి ప్రకటించినవారు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారే. ఈ అన్ని ప్రత్యేకతల ఆధారంగా తెలుగు భాషోద్యమ సమాఖ్య సురవరం ప్రతాపరెడ్డిగారి పుట్టినరోజు మే 28వ తేదీని తెలుగువారసత్వదినోత్సవంగా జరుపుకోవాలని పిలుపునిచ్చింది.



కనువెలుగు మే 28,1896
కనుమరుగు ఆగష్టు 25,1953

20వ శతాబ్ది ఆరంభంలో నిజాం సంస్థానంలో ప్రారంభమైన తెలంగాణా సంస్కరణోద్యమం, గ్రంథాలయోద్యమం, రాజకీయోద్యమం వంటి అన్ని ఉద్యమాలలోనూ సురవరం ప్రతాపరెడ్డిగారు తనదైన శైలిలో ప్రధాన పాత్రపోషిస్తూ, సంస్థాన ప్రజల గోడు తన సొంత గొడవగా భావించి తన కలాన్ని గళాన్ని జతగా ప్రజాచైతన్యాన్ని ఉద్యమీకరించేందుకు శక్తివంచన లేకుండా కృషి చేశారు. కనీసం సమావేశ స్వేచ్ఛకు కూడా నోచుకోని ప్రజలకు స్వేచ్ఛగా ఆలోచించడం నేర్పి ప్రజల భావప్రకటనా స్వేచ్ఛకు పట్టం కట్టిన మహనీయుడు సురవరం ప్రతాపరెడ్డిగారు.

సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, మందుముల రామచంద్రరావు,మందుముల నర్సింగరావు, కొండా వెంకట రంగారెడ్డిలు కలిసి నిర్వహించిన ఆంధ్రజన సంఘం, ఆంధ్ర మహాసభలు, గ్రంథాల యోద్యమాలు, సాహిత్య సాంస్కృతిక భాషా ఉద్యమాలు ఒక మహావెల్లువై రాజకీయ స్వాతంత్ర్య సమరానికి దారితీశాయి. నిజాం సంస్థానంలో జరిగిన ఈ ఉద్యమాలు ఉత్తర, దక్షిణ భారతాల మధ్య విశ్వసించదగిన సేతువై, భిన్న సంస్కృతులకు హేతువై యువశక్తిని విస్తారంగా సమీకరించి ప్రజలలో సమకాలీనంగా నవచైతన్యాన్ని రగిలించాయి. నిజాం సంస్థానంలో తెలుగువాడి గుండెను సూటిగా తాకేవిధంగా రచనలు చేస్తూ, పలుకులు పలుకుతూ, తెలుగువారినందరినీ తట్టి లేపుతూ, వారు వెలుగులై, విజ్ఞానపులుగులై విహరించాలనీ ఆ వెలుగుల్లో ప్రజాజీవన విధానంలో సమూలమైన మార్పులు జరగాలని ఆకాంక్షించి, కలంపట్టి రచనలు చేసినవారు సురవరం ప్రతాపరెడ్డి. సాంఘిక సంస్కరణ, పరిశోధన, సంపాదకత్వం, ప్రచురణ, భాష, విమర్శ, సాహిత్యం ఇలా ఎన్నో రంగాలలో ఆయన చేసిన బహుముఖ కృషి తెలంగాణ జనజీవన చైతన్యాన్ని అభ్యుదయ పథంలోకి వేగంగా పరుగులెత్తించింది.

తను స్వంతంగా తయారు చేసుకున్న వ్యాససూచిలో మొత్తం 1461 వ్యాసాలున్నాయని ప్రతాపరెడ్డి తెలిపారు. నిజానికి అందులో చేరని వ్యాసాలు ఎన్నో ఉన్నాయి. అలాగే అముద్రిత గ్రంథాలు కూడా... ముఖ్యంగా సురవరం వారి చరిత్ర పేరున రాసుకున్న స్వీయచరిత్ర. చరిత్ర పరిశోధకులకు కర్నూలు చరిత్రను అధ్యయనం చేయడానికి చాలా ముఖ్యమైన ఆధార గ్రంథం కర్నూలు రాజవంశావళి. కృష్ణరాయలకాలంనాటి సాంఘిక పరిస్థితి ఇంకా ప్రచురించబడని గ్రంథమే. శుద్ధాంతకాంత (నవల), తుకారాం (నాటకం) కొన్ని ఖండకావ్యాలు కాక దాదాపు 25కి పైగా పుస్తకాలు ప్రచురించబడ్డాయి. భాషాశాస్త్రంపై, ఇండో-యూరోపియన్ ఫిలాలజీపై, ఆంధ్రలిపి సంస్కరణపై ఆయన చేసిన విలువైన రచనలు నేటితరానికీ ప్రామాణికంగా ఉండడం విశేషం.

నిజాం రాష్ట్రంలోని తెలుగువారిని చైతన్యవరచడానికి మొదటిసారిగా షబ్నవీస్ వెంకటనరసింహారావు 24 ఆగస్ట్ 1922న'నీలగిరి' వారపత్రికను నల్లగొండలో ప్రారంభించాడు. ఆ

పత్రికను దేశాభివృద్ధి, భాషాభివృద్ధి చేయాలనే మహాసంకల్పంతో ప్రారంభించారు. ఆ తర్వాత ఒద్దిరాజు సోదరులుగా ప్రసిద్ధిగాంచిన సీతారామచంద్రరావు, రాఘవరంగారావులు ఇనుగుర్తిలో ఒక ప్రచురణాలయం 'విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల' (1918) పేరున స్థాపించి విజ్ఞానదాయకమైన అనేక గ్రంథాలను ప్రచురించడమే కాక, 1922 ఆగస్ట్ 27 (ఆదివారం)న 'తెనుగు' అనే వారపత్రికను ప్రారంభించారు. ఈ పత్రికలో తెలంగాణాలో ఆనాడు స్థాపించిన అన్ని గ్రంథాలయ వివరాలు, ఆంధ్రోద్యమం కోసం స్వచ్ఛందంగా కార్యకర్తలు జరుపుతున్న పర్యటన వివరాలతోబాటు తెలంగాణాలో జరుగుతున్న సాహితీ, సాంస్కృతిక వికాస పురోభివృద్ధి తీరుతెన్నులను ప్రజలకు వివరంగా తెలియపరచారు.

1926 మే 10న అర్ధ వార పత్రికగా 'గోలకొండ'ను తన సంపాదకత్వంలో సురవరం ప్రతాపరెడ్డి ప్రారంభించారు. తెలంగాణ చైతన్యానికి అవిశ్రాంతంగా, అవిరామంగా కృషిచేసి ప్రజా సంస్థలన్నింటికి పట్టుగొమ్మగా, ప్రజా నాయకుల ఉద్యమ వేదికగా ఉజ్వలమైన పాత్రను 'గోలకొండ' పత్రిక విజయవంతంగా నిర్వహించింది. ప్రతాపరెడ్డిగారు 'గోలకొండ'ను మొదట వారపత్రికగా నడపాలని భావించినా వివిధ జిల్లాలలో పైన పేర్కొన్న ఎంతో మంది యువకులు నడుపుతున్న 'నీలగిరి', 'తెనుగు'. వంటి పత్రికలు ఆగిపోతాయనే భావనతో, ఈ పత్రికలను ప్రోత్సహించే సదుద్దేశ్యంతో మాడపాటి హనుమంతరావు, 'గోలకొండ'ను అర్ధ వారపత్రికగానే నడపాలని పట్టుపట్టారు. గోలకొండ పత్రిక మొదటి సంచిక 10 మే 1926న వెలువడింది. ఆ సంచికలో సంపాదకులు సురవరం ప్రతాపరెడ్డి పత్రికా ఉద్దేశ్యాలను 'స్వవిషయం' శీర్షికన ఇలా ప్రకటించారు... .'

"నిజాం రాష్ట్రమందలి జనులేయననేల' మనదేశమందలి ఇతర ప్రదేశములవారును ముఖ్యముగా వ్యవసాయముపై ఆధారపడిన వారికి ఈ పత్రిక అట్టి జనులకు చేతనైనంత వరకు వ్యవసాయ సంబంధములగు వ్యాసములు వ్రాసియు, వ్రాయించియు ప్రోత్సహించుచుండును. పరపతి సంఘముల విషయమై తరచుగా మా పత్రికయందు వ్రాయుచుందుము. ఈ పత్రిక హైదరాబాదు రాష్ట్రములో విశేష ప్రచారము నొందగలదు. కావున, ప్రత్యేకముగా ఈ రాష్ట్రపువార్తలు ప్రకటించుచుందుము''. ఈ ఉద్దేశానుసారమే ప్రారంభమైన గోలకొండ పత్రిక నిజాం రాష్ట్ర పరిస్థితులను గుర్తించి ఇక్కడి ప్రజల రాజకీయాదర్శాలకు, స్వాతంత్ర్య కాంక్షలకు, జాతీయ భావాలకు ప్రాతినిధ్యం వహించాలనే మహోన్నతాశయంతో దినపత్రికగా మారింది. తెలంగాణ ప్రజల సాంస్కృతిక, వైజ్ఞానిక, జీవనరంగాలలో గోలకొండ పత్రిక నిర్వహించిన పాత్ర అద్వితీయమైనది. క్లిష్టాతిక్లిష్టమయిన పరిస్థితులలో తెలంగాణాలో రాజకీయ చైతన్యం కలిగించి, ప్రజలను చైతన్యవరిచి, జాతీయోద్యమవ్యాప్తికి తోడ్పడి, ప్రజాభిప్రాయమును ధైర్యంగా, నిష్పక్షపాతంగా తీర్చిదిద్దిన ఘనత గౌరవం 'గోలకొండ పత్రికకు, సురవరం ప్రతాపరెడ్డిగారికి చెందుతుంది. ఆంధ్రజనకేంద్ర సంఘం, ఆంధ్రమహాసభలను ప్రోత్సహిస్తూ, ఆ సభలలో ఉపన్యసించిన ముఖ్య ఉపన్యాసాలను ప్రచురిస్తూ, ఆయా సభల తీర్మానాలను, సమావేశ వివరాలను ప్రచారం చేస్తూ భోనగిరి ఆంధ్రమహాసభలో ఆంధ్ర నుండి కమ్యూనిష్టు నాయకులు వచ్చి పాల్గొనడాన్ని నిరసిస్తూ వచ్చింది.

గోలకొండ పత్రిక మొదటినుంచి మార్క్సిస్టు సిద్ధాంతాలను వివరణాత్మకంగా విశ్లేషిస్తూ, కమ్యూనిస్టు ఉద్యమాలకు వ్యతిరేకంగా నిలిచి, ఆంధ్రమహాసభలో ఆనాడు తలెత్తిన కమ్యూనిస్టు పక్షాన్ని తీవ్రంగా విమర్శించింది. తెలంగాణ సాయుధపోరాటాన్ని, కమ్యూనిస్టులు నిర్వహించిన ఉద్యమాలను గోలకొండ పత్రిక ప్రతిఘటించింది. కమ్యూనిష్టు వ్యతిరేక రచనలతో పత్రికను నింపింది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కావలెనని కోరింది.

హైదరాబాదులో తెలుగు మాట్లాడేవారే అరుదైన ఆ కాలంలో పత్రికలోరాసే స్థాయివున్న తెలుగువాడు సహాయ సంపాదకుడిగా లభ్యమవడం అసాధ్యమైన విషయం. గోలకొండ కంటే ముందే స్థాపించిన 'నీలగిరి' 'తెనుగు' పత్రికలు ప్రారంభించిన కొద్దికాలానికే నిలిచిపోయాయి. ప్రతాపరెడ్డి కన్నడ సాహిత్యాన్ని బాగా అధ్యయనం చేసి వుండడం మూలంగా కన్నడ భాషా పోకడలతోనూ తెలంగాణకు తేట తెలుగు నుడికారంతోనూ, ఉర్దూ బాణి బిగువుతోనూ వ్యాసాలు రచించేవారు. శైలిలో ఒక వేగం, భావపరిపుష్టి, ప్రసన్నత, మధురిమ వాటిని మించిన చురుకుదనం, ఓజస్సు, తేజస్సులతో రచనలు పఠితల హృదయాలను రంజింపచేస్తూ ఆకర్షింపబడేవి. సారస్వతానురక్తికీ, పాండితీ గరిమకు దీటయ్యేవిధంగా గోలకొండ పత్రికను తీర్చిదిద్ది నిద్రాణమైవున్న తెలంగాణ ప్రజల గొంతుకగా మలిచాడు. ప్రతాపరెడ్డి వేరు వేరు మారు పేర్లతో గోలకొండ పత్రికలో వ్యాసాలను, కథలను, విమర్శలను ఆసక్తికరంగా రాస్తూ పాఠకులను నిరంతరం ఉత్తేజపరిచేవాడు. చిత్రగుప్త, భావకవి, రామ్మూర్తి, యుగపతిసింహ అనే పేర్లతో అనేక సామాజిక సమస్యలను లేవనెత్తి గోలకొండ పత్రికను వాదోపవాదాలకు వేదికగాచేసి ప్రజలకు విజ్ఞాన, వికాసాలను అందించాడు. 'జంగమలు బ్రాహ్మణులు కారు' అనే వ్యాసాన్ని గోలకొండ పత్రికలో రాసి చిదిరెమఠం వీరభద్రశర్మను రెచ్చగొట్టి ఆ వాదోపవాదాలకు గోలకొండ పత్రికనుకేంద్రంగా మార్చాడు. పత్రికలోని వ్యాసాల రచనలో



వక్రోక్తులు, వ్యంగ్యాలు, ధ్వనులు, ధ్వన్యాభాసలు, ఇలా అనేక ప్రక్రియలను పాఠకులకు పరిచయం చేసి, వారికి గోలకొండ పత్రికను క్రమంతప్పని అలవాటుగా మార్చిన నిపుణుడైన సంపాదకుడు ప్రతాపరెడ్డి. స్త్రీలకు స్వాతంత్ర్యం అవసరమా? అన్న వ్యాసం రాసి ఎంతో మంది స్త్రీలను వాదోపవాదాల్లోకి దించి ముఖ్యంగా ఎల్లాప్రగడ సీతాకుమారిలాంటి ఎందరో మహిళలల చేత స్త్రీలకు స్వాతంత్ర్యం అవసరమని ఎన్నో వ్యాసాలు రాయించి వందలాది మంది మహిళా పాఠకులను గోలకొండకు తయారు చేశాడు. సురవరం ప్రతాపరెడ్డిగారికి పరిహాసం చేయడం సరదా. స్త్రీలకు స్వాతంత్ర్యం ఎందుకని ఒక వాదాన్ని లేపి ఎల్లప్రగడ సీతాకుమారిఆయనకు వ్యతిరేకంగా, ఈ వాదానికి వ్యతిరేకంగా రాసిన వ్యాసాలన్నింటినీ ప్రచురించి ఆఖరుకు అనేక విమర్శలు ప్రతివిమర్శలు జరిగిన తర్వాత స్వాతంత్ర్య పిపాస మీలో ఎంతవుందో తెలుసుకోవడానికే మిమ్ముల్ని రెచ్చగొట్టాను. వరిపిడి వల్లే కదా బంగారానికి వన్నె వచ్చేది అని చెప్పి సహృదయంతో ఈ చర్చను ముగించాడు. ప్రతాపరెడ్డి ప్రజలమనిషి. స్వేచ్ఛాయుతమైన ప్రజాస్వామ్య భావాలను వెలువరించే రైతుబిడ్డ. దొరల ప్రజావంచకత్వాన్ని కలంపోటుతో తెలియజేసిన దిట్ట. ఆదిరాజు వీరభద్రరావు, ధూపాటి వెంకటరమణ కవుల సహకారంతో గోలకొండ కవుల సంచికను ప్రచురించారు. దీనిలో 183 పూర్వకవుల కవితలు, 354 మంది ఆధునిక కవుల కవితలు ప్రచురిస్తూ తెలంగాణ తెలుగు పద్య సాహిత్యాన్ని ప్రపంచానికి పరిచయం చేశారు. నిజాం సంస్థానంలో ఉన్న పరభాషీయులచేత, బ్రిటిష్ఆంధ్రలో వున్న స్వభాషీయుల చేత తృణీకరించబడ్డ చరిత్ర తెలంగాణ ప్రాంత కవులది. ఆభావం తోనే ముడుంబ వెంకట రాఘవాచార్యులు 1932లో సురవరం ప్రతాపరెడ్డి వెలువరించిన గోలకొండ పత్రిక 9వ సంవత్సరాది సంచికలో రాసిన 'ఆధునిక భావ కవిత్వతత్వం' అనే వ్యాసంలో 'నిజాం రాష్ట్రంలో ఆంధ్రకవులు పూజ్యము' అని రాయటం జరిగింది. తెలంగాణ - కవులు లేని ఆనాగరికపు నేల అనే మచ్చను తుడిచివేసేందుకే సురవరం ప్రతాపరెడ్డి చేసిన సాహిత్య నీరాజనం 'గోలకొండ కవుల సంచిక'. వెక్కిరించిన వారికి విద్యుద్ఘాత సదృశ సమాధానం సురవరం ప్రచురించిన గోలకొండ కవుల సంచిక. ముడుంబ వెంకటరాఘవాచార్యులు చేసిన వ్యాఖ్యకు సమాధానంగా నాలుగు నెలల్లోనే గోలకొండ కవుల సంచిక వెలువరించారు. 1947వ సంవత్సరం నుంచి గోలకొండ పత్రిక దినపత్రికగా మారింది. ఆ తర్వాత ఒక సంవత్సరం పాటే ప్రతాపరెడ్డి ఈ పత్రికకు సంపాదకుడిగా వ్యవహరించారు. ముఖ్యంగా పత్రికలో నాటి మహబూబ్‌నగర్ జమిందారుల ఆధిపత్యం, నియంత్రణ పెరగడంతో పత్రికనుంచి బయటకు వచ్చారు. అనంతరం 1951 సం.లో ప్రతాపరెడ్డి గారు 'ప్రజావాణి' అనే ద్వి దినపత్రికను ప్రారంభించి 2 సంవత్సరాలు నడిపి ఆర్థిక కారణాలతో పత్రికను నిలిపివేయడం జరిగింది.

అక్షరజ్ఞానం లేని అజ్ఞాన పత్రికాధిపతుల విచిత్రమనో దౌర్బల్యానికి లొంగి సంపాదకులు తమ సంపాదకీయాలు రాస్తున్న పరిస్థితి నేడుంది. ఈనాటి సంపాదకులకు లేనిదీ సురవరం ప్రతాపరెడ్డికి ఉన్నదీ ఆత్మస్థైర్యం, సాహసం, తెంపరితనం. సంపాదకులు నిర్భీకులు, నిరంకుశులు, పాఠకులను చైతన్యపరిచే వ్యాసాలు, సంపాదకీయాలు, లోకవ్యవహారం మాత్రమే తన లోచనకు ఆలోచనకూ సాధనంగా తీసుకుని పత్రికస్వేచ్ఛను ప్రపంచానికి చాటిన మహనీయులు సువరం. నిజాం పరిపాలన, నిరంకుశత్వంపైన, పన్ను వసూళ్ళ నిర్బంధంపైన, సమకాలీన సాంఘిక చెడుగుల పట్ల నిర్విరామంగా నిరంతరం నిరసన తెలుపుతూ ఆసాంతం సామాన్య ప్రజలను వారి స్థాయినుంచీ మరింత ఉన్నతీకరించేందుకు వారి విశాల ప్రయోజనాల పరిరక్షణకోసం, వారిలో సంపూర్ణ మార్పు, వికాసాల కోసం తన జీవితాన్ని, కలాన్ని, ధనాన్నీ, శక్తినీ, శ్రమను రాజీలేకుండా వెచ్చించిన మహనీయుడు సురవరం ప్రతాపరెడ్డి. సంప్రదాయ సంకెళ్ళ విచ్ఛేదన, ప్రజల సమైక్యత కోసం దక్షతతో, దీక్షతో కొత్తదారులవెంట కొత్తపుంతలు తొక్కి, తను గోలకొండ పత్రికలో చేసిన వేలాది రచనలు తెలంగాణాకే కాదు తెలుగు తల్లికే కంఠాభరణాలు.

1925లో మొదటిసారి శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయంలో మాడపాటి హనుమంతరావు కోరికపై 'నిజామాంధ్రులు' అనే అంశంపై ఉపన్యసించిన ప్రతాపరెడ్డి అప్పటినుండి గ్రంథాలయోద్యమం వంటి వివిధ ప్రజాఉద్యమాలలో ఉపన్యాసాలు చేసి ప్రజల్ని చైతన్యపరుస్తూ వారిని ఉద్యమోన్ముఖులను చేశాడు. 1930వ సంవత్సరంలో మెదక్ జిల్లా జోగిపేటలో జరిగిన ప్రథమాంధ్రమహాసభకు అధ్యక్షునిగా వ్యవహరించి ఆంధ్రమహాసభలను ప్రారంభించాడు. ఈ ఆంధ్రమహాసభలు తెలంగాణీయుల సమిష్టి ఆశయాలకు, ఆకాంక్షలకు ప్రతిరూపమై నడిచాయి. ఆంధ్ర జన సంఘం, ఆంధ్ర జన కేంద్ర సంఘం సభలలో స్థానిక సమస్యలకే ప్రాధాన్యత ఇవ్వబడింది. జోగిపేటలో ప్రారంభమైన ప్రథమాంధ్రమహాసభ యావత్ తెలంగాణ అభ్యుదయానికి బాటలు వేస్తూ ప్రజల కష్టసుఖాలలో పాలుపంచుకుంటూ ముందుకు సాగింది. 1931 నుండి 1934 వరకు ఆంధ్రమహాసభ కార్యదర్శిగా సురవరం ప్రతాపరెడ్డి గారు పనిచేశారు. ఈ సభ అనంతరం వేరు వేరు జిల్లాల్లో జరిగిన మహాసభల నిర్వహణలో మాడపాటి హనుమంతరావుకు చేదోడు వాదోడుగా నిలిచి ఆంధ్రమహా సభా ఉద్యమానికి స్ఫూర్తినీ, కీర్తినీ, జవజీవాలను ఇచ్చాడు. 1937లో నిజామాబాద్‌లో జరిగిన 6వ ఆంధ్రమహాసభకు మందుముల నర్సింగరావు అధ్యక్షతవహించారు. ఆ సభలో ఒక ముస్లింవ్యక్తి ఉర్దూలో ప్రసంగించడానికి అధ్యక్షుడి అనుమతి కోరగా ఆయన బూర్గుల రామకృష్ణారావును సంప్రదించగా బూర్గులవారు 'భాషలో ఏముంది.... భాష యెడ సంకుచిత్వం పనికిరాదని' అతనిని ఉర్దూలోనే మాట్లాడమని సలహా ఇచ్చారు. దీనితో దేశాభిమానులు, భాషాభిమానులూ అయిన ఆ సభలోని యువకులు సురవరం ప్రతాపరెడ్డి నాయకత్వంలో ఆంధ్రమహాసభలో ఉర్దూ ప్రసంగాలు సంప్రదాయ విరుద్ధమని, మహాసభ స్ఫూర్తికీ, ఉద్దేశానికీ అది వ్యతిరేకమని ప్రతిఘటించి ఆ సభను బహిష్కరించడమే కాకుండా పోటీగా మరోచోట సభలు నిర్వహించి దానికి 'అభివృద్ధి పక్షం' అని పేరుపెట్టారు. ఈ పక్షంలోని యువకుల భావాలు, అభిప్రాయాలను పదునైన వ్యాసాలుగామార్చి గోలకొండ పత్రికలో ప్రచురించి యువకులను ప్రోత్సహించారు. 1938 సం. స్టేట్ కాంగ్రెస్ పక్షాన సత్యాగ్రహం చేయడానికి సన్నాహాలు జరిగాయి. మందుముల రామచంద్రరావు సురవరం ప్రతాపరెడ్డిని స్టేట్ కాంగ్రెస్ పక్షాన సత్యాగ్రహం ఉద్యమంలో దించడానికి ప్రయత్నం చేశారు.

అయితే సురవరం ప్రతాపరెడ్డి గారు. ఇది సత్యాగ్రహానికనువైన సమయం కాదని ఉద్యమానికి విముఖుడిగా ఉన్నారు. అయినా మందుముల రామచంద్రరావు మాట కాదనలేక సత్యాగ్రహానికి అంగీకరించారు. ఇంతలో ఆయన భార్య ఆరోగ్యం క్షీణించడం వల్ల గ్రామంలో దాయాదుల మధ్య గొడవలు జరగడంతో స్వగ్రామం వెళ్ళి దాదాపు 20 రోజులు గ్రామంలో ఉండి భార్య ఆరోగ్యం కుదుటపడిన తరువాత డిసెంబర్ 15, 1938న సత్యాగ్రహం చేయుటకు సురవరం ప్రతాపరెడ్డి గారు సిద్ధపడ్డారు. ఇంతలో మందుముల రామచంద్రరావు జ్వర పీడితుడైనాడు. సత్యాగ్రహాన్ని డిసెంబర్ 23కు మార్చినారు. ఈలోగా మహాత్మాగాంధీ గారు సత్యాగ్రహం చేయవద్దని ఉద్యమకార్యకర్తలకు సందేశం పంపారు. ఇలాంటి సందర్భంలో సత్యాగ్రహం ప్రారంభించి జైలుపాలగుట కాంగ్రెస్ నియమాలకు విరుద్ధమని సురవరం ప్రతాపరెడ్డి వాదించారు. మందుముల రామచంద్రరావు ఇతర ఉద్యమ కార్యకర్తలకు సురవరం ప్రతాపరెడ్డికి మధ్య భేదాభిప్రాయాలు తలెత్తాయి. ఆనాటి నుండి సురవరం ప్రతాపరెడ్డి ప్రత్యక్ష రాజకీయాలకు దూరంగా ఉంటూ వచ్చారు.

శాస్త్రజ్ఞాన పరిశీలనానుశీలన తాత్పర్య బుద్ధులు కానివారికి వాల్మీకి రామాయణ రహస్యాలు అర్థం కావని భావించి, అందులోని గ్రంథ గ్రంథులు విప్పి వ్యాఖ్యానించి విశదంగా పేర్కొన్నారు. ప్రతాపరెడ్డి తన పరిశీలనలో ప్రచారంలో వున్న వాల్మీకి రామాయణం అంతా వాల్మీకిచే రచించబడలేదని తేల్చి చెప్పాడు. ప్రాచీన వాల్మీకి రామాయణం ఆధునిక సంస్కృత భిన్న వృత్తాలతో రచించబడలేదని 'అనుష్టుభ్‌లతో' ఛందస్సు కొంచెం మార్పు చేసి లౌకిక ఛందో రూపమైన ప్రక్రియలోకి మార్చినట్టు గుర్తించాడు. వైదిక చందస్సు 8 అక్షరాలు కల 4 పాదాలు కలది. దానికి గురు, లఘు నియమం లేదు. ఈ 'అనుష్టుభ్‌లతో లౌకిక వాఙ్మయములోకి తెచ్చేందుకు, ప్రథమ,ద్వితీయ పాదాల్లో పంచాక్షరాలు, ద్విత్వాలు, చతుర్థ పాదాల్లో సప్తమాక్షరములు నియమయుక్తాలుగా చేసి పాడునపుడు లయకు అనుగుణంగా వాల్మీకి రామాయణాన్ని లౌకికానికి తెచ్చాడని ప్రతాపరెడ్డిగారి పరిశోధన. వాల్మీకి తొలుత సాధించిన రామకథ అనుష్టుప్లతో కూర్చబడి నేటి రంగనాథ రామాయణంలో ద్విపద గాథవలె వుండడమేగాక, రామాయణ కథే భారత అరణ్య పర్వంలో 723 అనుష్టుభ్‌లతో చెప్పబడిందని తేల్చడం, జైన, బౌద్ధ మతాంశాలు / గాథలు ఎలా రామాయణంలో చేరాయో కూడా ప్రతాపరెడ్డి సునిశితంగా వివరించారు. వానర రాక్షస తత్వాలను,అనాటి సాంఘిక ఆచారాలను వివరిస్తూ రామాదులు మాంస, గోమాంస, మధుపర్కభక్షణములు చేశారని అవి ఆనాటికే కలవని, అవి అప్పటికి శాస్త్ర విరుద్ధములు కావని మత్స్య మాంస భక్షణము దోషము కాదని వివరించారు.

గతాన్ని తవ్వి వర్తమానాన్ని బేరీజువేస్తూ... ఒక జాతి సాహిత్య, సాంస్కృతిక చరిత్రను 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' రూపంలో గ్రంథస్తం చేసి నిద్రాణమైన వ్యవస్థకు పునరుజ్జీవనం కల్పించాడు. ఆధునికాంధ్ర చరిత్ర రచనా రంగంలో కూడా ఒక చైతన్యాన్ని కలిగించారు. సురవరం ప్రతాపరెడ్డి ప్రతిభా సామర్థ్యాలు, ప్రాచీన కావ్యతత్వానుశీలనా విధానాలు వాటిలోని చారిత్రాంశాల పరిశీలన తెలుగులో నూతనంగా ప్రవేశపెట్టగలిగింది. ఇందులో ఆనాటి క్రీడాంశాలు వంటి అతిసూక్ష్మమైన అంశాలే కాకుండా... అనాటికి లభ్యమవుతున్న సాహిత్య గ్రంథాలయిన బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, ఆముక్తమాల్యద, క్రీడాభిరామం, శ్రీనాథుని చాటువులు, పలనాటి వీరచరిత్ర, పరమయోగి విలాసము, శుకసప్తశతి, వెంకటనాథుని పంచతంత్రం, శతకాలు, దండకాలు, పాండురంగ విజయం,కాళహస్తిమహత్యం, సత్యహరిశ్చంద్ర ద్విపద కావ్యంతో బాటు తెలంగాణ శాసన గ్రంథాలను, అమీర్ ఖుస్రూ 'నూరే నిహార్', ఖాజానూర్ 'పాతెహా' అనే గ్రంథాల నుంచి అనేకానేకమైన ఆసక్తికర విశేషాలను, రసగుళికలను ఎంతో పరిశ్రమించి ఏర్చికూర్చి ఆంధ్రుల సాంఘిక చరిత్రను తెలుగు చరిత్ర రచనా ప్రక్రియలో వొక విశిష్ట గ్రంథంగా మలచి చరిత్రకారులకు మార్గదర్శి అయ్యాడు. అలాగే కృష్ణాష్టమి, శ్రీరామనవమి, భీష్మ ఏకాదశి, ఉగాది, సంక్రాంతి, హోలీ, రథసప్తమి, చాతుర్మాసవ్రతాలు, శివరాత్రి, ఏకాదశి, వినాయక చవితిలాంటి పండుగల విశిష్టతను పరంపరగా వస్తున్న విశ్వాసాల నేపథ్యంలో వివరించి వాటి హేతుబద్ధతను చర్చిస్తూ 'హిందువులపండుగలు' అనే విశిష్ట గ్రంథాన్ని రచించారు. మొదటిసారిగా 1915వ సం.లో VOOTHBY అనే ఆంగ్లేయుడు రచించిన"In Freedom`s cause అనే నవలను తెలుగుచేసినప్పటికీ ఇంట్లో వారి నిర్లక్ష్యం వల్ల ఈ నవల కాగితాలు మిఠాయి కొట్టుకు చేరాయి. 1917లో శుద్ధాంతకాంత అనే నవలను రచించాడు. 1921లో ఉచ్ఛల విషాదమనే అనే నాటకాన్ని రచించారు. ఈ నాటకాన్ని 1933లో గోలకొండ ప్రెస్లో ముద్రించారు. 1924లో భక్తతుకారాం నాటకాన్ని రచించారు. ఇది మద్రాసు నుండి వెలువడే కళ అను పత్రికలో సీరియల్‌గా ప్రచురించారు. తరువాత 1952లో ప్రజావాణి ప్రెస్లో ప్రచురించారు. చిన్న చిన్న పుస్తకాలు గ్రామజనదర్పణం, ఎల్లోరా శిల్పం, పూనా వ్యవసాయ ప్రదర్శన, కర్నూలు రాజుల వంశావళి, నిజాం రాష్ట్ర పాలనము, గ్రంథాలయోద్యమము, మద్యపానము అనే వాటిని 1920 నుండి ప్రచురిస్తూ వచ్చారు. హైందవ ధర్మ వీరులు లేదా పోలీసులు అనే పుస్తకాన్ని దేశోద్ధారక గ్రంథమాల తరపున వట్టికోట ఆళ్వారు స్వామిస్వామి ప్రచురించారు. 1925లో సంఘోద్ధరణం అనే పేరుతో అప్పుడప్పుడు రాసిన వ్యాసాలను పుస్తకరూపంలో ముద్రించారు. ప్రతాపరెడ్డి అనే పేరుతో 12 చిన్నకథలు గోలకొండ పత్రిక తరపున ముద్రించారు. మొగలాయి కథలు అణా గ్రంథమాలవారు ప్రచురించారు. ప్రాథమికసత్వములు లేదా ప్రజాధికారములు అనే 1939లో దేశోద్ధారక గ్రంథమాల వారు ప్రచురించారు. రాజబహద్దూర్ వెంకట్రామారెడ్డి గారి జీవితచరిత్రను 1938లో ప్రచురించారు. చంపకి భ్రమరవిశాదము అనే పద్యకావ్యము, హరిశర్మోపాఖ్యానము అనే పద్యకావ్యములు ప్రచురించకముందే కాలగర్భంలో కలిసిపోయాయి. హంవీర సంభవము అనే చిన్న పద్యకావ్యము 10 పేజీలలో ముద్రించారు. ఆంధ్రలిపి సంస్కరణము అనే పుస్తకాన్ని విజ్ఞానవర్ధని పరిషత్ వారు 1947లో ప్రచురించారు. మిత్రస్మృతి పేరుమీద కర్నూలు వాస్తవ్యులు ప్రతాపరెడ్డి మిత్రులు వేలాల సుబ్బయ్య మరణించినప్పుడు వ్రాశారు. మిత్రుడా, పద్మిని అనే 200 పంక్తుల గీతమాలిక, ఈశ్వరయ్య అనే పేరుతో కొన్ని పద్యాలు, మహ్మద్ ఘజ్నవి అనే పేరుతో 125 పంక్తుల గీతమాలిక, స్వాగతం అనే పేరుతో కర్నూలులో జరిగిన 7వ రెడ్డి జనసంఘం మహాసభలో చదివిన కొన్ని

పద్యాలు మద్యపానం పేరుతో కొన్ని పద్యాలు, ప్రబోధం, రతన్‌దేవీ ధర్మపద, నీతి పంచకం, ప్రణయిని, ప్రార్థనము, అస్పృశ్యత, ఎంతో సూరత్వం అనే పేరుతో కొన్ని పద్యాలు, మహబూబ్నగర్ భాష అనే పేరుతో సీస పద్యాలు, వేదం వేంకటరాయ శాస్త్రిపై సీస పద్యం, పరుషవేది అనే పేరుతో సీస పద్యాలు, వెట్టివాని పాట పేరుతో దండకం, లుబ్ధాగ్రేసర చక్రవర్తి అనే పేరుతో పద్యాలు, పౌరాణిక కేంద్రజాలం పేరుతో పద్యాలు, ధర్మాసనం అనే పేరుతో 210 పంక్తుల గీతమాలిక, ప్రేమార్పణం అనే పేరుతో 20 పంక్తుల గీతమాలిక, హంభీర సంభవం అనే పేరుతో పద్యాలు, బాలశిక్ష, తింత్రిని, పేడి పేరుతో కొన్ని పద్యాలు, భావకవి నైతినోయ్ అనే పేరుతో గేయం, గ్రామ్యం బెబ్బులి అనే పేరుతో పాట, అస్తమా అనే పేరుతో, సోత్కాఖ్యాయిక, ఆస్తినాస్తి చికిత్స, గద్వాల సంస్థాన భాషాపోషణము, మా తెలుగు, తుంగమాత, వసంతం పేరుతో కొన్ని పద్యాలు ఇలా అనేక చందోబద్ధ కవిత్వం, కథలు, చమత్కారాలు, వ్యంగ్యాలు, స్మృతులు, అధిక్షేపాలు, ప్రశంసలు, ప్రేమ కథలు అన్ని రకాల ప్రయోగాలను సురవరం ప్రతాపరెడ్డి కాలానుగుణంగా చేస్తూ వచ్చారు.

గ్రామీణ ప్రాంతాలలో పెద్దబాలశిక్ష తరువాత యువజనులకు విజ్ఞాన విలాసాలను అందించాలనే ధ్యేయంతో 'యువజన విజ్ఞానం' అనే గ్రంథాన్ని రచించారు. కథలు, నాటకాలు, దండకాలు, కవితలు పద్యలేఖలు, మొదలైన అన్ని రకాల సాహిత్య ప్రక్రియలలో వైవిధ్యభరితమైన రచనలు చేసిన ప్రతిభాశాలి సురవరం ప్రతాపరెడ్డి. ఆయన అనేక సారస్వత, వైజ్ఞానిక సంస్థల ఆరంభానికి ఆద్యుడు. ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితల సంఘం, విజ్ఞాన వర్ధినీ పరిషత్తు. లక్ష్మణరాయ పరిశోధక మండలి, శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయం, వేమనాంధ్రభాషా నిలయం, ఇలా పలు సంస్థల స్థాపనతో బాటు ఆంధ్రవిద్యాలయం, బాలికోన్నత పాఠశాల, ఆయుర్వేద విద్యాలయం, సంస్కృత విద్యాలయంలాంటి ఎన్నో సంస్థలకు వెన్నుదన్నుగా వుండి ప్రోత్సహిస్తూ వాటి అభివృద్ధి వికాసాలకై నిత్యమూ శ్రమించాడు.

**సామాన్య, కర్షక యువకుడు బుద్ధిజడతకు పేరుపొందిన గ్రామసమాజాన పుట్టి, వీధి బడులు, సంతలు,గుంటరాతలు, సిరిచుక్కలు, కోదండాలు పునాదిగా వున్న వ్యవస్థ దాటి సురవరం ప్రతాపరెడ్డి చేసిన ప్రయాణం అనుక్షణం అభ్యుదయ పథంలో కొత్త పుంతలు తొక్కి పురోగమించింది. ఆంగ్లాంధ్ర, సంస్కృత, కన్నడ, హిందీ, ఉర్దూ భాషల్లో ఆయనకున్న విశేషమైన పాండిత్యం ఆయన రచనలను విజ్ఞానవంతం చేశాయి. నడవడిలో సారళ్యం,పలుకుబడిలో మాధుర్యంతో, జీవశక్తిగా ఆయన రచనలు కొనసాగాయి. తెలుగుకు సౌందర్యం ఉంది, సౌలభ్యం ఉంది, సౌశీల్యం ఉంది, ఔన్నత్యం వుంది అని చెబుతూ ఉర్దూ రాజభాషగా ఉన్న రోజుల్లో తన రచనలతో తెలుగు వారిని జాగృతపరిచి నిజాంరాష్ట్ర ప్రజల గుండెల్లో తెలుగుభాషకు పట్టం కట్టాడు.**

సురవరం ప్రతాపరెడ్డిగారు తను జీవించిన కాలాన్ని దాటి ఎంతో ప్రగతిశీలంగా పయనించారు. అస్పృశ్యత పోవాలని ఆయన చిత్తశుద్ధితో వాంఛించడమే కాక ఆచరించారు. ఆయన సాహిత్యజీవితం చేసిన **కృషి వాసిలోనూ రాశిలోనూ మహత్తరమైనది. ఉద్యమాలలో ముఖ్యంగా గ్రంథాలయ ఉద్యమం, ఆంధ్రోద్యమం,రాజకీయోద్యమాలలో తలమునకలవుతూనే 20కి పైగా సాహిత్య,పరిశోధక గ్రంథాలు వెయ్యికి పైగా వ్యాసాలు జీవితపు వాస్తవాలను ప్రతిబింబించే కథలు ఆయన సృజించిన ఇతర సాహిత్యం, సామాజిక బాధ్యతను ప్రజల పట్ల ప్రేమను ఆయన హృదయస్పర్శను ఆయన జన్మించిన 127 సంవత్సరాల తర్వాత కూడా మనకు మార్గదర్శకంగా నిలిచాయి.**

రచయిత కుర్రా జితేంద్రబాబు ప్రముఖ పరిశోధకుడు,
రచయిత, బహుగ్రంథకర్త: సాహితీసదన్, మునగాల

**కవిత**

## తెలుగు - నా భాష

నా మాట నా పాట
అక్షరం అక్షరంలో ఒలికే వయ్యారం
నీ గొప్పతనమేనని వేరే చెప్పాలా అమ్మా ?
ఆప్యాయత పరవళ్ళు తొక్కుతోంది గొంతులో
నీ పలుకు చిరుపెదాలను స్పృశించి నంతనే !
ఎంతో మందితో అనురాగపు బంధాలకు
నీవే కదా నాకు వారధి?
మమకారపు మధురిమ ఉప్పొంగి ఉరికేది
నీ సన్నిధానపు వాకిట్లోనేగా
అనురాగపు వెల్లువ కట్టలు తెచ్చుకునేది
నీ లాలిత్యపు సిరులలోనే .
నీ గురించి చెప్పటానికి నా దగ్గరున్న మాటలు
సరిపోవటం లేదని ఒకటే మారాం
మనసు నెంత బుజ్జగించినా తృప్తి లేదంటుంది
అమ్మవు కదా ఆపని నీ వల్లే అవుతుంది
భాషకు అందని భావాలను ఎన్నెన్నో ఒడిసిపట్టుకుని
పరుగుల వేటలో గాలిపటంలా నేనే !

యలమర్తి అనూరాధ, హైద్రాబాద్
ఫోన్ : 9247260206

"భాషా పెత్తనం స్వరాజ్యం కాబోదు
మొదటి ప్రాధాన్యత ఎల్లవేళలా మాతృభాషదే
ఆ తర్వాతనే హిందీ భాష....
నిఖార్సయిన ఉన్నతి మాతృభాషతోనే సాధ్యం"
"మాతృభాషను పణంగా పెట్టి ఆంగ్లభాషను
నేర్చుకోవలసివస్తే
అసలు ఆంగ్లభాషను నేర్చుకోవలసిన అవసరం
ఏ దేశానికీ లేదు" **-మహాత్మాగాంధీ**

రమేష్ పట్నాయక్
9440980396

# 'జాతీయ విద్యావిధానం 2020' లో ఏముంది?

**రాష్ట్రాల అసెంబ్లీల్లో, ఎటువంటి చర్చ లేకుండా, చివరికి పార్లమెంటులో ఎటువంటి చర్చ లేకుండా, 2020 జూలైలో కేంద్ర క్యాబినెట్ ఒక విద్యా విధానాన్ని ఆమోదించిన విషయం పాఠకులకు తెలుసు. దాని పేరు 'జాతీయ విద్యా విధానం 2020' ఈ విధానం ఒక కేంద్ర చట్టం కాదు, రాష్ట్ర ప్రభుత్వాలు దానిని అమలు చేయవలసిన అవసరం లేదు. తమిళనాడు ప్రభుత్వం ఈ విధానాన్ని అమలు చేయడం లేదు. కానీ సదరు విధానం ముసాయిదా రూపంలో ఉన్నప్పుడు నుంచి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్నది.**

**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధికార పార్టీ అవసరాలే ఇంతగా దాసోహం కావడానికి ప్రధాన కారణమని అందరికీ తెలుసు.**




**అదలా ఉండగా సదరు విద్య విధానం చేసిన సిఫారసులపై ఆధారపడి గత వారం కేంద్ర క్యాబినెట్ కొన్ని నిర్ణయాలు తీసుకోవడంతో పత్రికలలో తిరిగి చర్చ ప్రారంభమయింది. ఈ సందర్భంగా ఈ విధానానికి సంబంధించిన కొన్ని సాధారణ విషయాలను, కొన్ని నిర్దిష్ట విషయాలను మనం ఇక్కడ పరిశీలిద్దాం.**

**'జాతీయ విద్యావిధానం 2020' సంబంధించిన కొన్ని సాధారణ విషయాలు:**

1) సమానత్వానికి వ్యతిరేకంగా సంపన్నులకు విద్యను పరిమితం చేసే విద్యా వ్యాపారీకరణకు ఈ విధానం రాచబాట వేస్తుంది. ఒక విద్యా సంస్థలో వచ్చిన లాభాలతో మరొక విద్యాసంస్థను పెట్టడానికి మొట్ట మొదటి సారిగా ఈ విధానం చట్టపరమైన అవకాశం కల్పిస్తుంది. ఈ విధానం విద్యా కార్పొరేటీకరణకు, భౌగోళీకరణకు అనుకూలమైనది.

2) ఈ ' జాతీయ విద్యా విధానం' రాష్ట్రాల ఫెడరల్ హక్కులకు వ్యతిరేకంగా అధికార కేంద్రీకరణను ప్రోత్సహిస్తుంది. ఈ విధానం ప్రకారం పాఠశాల పాఠ్యపుస్తకాలను కూడా ఢిల్లీలోనే తయారు చేస్తారు.

3) పదేపదే పౌరుల ప్రాథమిక బాధ్యతల గురించి మాట్లాడిన ఈ విధానం పౌరుల ప్రాథమిక హక్కుల గురించి మాట్లాడలేదు. భారత రాజ్యాంగం పీఠికలో ఉన్న సామ్యవాదం, లౌకికవాదం అన్న పదాలకు కూడా ఈ విధానంలో చోటు దొరకలేదు.

4) ఈ విధానం ప్రకారం విద్యాసంస్థలలో నియామకాలు, పదోన్నతులకు సంబంధించి రిజర్వేషన్ల ప్రస్తావన లేదు. సీనియారిటీ పాటించనవసరము లేదని స్పష్టంగా ఈ విధానంలో పేర్కొనబడింది. ఇక ప్రతిభ గురించి అనేక సందర్భాలలో మాట్లాడిన ఈ విధానం ప్రతిభను విద్యాపరమైన క్రెడిన్షియల్సుగా చెప్పలేదు. విద్యా ప్రమాణాల స్థానంలో సామాజిక స్పృహను ఈ విధానం ముందుకు తీసుకు వచ్చింది. సామాజిక స్పృహయే ప్రతిభ అనే అర్థంలో ఈ విధానం రూపొందించబడింది. వివిధ పార్టీలకు సామాజిక స్పృహ అన్నమాటకు వేరువేరు అర్థాలు ఉన్నాయి. మెరిట్ కి సామాజిక స్పృహ అని అర్థం ఇస్తే అధికార పార్టీ విధానాలను ఆమోదించిన వారికే పదోన్నతి అనే పరిస్థితి వస్తుంది.

5) ఈ విధానంలో అన్నిటికంటే ముఖ్యమైనది, ప్రమాదకరమైనది ఏమంటే, విద్యను మతవాదంతో, మనువాదంతో ముడి పెట్టడం. చరిత్రను మతవాద దృక్పథంతో చూడడం. సంస్కరణ ఉద్యమాన్ని, స్వాతంత్రోద్యమాన్ని తక్కువ చేయడం, నేడు సమాజంలో ఉన్న వివక్షతలను గుర్తించడానికి నిరాకరించడం, వివిధ సామాజిక హక్కుల కొరకు ప్రజలు చేసిన పోరాటాలకు ఇంతవరకు ఉన్న గుర్తింపును తొలగించడం. సామాజిక శాస్త్రాల్లోనే కాక ప్రకృతి శాస్త్రాల్లో కూడా అనేక సంకుచిత విధానాలను ప్రోత్సహించడం.

ఒక్కమాటలో చెప్పాలంటే **'జాతీయ విద్యా విధానం 2020'అనేది విద్యా వ్యాపారానికి అనుకూలంగా, అధికార వికేంద్రీకరణకు వ్యతిరేకంగా, భారత రాజ్యాంగ విలువలకు చోటు లేకుండా, నియామకాలలో పదోన్నతుల్లో నియమబద్ధ విధానాల స్థానంలో అధికారుల మంత్రుల విచక్షణకు అవకాశం కల్పించేదిగా, పాఠ్యాంశాలను మనువాదంతో మతవాదం తయారుచేసేదిగా రూపొందించబడింది. వాటిని సవివరంగా చెప్పడం ఇక్కడ సాధ్యం కాదు.**

ప్రస్తుతానికి, కేంద్ర ప్రభుత్వం ప్రత్యేకంగా ఆమోదించిన విధానాలకు పరిమితం అవుదాం.

**నిర్దిష్ట విషయాలు:**

1) ఇంతవరకు పాఠశాల విద్య ఒకటవ తరగతి నుండి 12వ తరగతి వరకు ఉంది. దీనికి పూర్వ ప్రాథమిక విద్య కలిపారు. అయితే పూర్వ ప్రాథమిక విద్యను ఒక ప్రాథమిక హక్కుగా గుర్తించలేదు.

ఇంతవరకు 1నుంచి 5వ తరగతి వరకు ప్రాథమిక విద్య అని, 6,7,8 తరగతులను ప్రాథమికోన్నత విద్య అని, 9,10 తరగతులను సెకండరీ విద్య అని 11, 12 తరగతులను హయ్యర్ సెకండరీ విద్య అని వ్యవహరించడం ఉంది.

కొత్త విద్యా విధానం ప్రకారం పూర్వ ప్రాథమిక విద్యను ఒకటి రెండు తరగతులను కలిపి ఫౌండేషన్ విద్య అని, 3,4,5 తరగతి లను ప్రిపరేటరీ విద్య అని, 6,7,8 తరగతులను మిడిల్ పాఠశాల అని, 9, 10, 11, 12 తరగతులను సెకండరీ పాఠశాల అని వ్యవహరిస్తారు. ఈ జాతీయ విద్యా విధానాన్ని సాకుగా చూపించి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ప్రాథమిక పాఠశాలలను ముక్కలు చేసి 3,4,5 తరగతులను ఉన్నత పాఠశాలకు తరలిస్తూ పెద్ద ఎత్తున విధ్వంసం సృష్టిస్తుంది.

2) ఈ కొత్త విద్యా విధానం ప్రకారం పదవ తరగతి పరీక్షలు కూడా అంటే బోర్డు పరీక్షలు కూడా తప్పనిసరి కాదు. పదవ తరగతి పరీక్షలు రద్దు కావడంతో ప్రభుత్వ పాఠశాలలో విద్య మరింత నిర్లక్ష్యానికి గురి కాగలదు. పరీక్షలు లేని విద్య గొప్పదే కానీ, విద్యా వ్యాపారాన్ని రద్దుచేసి కామన్ స్కూల్ విధానాన్ని అమలు చేసినప్పుడు మాత్రమే పరీక్షలు అవసరము లేని బోధనను ప్రవేశపెట్టడం సాధ్యమవుతుంది. ఒకవైపు విద్యా వ్యాపారాన్ని విస్తరిస్తూ మరొకవైపు పరీక్షలను రద్దు చేస్తే ప్రభుత్వ పాఠశాలలకు వస్తున్న విద్యార్థులు తీవ్రంగా నష్టపోతారు. పాలకులకు ఈ విషయం తెలియదని అనుకోలేము.

3) ఈ విద్యా విధానం ప్రకారం మూడు సంవత్సరాల డిగ్రీ ని నాలుగు సంవత్సరాల ఆనర్స్ కోర్సుగా మారుస్తున్నారు అందులో అభ్యంతరకరమైనది ఏమీ లేకపోయినా అమెరికా విద్యా విధానాన్ని అనుకరించడానికి విద్యారంగంలో గ్లోబల్ వ్యాపారాన్ని విస్తరించడానికి అలా చేస్తున్నారని గ్రహించాలి.

**ఇంతకంటే ప్రధానమైన విషయమేమంటే, డిగ్రీ మొదటి సంవత్సరాన్ని** certificate course **గాను, డిగ్రీ 1,2 సంవత్సరాలను కలిపి డిప్లమా కోర్స్ గాను గుర్తించి మధ్యలోనే చదువు మానివేయడానికి ఈ విధానం ఒక ప్రోత్సాహకరంగా ఉంది. పేద కుటుంబాల నుంచి వచ్చిన అనేకమంది విద్యార్థులు ఆర్థిక ఒత్తిడిల కారణంగా తమ డిగ్రీని పూర్తి చేయకుండా సర్టిఫికేట్ కోర్సును గాని డిప్లమోను గాని చేసి చదువు మానివేసే అవకాశం ఉంది. ప్రధానంగా ఈ విధానం వల్ల అమ్మాయిలు చదువు మానివేసి పెళ్లిళ్లకు నెట్టబడే ప్రమాదం ఎక్కువగా ఉంది.**

4) ఈ విధానంలో ఒక కోర్సును మధ్యలో ఆపివేసి మరొక కోర్సును చేసుకునే అవకాశం ఇచ్చారు. ఈ అవకాశం ఆర్థికంగానూ సామాజికంగానూ ఉన్నత వర్గాల నుంచి వచ్చిన విద్యార్థులకు కొంత ప్రయోజనం ఇవ్వగలదేమో గాని అత్యధిక విద్యార్థులకు ఇది ఒక గందరగోళ పరిస్థితిని సృష్టిస్తుంది. అవసరమైనంత మంది అధ్యాపకులను కూడా నియమించని ప్రస్తుత పరిస్థితులలో ఇటువంటి సర్కస్ ఫీట్లు చేయడం వలన ఉన్నత విద్యారంగం మరింత దుర్భర పరిస్థితులకు నెట్టి వేయబడగలదు.

5) ఈ విద్యావిధానంలో ఆన్లైన్ విద్యకు చాలా ప్రాధాన్యత ఇస్తున్నారు. సాధారణంగా నడిచే కరస్పాండెన్స్ కోర్సులకే కాక కళాశాలలలో కూడా సగం మంది అధ్యాపకులను మాత్రమే నియమించి మిగతా అధ్యాపకుల పని ఆన్లైన్ ద్వారా నిర్వహించడానికి యు.జి.సి ఏర్పాట్లు చేస్తుంది. ఆన్లైన్ విద్య ద్వారా మాత్రమే ఉన్నత విద్యా అవకాశాలను పెంచనున్నామని ప్రధానమంత్రి గారే స్వయంగా ప్రకటించిన విషయం పాఠకులకు తెలుసు. **ఈ జాతీయ విద్యా విధానం ద్వారా పేదలకు, దిగువ మధ్య తరగతి వారికి ఆన్లైన్ విద్య మాత్రమే అందుబాటులో ఉంటుందని గ్రహించాలి.**

6) ఎంఫిల్ రద్దు చేయడం నాలుగు సంవత్సరాల ఆనర్స్ డిగ్రీ చేసిన వారికి ఒక సంవత్సరం ఎం.ఏ అవకాశం ఇవ్వడము పెద్ద విషయాలు కాదు.

7) 2010 వ సంవత్సరం నుంచి అమలు జరుగుతున్న కేంద్ర విద్యా హక్కు చట్టం ప్రకారం ఎనిమిదవ తరగతి వరకు **ప్రభుత్వ ప్రైవేటు పాఠశాలలన్నింటిలో మాతృభాష మాధ్యమాన్ని అమలు చేయాలి. కానీ మాతృభాష మాధ్యమాన్ని ఐదవ తరగతి వరకే పరిమితం చేస్తూ కేంద్ర క్యాబినెట్ నిర్ణయం తీసుకోవడం చాలా దురదృష్టకరం.**

ఏ సంస్కరణలైతే విద్యా వ్యాపారం లేని దేశాలలో అంటే ఫిన్లాండ్ లాంటి దేశాలలో ప్రయోజనకరంగా ఉంటాయో అటువంటి విధానాలు విద్యా వ్యాపారం విజృంభిస్తున్న మన దేశంలో నష్టదాయకంగా ఉంటాయని కేంద్ర ప్రభుత్వ పెద్దలకు తెలియదని అనుకోలేము.

ప్రభుత్వం నిజంగా విద్యా విధానాన్ని అభివృద్ధి చేయాలి అనుకుంటే, ముందుగా విద్యా వ్యాపారాన్ని అన్ని రూపాలలో రద్దు చేయాలి. రెండవదిగా అన్ని ప్రభుత్వ విద్యాసంస్థలలో తగిన మౌలిక వసతులు కల్పించే అవసరమైనంతమంది ఉపాధ్యాయులను అధ్యాపకులను బోధనేతర సిబ్బందిని నియమించాలి. ఇంకా ప్రధానంగా విద్య కోర్సులన్నీ సామాజిక ప్రకృతి శాస్త్రాలను మానవ శాస్త్రాలన్నీ భారత రాజ్యాంగ విలువైన ప్రజాస్వామ్యం లౌకికవాదం స్వేచ్ఛ సమానత్వము సౌభ్రాతృత్వము అనే విలువలపై ఆధారపడి నిర్మించాలి.

ఇంకా ప్రధానంగా భారతీయ సంస్కృతి చాలా వైవిధ్య భరితమైనదని, ఐదువేల సంవత్సరాలగా ప్రతి సందర్భంలో ఎన్నో చారిత్రక ఘర్షణలను ఎదుర్కొని అనేక మార్పులతో ఈనాడు ఒక ఆధునిక సంస్కృతి వైపు అడుగులు వేస్తుందని గ్రహించడం చాలా అవసరం. భారతీయ సంస్కృతిని హిందూ సంస్కృతికి కుదించడం హిందూ సంస్కృతిని మనుధర్మ శాస్త్రానికి కుదించడం వైవిధ్యాన్ని మార్పును గుర్తించకపోవడం నేటి కేంద్ర పాలకుల హ్రస్వదృష్టికి తార్కాణాలు. వైవిధ్యభరితమైన భారతీయ సంస్కృతిని మనుధర్మానికి కుదించడం కంటే ఈ దేశానికి ఎవరైనా చేయగలిగిన పెద్ద ద్రోహం మరి ఏమీ ఉండదు. ఒక్క మాటలో చెప్పాలంటే 'జాతీయ విద్యా విధానం 2020' ఆ ద్రోహానికే పూనుకుంది.

---

రచయిత ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ కన్వీనర్

## రెండు తెలుగురాష్ట్రాలూ తమ భాషావిధానాన్ని ప్రకటించాలి

రహ్మానుద్దీన్ షేక్
9493035658

# జాతీయ ముసాయిదా పాఠ్యప్రణాళికా చట్రం-2023

భారతదేశ కేంద్ర ప్రభుత్వం 2020లో చట్టం చేసిన జాతీయ విద్యావిధానానికి అనుగుణంగా ఎన్‌సీఈఆర్‌టీ(జాతీయ విద్యా పరిశోధన మరియు శిక్షణ సంస్థ) సంస్థ 2023 ఏప్రిల్ 7న జాతీయ ముసాయిదా పాఠ్య ప్రణాళికా చట్రం విడుదల చేసింది. మొత్తం 628 పుటల ఈ ముసాయిదా దస్త్రంలో ముఖ్యంగా తొమ్మిది నుంచి పన్నెండవ తరగతి వరకు చదువులపై విధానాలను ప్రభుత్వం సూచించింది. కొద్ది రోజులలో ఈ ముసాయిదాను ప్రజల, వివిధ భాగస్వాముల సలహాలు, సూచనలతో పరిపుష్టం చేసి అమలు చేసే విధానాన్ని ప్రకటిస్తారు. 2024-25 విద్యా సంవత్సరం నుంచి ఈ ముసాయిదాలో చెప్పబడిన అంశాలు అమలులోకి వస్తాయి.

ప్రస్తుత ముసాయిదా జాతీయ పాఠ్య ప్రణాళికా చట్రం ఈ ప్రణాళికల మొత్తంలో రెండవది. మొదటిది బడికి ముందుండే రెండేళ్ళ శైశవచదువులు(పూర్వ ప్రాథమిక), ఒకటవ-రెండవ తరగతులు కలుపుకొని నాలుగేళ్ళ తొలి చదువులచట్రం. ఇది దాదాపు ఏడాది క్రితం విడుదల చేసారు. మరొక తొమ్మిది ప్రణాళికా చట్రాలను విడుదల చేసేందుకు ఎన్‌సీఈఆర్‌టీ సిద్ధంగా ఉంది. ఈ ప్రణాళికా చట్రాలు సూచనప్రాయమా లేక ఆచరణాత్మకమా అన్న సందిగ్ధత ఈ ముసాయిదాల్లో స్పష్టంగా కనిపిస్తోంది. కొన్ని అంశాల దగ్గర కచ్చితంగా అమలు పరచండి అన్న ధోరణిలో ఎన్‌సీఈఆర్‌టీ రాష్ట్ర ప్రభుత్వాలను ఆదేశిస్తున్నట్టుంటే, కొన్ని అంశాలలో ఇలా చేస్తే బాగుంటుంది అని సూచిస్తోంది. కొన్ని చోట్ల ఇది అమలు చేస్తే చేయండి లేకపోతే లేదు అన్నట్టుంది. జాతీయ విద్యా విధాన చట్టంలో ప్రతిపాదించినట్టుగా ఈ ప్రణాళికా చట్రపు పత్రాలలో పాత 10+2 పద్ధతిని మానేస్తూ 5+3+3+4 పద్ధతికి అనుకూలంగా పాఠ్యాంశాలను పొందుపరిచారు. ఫౌండేషనల్ (మౌలిక స్థాయి) - పూర్వ ప్రాథమిక నుంచి రెండవ తరగతి వరకు ఉన్న ఐదేళ్ళు, ప్రిపెరేటరి(సంసిద్ధత స్థాయి) - మూడవ తరగతి నుంచి ఐదవ తరగతి వరకు మూడేళ్ళు, మిడిల్(మధ్యమ స్థాయి) - ఆరవ తరగతి నుంచి ఎనిమిదవ తరగతి వరకు మూడేళ్ళు, సెకండరీ(పై స్థాయి) - తొమ్మిదవ తరగతి నుంచి పన్నెండవ తరగతి వరకు నాలుగేళ్ళు, చదువులుగా పాఠశాల విద్యను విభజించారు.




**ఈ కొత్త ప్రణాళికా చట్ర ముసాయిదాలో ఉన్న కొన్ని అంశాలు:**

1. మౌలిక స్థాయిలో, రెండవ తరగతి వరకూ ఎలాంటి పరీక్షలు ఉండవు. పై తరగతులకు ప్రొమోట్ చేసేందుకు మొదటి నాలుగేళ్ళలో ఎలాంటి రాతపరీక్ష ఉండదు. మూడవ తరగతి నుంచి రాత పరీక్షలుంటాయి. విద్యార్థిపై భారం పడకుండా, ఒత్తిడి లేకుండా ఈ పరీక్షలుండాలని స్పష్టంగా ఉంది. మరి రెండవ తరగతి వరకూ విద్యార్థి ఏం నేర్చుకున్నాడో తెలుసుకోవడం ఎలా? విద్యార్థిని గమనిస్తూ వారి చురుకుదనాన్ని, నేర్పును ఉపాధ్యాయులే నిర్ణయిస్తారు, నేర్చుకునే క్రమంలో విద్యార్థి రూపొందించే ఆట-పాటల ప్రదర్శన ద్వారా మూల్యాంకనం ఉంటుంది.

2. సంసిద్ధత స్థాయిలో విద్యార్థులకు, ప్రతి విద్యార్థికి వారి నైపుణ్యాలు, నేర్పులు, అన్ని విధాలా విద్యార్థిని గమనిస్తూ ఉపాధ్యాయులు విద్యార్థికొక పోర్ట్‌ఫోలియో (వ్యక్తిత్వవర్ణనపత్రం) తయారు చేస్తారు. ఈ పోర్ట్‌ఫోలియోలు ప్రస్తుతమున్న రిపోర్ట్‌కార్డుల్లా కేవలం పరీక్షల అంకెల పత్రంలా కాకుండా విద్యార్థి ఆరోగ్యము, సంగీతం, ఆట పాటల్లో చురుకుదనం, ఆహారం తీసుకునే విధానం - ఇలా సర్వతోముఖంగా ఉంటుంది. విద్యార్థులకు పరీక్షలతో పాటుగా వాళ్ళల్లో వాళ్ళు ఒకరినొకరు మూల్యాంకనం చేసుకోవడం(పీయర్ రివ్యూ), స్వయంగా తమను తాము మూల్యాంకనం చేసుకోవడం(సెల్ఫ్-రివ్యూ) కూడా ఉంటుంది. ఐదవ తరగతి చివరన సంసిద్ధత స్థాయి తరగతుల సంచిత మూల్యాంకనం(మూడు తరగతులలో నేర్చుకున్న అంశాలపై ఒకే సారి పరీక్ష) ఉంటుంది.

3. మధ్యమ స్థాయిలో అంటే ఆరు నుండి ఎనిమిదవ తరగతి చదువుల్లో పాఠాలు విద్యార్థి అంశాల గ్రహింపును సక్రమంగా చేసే విధంగా, అధునాతన నైపుణ్యాలు నేర్చుకునే విధంగా రూపొందించాలని ముసాయిదా ప్రణాళికా చట్రం సూచిస్తోంది. మూల్యాంకనం కేవలం రాత పరీక్షల విధానంలోనే కాకుండా, ప్రాజెక్టుల రూపంలో, వాద ప్రతివాద పోటీల రూపంలో, పవర్‌పాయింట్ ప్రదర్శన రూపంలో, పరిశోధనల రూపంలో, ప్రయోగాల రూపంలో, ఆవిష్కరణల రూపంలో, పాత్రాభినయ రూపంలో, జర్నల్ రాయడం ద్వారా, తమ తమ పోర్ట్‌ఫోలియో(వ్యక్తిత్వవర్ణనపత్రం)లు రూపొందించుకోవడం ద్వారా ఉంటుంది. అధ్యాయాంతంలో, త్రైవార్షికాంతంలో, ఏడాది చివరన పాత పద్ధతిలో పరీక్షలు కూడా ఉండాలని ఉంది.

4. పై స్థాయి చదువులు అనగా సెకండరీ స్థాయి, తొమ్మిది నుంచి పదవ తరగతి చదువులలో విద్యార్థి సూచించబడిన

ఎనిమిది విస్తృత పాఠ్యక్రమాల నుంచి పదవ తరగతి పూర్తి చేసుకునే సమయానికి ఒక్కో విస్తృత పాఠ్యక్రమంలో రెండు ముఖ్యమైన కోర్సులను చేసి ఉండాలి. తొమ్మిదవ తరగతి చివరన, పదవ తరగతి చివరన ఏడాది పరీక్షలుంటాయి. ఈ రెండు పరీక్షల ఫలితాల ఆధారంగా పదవ తరగతి పూర్తైనట్టు ప్రమాణపత్రం ఇస్తారు.

5. పదకొండవ,పన్నెండవ తరగతుల్లో విద్యార్థి పైన చెప్పిన ఎనిమిది విస్తృత పాఠ్యక్రమాల నుంచి కనీసం మూడు పాఠ్యక్రమాలను ఎంచుకోవాలి. ఎంచుకున్న పాఠ్యక్రమంలో ఒక్కొక్కదానికి నాలుగేసి చొప్పున కనీసం పన్నెండు కోర్సులను ఎంచుకోవాలి. ఈ పన్నెండు కోర్సులను సెమిస్టర్ పద్ధతిలో, అదనంగా సెమిస్టర్‌కాక కోర్సు కలుపుకొని కనీసం పదహారు కోర్సులు చదువుకోవాలి.

ఈ విస్తృత పాఠ్యక్రమాల ఎంపిక, ఒక్కో పాఠ్యక్రమంలోని కోర్సుల ఎంపిక మొత్తం విద్యార్థి ఎంచుకోవచ్చు. అయితే ఉపాధ్యాయుల అందుబాటునుసరించి కూడా కోర్సుల ఎంపిక ఉండవచ్చని సూచన ఉంది.

| క్రమసంఖ్య | కోర్సుల పట్టిక | విస్తృత పాఠ్యక్రమం కోర్సులు |
|---|---|---|
| 1 | మానవీయ శాస్త్రాలు | భాషలు, సాహిత్యం, తత్త్వశాస్త్రం |
| 2 | సామాజిక శాస్త్రాలు | చరిత్ర, భూగోళం, రాజ్యపాలన శాస్త్రం, మనస్తత్వ శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, సాంఘిక శాస్త్రము |
| 3 | విజ్ఞాన శాస్త్రాలు | భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, జీవ శాస్త్రం |
| 4 | గణితం & సంగణన | గణితం,కంప్యూటర్ సైన్స్, వాణిజ్య గణితం |
| 5 | కళలు | సంగీతం, నృత్యం, రంగస్థలం, శిల్పం, చిత్రలేఖనం, సినిమా సమీక్ష, కథన రచన, నేపథ్య రూపకల్పన |
| 6 | వృత్తివిద్య | నేషనల్ స్కిల్స్ క్వాలిఫికేషన్స్ ఫ్రేమ్‌వర్క్ కు అనుగుణంగా |
| 7 | ఆటలు | ప్రత్యేక ఆట/యోగ/క్రీడ పై కోర్సు |
| 8 | బహుశాస్త్రాంతర పాఠ్యక్రమం | వ్యాపార వర్తకాలు, స్థిరాభివృద్ధి మరియు వాతావరణ మార్పులు, ఆరోగ్యం (ప్రజారోగ్యం, సముదాయారోగ్యం), మీడియా, పాత్రికేయ విద్య, కుటుంబ& సముదాయ శాస్త్రాలు (ప్రస్తుత హోం సైన్స్, భారతీయ విజ్ఞానం, న్యాయశాస్త్రం, |

అ



ఎ. రవీంద్రబాబు
8008636981

# వర్తమాన విపణిలో మాతృభాషల మనుగడ

వస్తు వినిమయ సమాజంలో మనిషి సరుకుగా మారిన సందర్భం ఇది. ఆదాయ వ్యయ అంచనాల మధ్య జీవితాన్ని సరికొత్తగా నిర్వచించుకుంటున్న తరుణం ఇది. ఒకవైపు ప్రాంతీయ, కుల, వర్గ, లింగ, మత అస్తిత్వాలు... మరోవైపు అంతర్జాతీయ ఏకీకృత ఒడంబడికల మధ్య సంస్కృతిని సరికొత్తగా చూస్తున్నసమయం ఇది. మనిషి విభిన్న సంస్కృతుల సమ్మేళనంగా పెరుగుతున్న ప్రస్తుతకాలంలో మాతృభాషలను ఎలా చూడాలన్నది ప్రస్తుత సమస్య. పల్లె నుంచి హైటెక్ నగరాల్లోని కార్పోరేట్ సంస్థల వరకు ఉన్న సంక్లిష్ట, సంయోజన, వైవిధ్య, భిన్నత్వాల మధ్య ఏకీకృతం అబద్ధమని అందరూ తెలుసుకోవాల్సిన వాస్తవం. నేటి వ్యవస్థలో అవసరాలు, అవకాశాలు, ఆదాయాల చుట్టూ పరిభ్రమించే మనిషికి మాతృభాషా ప్రయోజనం ఏమేరకు అన్నది తప్పక గుర్తించాల్సిన చేదు నిజం. మాతృభాష ఆదాయ వనరుగా లేని సమకాలీన వ్యాపార సామాజిక పరిస్థితుల్లో ప్రేమ, అభిమానం, ఆత్మగౌరవం లాంటి భావోద్వేగాలతో దానిని నిలబెట్టలేమన్నది అందరూ గుర్తించాల్సిన వాస్తవం. సజాతీయ, విజాతీయ (అనై)ఐక్యతలోని (అ)మృతతత్వాన్ని ఆస్వాదిస్తుంది ప్రస్తుత వ్యవస్థ. నేటితరం వారి భౌతిక, మానసిక, దైనందిన జీవితాలు 24/7 దిగుమతి చేసుకుంటున్న సంస్కృతిలో వారికి తెలియకుండానే బంధింపబడుతున్నాయి. ఈ నేపథ్యంలో వర్తమాన, భవిష్యత్తరాలకు తెలుగుభాషా ప్రాధాన్యత, అభివృద్ధి దానిపై స్వాత్కర్షతో కూడిన మాటలు.... అవసరమా? అనవసరమా? అవసరమైతే ఏమేరకు?. విద్య, ఉపాధి మార్గాల ద్వారా దీన్ని అధిగమించొచ్చా! సాహిత్య సృష్టి, ప్రచారాలే ఇందుకు మార్గాలా!?

తెలుగునేలపై నిలబడి గతానికి, వర్తమానానికి లంకెను మోస్తున్న కొందరు, తెలుగుభాషా ఔన్నత్యం గురించి, కనుమరుగవుతుందేమోనన్న అర్ధసత్యం గురించి చర్చించడం సబబే. కానీ కాలగర్భంలో కలిసిపోతున్న దేశీయ వస్తువులను కాదని, దిగుమతవుతున్న ఆర్థిక వ్యాపార వస్తు విద్య మాధ్యమాది రంగాలను కాదని, ఉద్యోగ ఉపాధి అవకాశాలకై ఎగుమతవుతున్న మానవ వనరులను కాదని మాతృభాష గురించి చర్చించలేమన్నది స్వీకరించాల్సిన నిజం. రాజ్యాంగపరమైన బాధ్యతలను విస్మరించిన పాలకులను కాదని, ఎగువ తరగతి జీవన విధానాలను అందిపుచ్చుకోవాలన్న మధ్య తరగతి ఆశల సౌధాన్ని కాదని, ధ్వంసమవుతున్న కిందితరగతుల అస్తిత్వాలను కాదని తెలుగుభాష గురించి మాట్లాడకూడదన్నది తెలుసుకోవాల్సిన వాస్తవం.

ఆంక్షల కాంక్షల మధ్య విదేశీ పెట్టుబడులు స్వీకరిస్తున్న కేంద్ర, రాష్ట్రాల ఆర్థిక పరిస్థితులు- భూములు, పరిశ్రమలు, సంస్థల అమ్మకాలతో సతమతమవుతున్నాయి. 1990ల తర్వాత ఆర్థిక వ్యవస్థ- అతలాకుతలమైన స్వదేశీకోసం, విదేశీయతకు ఆహ్వానం పలికింది. క్రమంగా నేటికది విద్య, వైద్యరంగాలనే కాదు, భావితరాలనూ అమ్మకానికి పెట్టి అప్పుల ఊబిలోకి లాగేసింది. కోరికలను నిత్యావసరాల స్థాయికి చేర్చిన వ్యాపార సామ్రాజ్యం దేశీయతకు ఉరులు బిగించి అంతర్జాతీయ విపణికి పట్టం కట్టింది. ఈ క్రమంలో కార్పొరేటీకరణ నుంచి సైబరీకరణ వరకు, లిఖితం నుంచి డిజిటలైజేషన్ వరకు సాగుతున్న ప్రయాణంలో మాతృభాషల అవసరం మేడిపండులా మారింది. ఇచ్చిపుచ్చుకునే ఒప్పందాల మధ్య స్వభాషల ప్రసక్తి లేకపోయినా, దిగుమతి సరుకుల భాషే వాహికగా మారుతుందన్నది ఒప్పుకోక తప్పదు. వ్యాపార సూత్రాలలో అమ్మకం ముఖ్యమైనా, పరభాషలోనే వస్తు, సేవల వినియోగం చాలావరకు జరుగుతోంది. వ్యక్తి వినియోగదారుడిగా మారే క్రమంలో వస్తు వ్యామోహంలోకి జారుకొని పరభాషవైపు తెలియకుండానే ఆకర్షితుడవుతున్నాడు. స్థాయి, అవసరాన్ని బట్టి పదాల నుంచి వాక్యాల వరకు నేర్చుకుంటున్నాడు. గ్రామీణ నిరక్షరాస్యులు కూడా ఆంగ్ల పదాలను అనుకరించడం వెనుక 'గౌరవం, హోదా' అనే అపోహలు ఉన్నాయి అనడం కంటే, అవి జీవిత అనుభవాల తాలూకూ నిజాలని ఒప్పుకోవాలి. అయితే ఇటీవల ఈ వ్యవస్థలోని వ్యాపార ప్రకటనలు, వెబ్ సైట్స్,. యాప్స్ రూపాల్లో కొంత తెలుగీకరణ జరిగినా అది అంతంత మాత్రమే. దీనివల్ల తెలుగుభాషకు కొంత ఉపయోగం జరిగినా, దీనిని నయావలసవాదంలో వస్తుసేవల అమ్మకంకోసం ముందుకొచ్చిన వ్యాపార రహస్యంగానే అర్థం చేసుకోవాలి.

### సంస్కృ(త)తీ'కరణ - ఆంగ్లీకరణ

కొంతకాలం క్రితం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం "తెలుగు అకాడమి"ని "సంస్కృతం, తెలుగు అకాడమి"గా మారుస్తున్నట్లు ప్రకటించింది. చరిత్రలో ఒకప్పుడు సంస్కృతం రాజభాష. పాళీ, శౌరసేని లాంటివి ప్రజల భాషలు. నేడు ఆంగ్లం అ(న)ధికారిక రాజ్యభాష. తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం, మరాఠీ... లాంటివి ప్రజల భాషలు. కానీ సంస్కృతాన్ని ఉద్ధరించే ఆనాటి దేశపాలకుల బాటలోనే రాష్ట్రప్రభుత్వం ఆలోచించి, తెలుగు అకాడమి ఆదాయాలకు లాభమన్నది. దీనిలోని సత్యాసత్యాల వెనకున్న అంతరార్థాన్ని అంచనావేయాలి. అయితే పాఠశాల స్థాయి నుంచి ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టే ఆలోచనలో 'సంస్కృత'కరణ కొంతవరకు ప్రశ్నగా మిగులుతుందని పై (కేంద్ర) పాలకులు ఆలోచించే ఉంటారు. కుల, వర్గ, ప్రాంతీయతల అంతరాలను తెంచడంలో ఆంగ్లవిద్య కొంతవరకు ఉపకరిస్తుందనడంలో నిజముండొచ్చేమో!? ప్రగతిశీల వాదులు ఆలోచించాలి.

రెండు తెలుగు రాష్ట్రాలలో ఆంగ్లవిద్య ప్రైవేటువిద్యాసంస్థలలో నల్లేరుమీద నడకలా సాగిపోతోంది. ప్రభుత్వ పాఠశాలల్లోనూ ప్రజాభీష్టమై విజయకేతనాలు ఎగరవేస్తోంది. శాస్త్రీయతకు లొంగని మోహపు మాటలతో ఆంగ్లవిద్యావసరాలను అంతర్జాతీయ పరిస్థితులకు అనుకూలంగా ప్రభుత్వాలే కల్పించాయి. నిద్ర లేచింది మొదలు వాడే పేస్ట్, బ్రెష్ నుంచి రాత్రికి నిద్రపోయే బెడ్, బెడ్ షీట్ వరకు వాడుతున్న ఆంగ్ల పదజాలమంతా వ్యాపారంతో నిండిన ఆంగ్లసంస్కృతీకరణకు ప్రతిరూపాలే. వాటిని బాల్యదశ నుంచే అలవాటు చేయడం నిత్యజీవనంలో భాగమైపోయింది. అంటే జీవితంలోని ప్రతి నిముషం ఆంగ్లీకరణమే, వ్యాపారమే అనడంలో అతిశయోక్తి లేదు. దీనిని నియంత్రించే శక్తి ప్రభుత్వాల దగ్గరే ఉంది. భాషాభిమానులు, భాషోద్యమకారుల దగ్గర సలహాలు, సూచనలు మాత్రమే ఉన్నాయి. ఉంటాయి.

ప్రసార మాధ్యమాల విషయానికి వస్తే ముఖ్యంగా టీవీ ప్రజల భాషపై ఎనలేని ప్రభావాన్ని చూపుతుంది. తెలుగు భాషను నియంత్రించడంలో, అలవోకగా ఆంగ్లపదాలను అలవాటు చేయడంలో ముఖ్య పాత్ర పోషిస్తుంది. కమర్షియల్ ప్రోగ్రామ్స్, వ్యాపార ప్రకటనలు, యాంకరింగ్... అన్నీ ఆంగ్లంతో కూడి అరకొర తెలుగుదనంతో స్వభాషను అథఃపాతాళానికి తొక్కేస్తున్నాయి అనడంలో అసత్యం లేదు. ఇక సోషల్ మీడియాలో అక్కడక్కడా తెలుగు వెలిగినా అది తమస్సును చీల్చేంత వెలుగు కాదు. **ప్రసార మాధ్యమాల యాజమాన్యాలతో మమేకమై తెలుగుకు కొత్త ఊపిరూదాల్సిన అవసరం స్వభాషాప్రేమికుల మీద ఎంతైనా ఉంది.**

## అసలు తెలుగు భాషంటే..!?

సశాస్త్రీయమైన ఆలోచన లేకుండా నేటికీ చాలామంది తెలుగంటే పద్యాలు, పాటలు, రామాయణ, మహాభారతాలు వంటివే అనుకుంటున్నారు. తెలుగు మాతృభాష అనగానే ఉద్వేగానికి లోనవడం, తెలుగు గొప్పతనం గురించి, కవుల గురించి ఉపన్యాసాలు ఇవ్వడం, పద్యాలు పాడటం అలవాటైపోయింది. భాషను సామాజిక, సాంస్కృతిక దృష్టితో గమనించి, అర్థంచేసుకునే ఆలోచన విద్యావంతుల్లో కూడా లేకుండా పోతోంది. భాషకు ప్రామాణికం ఆ భాష మాట్లాడే వ్యక్తులు. పదజాలం. ఆ వ్యక్తులు లేని రోజు భాషే కనుమరుగవుతుంది. తెలుగుభాషను కేవలం సాహిత్య పరిధికి మాత్రమే కుదించే పని ఇంకా జరుగుతూనే ఉంది. భాషలో సాహిత్యం ఓ భాగం మాత్రమే. ఇద్దరి వ్యక్తుల భావ వాహిక భాష. భాషను సన్మానాలు, అవార్డులు, వేదికలపై చప్పట్లలో వెదికితే అది అసంపూర్ణ అసంకల్పిత చర్యే అవుతుంది. తెలుగుభాషా వ్యవహర్తలను పెంచేలా, ఎక్కువ మంది అభ్యసించేలా, తెలుగు పదజాలం తగ్గకుండా, కొత్తపదజాలం సృష్టించే దిశగా కృషి జరగాలి. అందుకు సాహిత్యం కూడా ఓ పునాదిరాయి మాత్రమే అవుతుంది.

ప్రవాహశీలమైన భాష మానవ అవసరాలకు అనుగుణంగా తనను తాను ఎప్పటికప్పుడు మార్చుకుంటుంది. ఆ తర్వాతే వ్యాకరణాలు, నిర్మాణ పద్ధతులు, సాహిత్యం పుడుతూ, మారుతూ ఉంటాయి. భాషలో వచ్చే ప్రతి మార్పును ఆహ్వానించాల్సిందే. అలాగే చారిత్రక, తులనాత్మక, వర్ణనాత్మక భాషా వ్యాకరణాలను నిర్మించుకొని వర్తమానం నుంచి భవిష్యత్తుకు మార్గాన్ని సుగమం చేసుకోవాల్సిందే. తెలుగు అధ్యాపకులు, ఉపాధ్యాయులు ఈ దృష్టితో తెలుగును బోధించాల్సి ఉంది. గతంతో పూర్తిగా తెగదెంపులు చేసుకోకుండానే వర్తమాన ఆవశ్యకతకై విద్యార్థులను సిద్ధం చేయాల్సిందే. ఇల్లు, బడుల్లో పద్యాలు, పాటలు నేర్పిస్తూ, వారిలో సృజనాత్మక ఆలోచనలకు బీజం వేస్తూ, భాషపై శాస్త్రీయమైన ఆలోచనలు కలిగించాలి. చిన్నారుల్లోనే కాదు వాళ్ల తల్లిదండ్రుల్లోనూ ఇలాంటి ఆలోచనలు రావాల్సిన అవసరం కచ్చితంగా ఉంది. అయితే ఇవన్నీ ఆర్థికాంశంతో ముడిపడినవని తప్పక గుర్తుంచుకోవాలి.

## విదేశీలో స్వదేశీ

విదేశాల్లోని తెలుగువాళ్లు మన సంస్కృతీ సంప్రదాయాలకు నిలయాలుగా మారుతున్నారన్నది సాహిత్య భాషాప్రేమికుల మాట. నోస్టాల్జియా కొత్తేం కాదు. వదిలేసిన వాటిపై మోజు పెంచుకోవడం మనుషుల ప్రవృత్తి. అయితే అసలు మేధోవలసల వెనకున్న కారణాలను, వాటిలోని నిజానిజాలను, ఆర్థికకోణంలో తర్కించాల్సిన అవసరం లేదా! ప్రాపంచిక దృక్కోణంలోంచి వారి జీవితాలను అర్థం చేసుకోవాల్సిన అవసరం లేదా!? జీవి సౌకర్యవంతమైన, సుఖవంతమైన జీవితాభిలాషి అన్న వాస్తవాన్ని గ్రహించాల్సిన అవసరం లేదా!?. తెలుగు భాషాభిమానులు, సామాజిక, భాషా శాస్త్రవేత్తలు అంతర్జాతీయంగా, జాతీయంగా, ప్రాంతీయంగా వస్తున్న పరిణామాల్లోని అంతస్సూత్రాన్ని డబ్బు, ఆ డబ్బుతో వచ్చే కీర్తి, అంతస్తు, సాంఘికహోదా వంటి అంశాలను ప్రమాణాలుగా తీసుకొని కొలవాలి. వారికి ఆంగ్లభాషతో, సాంకేతికరంగంతో ఉన్న సంబంధాన్ని, కింది వర్గాలపై అవి చూపే ప్రభావాన్ని గమనించాలి. అయితే ఇక్కడ ఎంత శాతం, ఏ కులం, ఏ ప్రాంతం ఆ అవకాశాలను అందిపుచ్చుకుంటున్నారు అన్నది కూడా గమించాల్సిన ప్రశ్నే!?

అలాగే విదేశాల్లోని స్వదేశీయులు తెలుగు సమాజంలోని అన్ని వర్గ, కుల, లింగ, ప్రాంతీయతల విస్తృతితో, అన్ని సాహిత్య భూమికలకు ప్రాధాన్యత ఇవ్వాల్సిన తరుణమిది. ఇంకా భాషను సాహిత్య స్థాయిలోనే కాకుండా వివిధ సామాజిక స్థాయిల్లో శాస్త్రీయంగా అర్థం చేసుకొని, అవసరాల కొద్దీ ఆదుకోవాల్సిన అవసరం ఉందనిపిస్తుంది. అలాగే అక్కడి పండుగలు, వేడుకలు, అవార్డులు, సాహిత్య, విద్యారంగాలతోపాటు ఇక్కడి భాషాభివృద్ధి గురించిన సహేతుక కార్యక్రమాల నిర్వహణ వారి కృషిని మరింత విస్తృతి చేస్తాయి అనడంలో సందేహం లేదు.

## అవసరాల రాజకీయాలు

రాజకీయ నాయకులు, ప్రభుత్వాలు ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలకోసం పనిచేస్తాయంటారు. దీనికున్న మరో కోణం అధికారం కోసం పనిచేయడం. ఆ అధికారాన్ని నిలబెట్టే ఓట్లకోసం పనిచేయడం. మరి మాతృభాషలు ఎంతవరకు ఓట్లకు పెట్టుబడిగా మారగలవు? ఎంతవరకు ప్రజలను తమవైపు, తమ పార్టీ వైపు తిప్పగలవు? అని రాజకీయ పార్టీలు, నాయకులు ఆలోచిస్తారు. మాతృభాషా చైతన్యం ఒకప్పుడు (సీనియర్ నందమూరి తారకరామారావు తొలిసారి

ముఖ్యమంత్రిగా ఎన్నిక కావడంలో) ప్రజలను ఓట్లుగా మార్చిన శక్తే. కానీ నేడు మార్కెట్ మయమైన జీవనంలో ప్రజల ఆలోచనలు వ్యాపారాత్మకమైన వస్తువులు, సుఖాలవైపు మరలాయి. అందుకే నాయకులూ, పార్టీలు భాషను, సాహిత్యాన్ని వదిలేసి ఉచిత పథకాలు, బహుమతులు, సంక్షేమ ఫలాలు, కులాలు, మతాలు వంటి వాటిని ఓట్లకోసం మార్గాలుగా ఎంచుకుంటున్నాయి.

అందువల్లే భాషా మంత్రిత్వశాఖ అటుంచి, భాషకోసం పనిచేసే అధికార భాషా సంఘాలు, అకాడమీలు వంటివాటిని నీరుగార్చే ప్రయత్నాలు ముమ్మరంగానే సాగుతున్నాయి. అవి తెలుగునేలపై నిధుల కొరత, పర్యవేక్షణ కొరత, సభ్యుల కొరతతో ఉన్నా... లేనట్లే పనిచేస్తున్నాయి. ప్రభుత్వాలు వీటివైపు అరకొర చూపుల్ని సైతం సారించలేకున్నాయి. ఎందుకంటే ఇవి వారి అధికారంకోసం ఉపయోగపడని సంస్థలు. పైగా వీటికి నిధులూ దుబారానే. పార్టీలు మేనిఫెస్టోల్లో భాషను చిన్న అంశంగా చేర్చినా, అది అంతవరకే. అధికారంలోకి వచ్చాక కనుమరుగయ్యేదే. మాతృభాషపై ఇలాంటి ఆలోచనలున్న పార్టీలు తెలుగు భాషను నవీనీకరించి, అభివృద్ధి పరిచి, తర్వాతి తరాలకు అందేలా కృషి చేస్తాయనడం కుందేటికొమ్ము వెతకడమే. దాహంతో ఎండమావుల వెంట పరుగులు తీయడమే.

నిజానికి తెలుగు చదువుకున్న వాళ్లకు విద్య, ఉద్యోగావకాశాల్లో కొంత రిజర్వేషన్ కల్పించొచ్చు. తెలుగులో ఉన్నత విద్య అభ్యసించిన వాళ్లకు ప్రత్యేక ఉపాధి మార్గాలను ఏర్పాటు చేయొచ్చు. సాంకేతిక విద్యాసంస్థల్లో తెలుగు అంశాన్ని బోధనగా చేర్చి, అవకాశాలు కల్పించొచ్చు. **అసలు మాతృభాష చదివిన వారికి ఉద్యోగ భద్రత ఉండేలా నిర్ణయం తీసుకుంటే తెలుగు చదివేవారి సంఖ్య పెరుగుతుంది. భాషాభివృద్ధీ జరుగుతుంది. తర్వాతి తరానికి తెలుగు భాషా సాహిత్యాలూ అందుతాయి.**

## తరం మారని పాఠ్యాంశాలు

తెలుగు బోధనా మాధ్యమంపై జరుగుతున్న చర్చ... నూతన విద్యావిధానంలో ఐదో తరగతి వరకు మాతృభాషలోనే విద్యాభ్యాసం కొనసాగాలన్న సూచన... తెలుగు రాష్ట్రాల్లోని బడుల్లో ఎల్.కె.జి నుంచే రాజ్యమేలుతున్న ఆంగ్లం... ఇవన్నీ గందరగోళాన్ని సృష్టించేవే. ఇంజినీరింగ్ వంటి సాంకేతిక విద్య వచ్చిన తర్వాత డిగ్రీ, పి.జీలకు ప్రాధాన్యత తగ్గింది. మానవీయ, సాంఘిక శాస్త్రాలు చదివేవాళ్లే కరువయ్యారు. ఎందుకంటే, అవి ఉపాధి వనరు కాకపోవడం వల్లే. మరోవైపు విద్యార్థుల్లేక డిగ్రీ కళాశాలలు మూతపడడం, ప్రాచ్యకళాశాలలు కనుమరుగవడం చూస్తూనే ఉన్నాం. ఇక తెలుగు విషయానికి వస్తే ఉన్నతవిద్యగా అభ్యసించే వాళ్లు అతి తక్కువయ్యారు. విశ్వవిద్యాలయాలు తెలుగులో ఎం.ఏ చదివే విద్యార్థులకోసం టార్చివేసి వెతకాల్సిన దుస్థితి ఏర్పడింది. ఒకరు ఇద్దరు చేరినా, వాళ్లు దళిత, బడుగు బలహీన వర్గాల విద్యార్థులే. ఇతర కోర్సులకు ఆర్థిక వనరులను సమకూర్చుకోలేని వాళ్లే. ఇక తెలుగును ఉన్నత విద్యగా చదివిన వాళ్లు ఏం చేయాలో తెలియక అయోమయ పరిస్థితుల్లో ఉంటున్నారు. ఉన్నారు.

ఉన్నత విద్యతో తెలుగు పాఠ్యాంశాలు ఆధునిక సాంకేతిక అవసరాలకు అనుగుణంగా నేటికీ మారలేదు. డిగ్రీలోనే కాదు, ఎం.ఏ.లోనూ వివిధ విశ్వవిద్యాలయాల్లో ఇంకా ఒకప్పటి పాఠ్యాంశాలే కొనసాగుతున్నాయి. కొందరు అధ్యాపకులూ సాంకేతికతను అందిపుచ్చుకోలేకపోతున్నారు. **ప్రస్తుతం ఉపాధి మార్గంగా తెలుగు సిలబస్‌ను మార్చాల్సిన అవసరం ఉంది.** తెలుగును అభ్యసించే వాళ్లను బై లింగ్వల్, మల్టీలింగ్వల్ విద్యావంతులుగా తయారు చేయాలి. తెలుగులో కంప్యూటర్‌కు సంబంధించిన సాధారణాంశాలనైనా నేర్పించాలి. ప్రస్తుత పరిస్థితుల్లో తెలుగు ద్వారా ఎలాంటి ఉద్యోగాలు సంపాదించవచ్చో, అలాంటి పాఠ్యాంశాలను తయారు చేసే బాధ్యత సిలబస్ కమిటీల మీదా ఉంది. పరిశోధనలూ ఆ దిశగా సాగాలి. మనిషిని మానవీకరించి, ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే తెలుగు సాహిత్యాన్ని టెక్నాలజీ విద్యలో ఒక అంశంగా చేర్చాల్సిన అవసరం ఉంది. సృజనశీలురుగా విద్యార్థులను తీర్చిదిద్దాలి. రచయితలుగా, అన్ని సామాజిక మాధ్యమాలకు స్క్రిప్ట్స్ రాసేవారిగా, ప్రసారమాధ్యమాల్లో పనిచేసేవారిగా, యూట్యూబ్స్, యాప్స్ వంటి వాటిని నడిపేవారిగా శిక్షణ ఇవ్వాలి.

తమ ఉద్యోగులకు పర్సనాలిటీ డెవలప్‌మెంట్ ట్రైనింగ్‌లు ఇప్పించే కార్పొరేట్ సంస్థలు సృజనాత్మకత, మానసిక దృఢత్వం, నైతికవిలువలు, నాయకత్వం, వ్యవహార దక్షత వంటివాటిని తెలుగు సాహిత్యం ద్వారా నేర్పించొచ్చు. అందుకు తెలుగులో ఉన్నత విద్య అభ్యసించినవారిని ఉపయోగించుకోవచ్చు. ఇక భాషా సాహిత్యాల ప్రామాణికంగా కార్పొరేట్ సంస్థలు కొత్తతరహా ప్రాజెక్టులను ఇంకా చేపట్టవచ్చు. ఇందుకు తగిన అంశాలను విశ్వవిద్యాలయాలు తమ సిలబస్‌లలో భాగం చేయాల్సిన అవసరం ఉంది.

## సోషల్ మీడియా సోకులు

కరోనా కాలంలో తెలుగుభాషా సాహిత్యాలపై చర్చ పెరిగింది. ఆన్‌లైన్ వేదికగా ఎక్కువ కార్యక్రమాలు జరిగాయి. కానీ వీటివల్ల సౌలభ్యం ఉన్నంతగా ఉపయోగాలు నెరవేరాయా అనేది ఆలోచించాల్సిన విషయం. భాషాంశాల మీదే కాదు, భాషోద్యమాలకు సంబంధించి జరుగుతున్న ఆన్ లైన్ చర్చల్లో విషయాలపై సూటితనం, స్పష్టత కొంత కనిపిస్తుంది. కానీ కార్యాచరణ మాత్రం అనుకున్నంత లేదు. వెబ్ సైట్స్, వాట్సాప్, ఫేస్ బుక్ గ్రూపుల్లోని అంశాలు ఎక్కువమందికి చేరే అవకాశం తక్కువ. ఇక ఎస్. ఎమ్. ఎస్. (సంక్షిప్త సందేశాలు) భాష తెంగ్లీషును మించి పోయింది. ఇది లిఖితభాషకు గొడ్డలి పెట్టుగా మారే ప్రమాదం భవిష్యత్తులో లేకపోలేదు. (ఈ మార్పును ఏమేరకు ఆహ్వానించవచ్చు?)

కొన్ని గ్రూపుల్లో రచయితలు, కవితలు, కథలు, వ్యాసాల గురించిన ప్రచారం ఎక్కువగా జరుగుతుంది. యూట్యూబ్ లాంటి వాటిలో వాణిజ్యపరమైన అంశాలకు కొదవే లేదు. కొన్ని వెబ్‌సైట్స్ తెలుగుకోసమే ప్రత్యేకంగా ఉన్నాయి. అవి తెలుగు ప్రాచీనత, సాంస్కృతికాంశాలు, భాషాంశాలు, వార్తలను నింపుకొని కనిపిస్తున్నాయి. తెలుగు సోషల్ మీడియాలో భాగమవడం వల్ల కొందరికి ఆదాయవనరుగా కూడా మారింది. ఈ దిశగా తెలుగు ఇంకా అభివృద్ధి చెందాల్సి ఉంది. మార్కెట్ మయమైన వీటిలో తెలుగుకు ప్రచారం ఎలా కల్పించాలో, సాంకేతికత మిళితమైన సృజనాత్మకంగా వివిధాంశాలతో తెలుగును ఎలా ప్రచారం

చేయాలో ఆలోచించాలి. ఈ బాధ్యతలను ప్రభుత్వాలు, విద్యాసంస్థలు, భాషోద్యమ సంఘాలు చేయొచ్చు. అయితే ఇదీ మార్కెటింగ్ వ్యవస్థలో భాగమేనని మర్చిపోకూడదు.

**వర్గాల అంతరాల మధ్య**

తెలుగుకు ప్రామాణికత కాదు, ప్రాణాలు ముఖ్యం. నేటికీ గ్రామాల్లో అచ్చమైన, స్వచ్ఛమైన తెలుగు బతికే ఉంది. ప్రసార మాధ్యమాలు తెంగ్లిషులో గగ్గోలు పెడుతున్నా పెద్దతరం వద్ద అచ్చమైన తెలుగు నిలిచే ఉంది. నవనాగరికతలో భాగస్వాములు కాని తరం వీరిది. ఇక నేటితరం గ్రామాలకు, నగరాలకు, విదేశాలకు మధ్య తెరను తొలగించి, జీవనం సాగిస్తున్నారు. వీళ్ల దగ్గరా కొంతవరకే తెలుగు మిగిలి ఉంది. కానీ నయా వినిమయ సమాజంలో భాగస్వాములైనందున వీళ్ల తెలుగులో ఆంగ్లం, అంగ్లీకరించబడిన తెలుగు కనిపిస్తుంది. ఇక భావితరంగా ఎదుగుతున్న వారు ఆంగ్ల మాధ్యమంలో చదువుతూ, విదేశీకరణ సంస్కృతిలో బతకడం వల్ల వీళ్లనోటిలో తెలుగు భాష కూడా ఆంగ్లీకరించబడే వెలువడుతుంది. **అందుకే భాషను బతికించే పని వర్తమాన తరం (30-50 ఏళ్ల వాళ్లు) మీదే ఎక్కువగా ఉంది.**

ఇక ఆర్థికపరమైన అరలతో సమాజాన్ని చూసినప్పుడు పైతరగతి ఎప్పుడూ సామాజిక హోదా ఉన్న భాషలోనే మాట్లాడుతుంది. ఉన్నతమైన ఉద్యోగాలు చేస్తున్న వాళ్లు, పెద్దపెద్ద వ్యాపారస్తులు, సమాజంలో ప్రముఖులుగా గుర్తింపు పొందిన వాళ్లు ఆంగ్లభాషలోనే ఎక్కువగా మాట్లాడతారు. అవసరం ఉన్నప్పుడు మాత్రమే తెలుగును ఉపయోగిస్తారు. ఇక మధ్యతరగతి వాళ్లు పై వర్గాన్ని అనుసరించే క్రమంలో వేషభాషల్లో, దైనందిన కార్యక్రమాల్లో వాళ్లే వీళ్లకు ప్రమాణం కాబట్టి, ఆంగ్లభాషపై, నయా సంస్కృతిపై ఇష్టాన్ని పెంచుకొంటారు. అలాగే వ్యవహరిస్తారు, ప్రవర్తిస్తారు, అనుకరిస్తారు. ఆర్థికంగా ఎదిగేందుకు ఆంగ్లమే అవకాశాలను కల్పిస్తోందని భావిస్తున్నారు కాబట్టి దానినే మాట్లాడతారు. ఇక కింది వర్గం దైనందిన బతుకుకోసమే కష్టపడుతుంది, కాబట్టి వీళ్లకు ఈ భాషాగోల పట్టదు. వర్తమాన సమాజంలో అవసరాలకోసం ఉపయోగించాల్సిన భాషను మాత్రమే నేర్చుకుంటూ ఉంటారు. కానీ వీళ్లు టీవీ మాధ్యమ భాషను అనుకరించే అవకాశం ఉంది. కాబట్టి తెలుగును కాపాడాల్సిన బాధ్యత పై రెండు వర్గాల మీదా ఉందని చెప్పవచ్చు.

మొత్తంగా వర్తమాన సమాజంలో తెలుగు భాష ఆంగ్లీకరించబడుతోంది అన్నది వాస్తవం. అలాగే ఉపాధి, ఉద్యోగావసరాల కోసం ఆంగ్లం నేర్చుకోవడం నేటితరం, భావితరాలకు తప్పనిసరైందని అందరూ అంగీకరిస్తున్నారు. ఎందుకంటే మార్కెట్ వ్యవస్థే సంస్కృతిని, దానిలోని మనిషిని నిర్దేశిస్తున్న పరిస్థితుల్లో, అది ప్రాంతీయ సమాజాల్లోకి చొచ్చుకొని వచ్చేసింది. ఇక ప్రాంతీయ భాషల్లోకి రాలేదన్నది అసంపూర్ణ సత్యమే. ఈ నేపథ్యంలో తెలుగు భాష గుర్తింపు, అవసరం తగ్గింది. ఈ తరుగులను పూడ్చేందుకు కృషి జరగాలి. మాతృభాష విషయంలో కూడా డిమాండ్ ను బట్టే సప్లై ఉంటుందన్న ప్రాథమిక సూత్రాన్ని అసలు మర్చిపోకూడదు.

రచయిత డాక్టర్ ఎ.రవీంద్రబాబు కథకుడు, విమర్శకుడు,
ఆంధ్రప్రదేశ్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో
అతిథి సహాయ ఆచార్యులు.



నిదానకవి నీరజ
9908948649

# ఆధునిక తెలుగు సాహిత్యం - అంతర్జాల సేవ

ప్రాచీన కాలంలో శాసనాలు, తాళపత్రగ్రంథాలతో ప్రారంభమయిన తెలుగు సాహిత్యం కాలానుగుణంగా అనేక మార్పులకులోనై ఆధునిక కాలంలో వివిధ ప్రక్రియలతో సుసంపన్నమై అలరారుతుంది అని చెప్పవచ్చు. ప్రాచీన కాలంతో పోల్చుకుంటే ఆధునిక కాలంలో తెలుగు సాహిత్యంలో ప్రక్రియ బాహళ్యం పెరిగింది. దానితోపాటు సాహిత్య సృజనకారులు పెరిగారు. ప్రతి ప్రక్రియలో వైవిధ్యభరితమైన రచనలు వచ్చాయి. ఆధునిక కాలంలో కాలమాన పరిస్థితులను బట్టి సాహిత్య వస్తువు మరియు రూపంలో అనేక మార్పులు వచ్చాయి. సాహిత్యాన్ని చదివే పాఠకుల అభిరుచిలోను సాహిత్య సృజనకారుల ఆలోచనల్లోనూ మార్పులు చోటు చేసుకున్నాయి. ఆధునిక కాలంలో అందరు బిజీ జీవులు కావడం వల్ల సాహిత్యాన్ని చదవడానికి ఎక్కువ టైమును కేటాయించలేకపోతున్నారు. అందువల్ల సాహిత్య ప్రక్రియల్లో క్లుప్తత, సంక్షిప్తత పెరిగింది. ఈ కోవలో కవిత్వంలో వచ్చిన ప్రక్రియలే హైకు, నానీలు మొదలైనవి. అదేవిధంగా కథలు విషయంలో కూడా కాలం కథలు పేజీ కథలు మొదలైన సంక్షిప్తరూపాలు వచ్చాయి. ఇక డిజిటల్ యుగం మొదలైన తర్వాత సాహిత్యంలో కూడా డిజిటల్ ప్రభావం ప్రారంభమైనదని చెప్పవచ్చు.

**అంతర్జాల సేవ :** ఇంటర్నెట్‌ను తెలుగులో అంతర్జాలం అని పిలుస్తున్నారు. ఆధునిక కాలంలో అత్యంత ప్రాచుర్యం పొందిన మరియు అత్యంత ప్రభావశీలమైన ప్రచార మాధ్యమం ఇది. ఆధునిక తెలుగు సాహిత్యానికి అంతర్జాలం చేస్తున్న సేవ అంతా ఇంతా కాదు. ఆధునిక తెలుగు సాహిత్యం మీద ఈ అంతర్జాల ప్రభావం అపారంగా ఉంది అని చెప్పవచ్చు. అంతర్జాలంలో భాగమైన అంతర్జాల పత్రికలు, బ్లాగ్‌లు, యూట్యూబ్ ఛానెల్స్, వాట్సాప్‌లు, ఫేస్‌బుక్‌లు, ట్విటర్‌లు, ఇన్‌స్టాగ్రామ్‌లు, వికిపీడియాలు మొదలైన అంతర్జాల మాధ్యమాల వేదికగా తెలుగు సాహిత్యం ప్రజలకు మరింత చేరువ అయ్యిందని చెప్పవచ్చు. ప్రస్తుతం అంతర్జాలం లేకుండా తెలుగు సాహిత్యాన్ని ఊహించలేని పరిస్థితి నెలకొన్నది. సాహిత్యంలో ప్రతి విషయానికి అంతర్జాలం మీద ఆధారపడవలసిన అవసరం ఏర్పడింది. అంతగా తెలుగు సాహిత్యం మీద అంతర్జాలం ప్రభావం చూపుతుందని చెప్పవచ్చు.

**అంతర్జాల పత్రికలు :-** అంతర్జాలంలో సాహిత్య పత్రికలకు విశిష్ట స్థానం ఉంది. తెలుగు సాహిత్యానికి అంతర్జాల పత్రికలు ఇతోధికంగా సేవ చేస్తున్నాయనడంలో అతిశయోక్తి లేదు. అంతర్జాలంలో కథలకు సంబంధించిన కథా మంజరి లాంటి పత్రికలు కొన్ని. అదే విధంగా విమర్శకు, కవిత్వానికి సంబంధించిన పత్రికలు కొన్ని ఉన్నాయి. అంటే ఒక్క ప్రక్రియకే నిర్దేశించబడిన ప్రత్యేక అంతర్జాల పత్రికలు మనకు కన్పిస్తాయి సంచిక, సారంగ, ఔచిత్యం, అమ్మనుడి, భావవీణ మొదలైన అంతర్జాల పత్రికల వల్ల సాహిత్యం ప్రజల ముంగిటికి వచ్చిందని చెప్పవచ్చు. పాతకాలంలో ఒక పత్రికలో వచ్చిన కథనో, కవితనో చదవాలంటే ముందు అది పబ్లిష్ అయిన పత్రికను సేకరించాలి. అదే అంతర్జాల పత్రికలో వచ్చిన రచనలను చదవాలంటే అంతర్జాలంలోకి వెళ్ళి వెంటనే చదివే వెసులుబాటు కలుగుతుంది. అంతర్జాలంలో వెలువడే పత్రికలు వార పత్రికలు, పక్ష పత్రికలు, మాస పత్రికలుగా అనేకం ఉండటం వల్ల వ్రాసే సాహిత్యకారులకు వ్రాయడానికి ఎక్కువ అవకాశాలు కలుగుతున్నవి. పాతకాలంలో పత్రిక నిర్వహణ ఎంతో ఖర్చుతో కూడుకున్నది. కానీ నేడు అంతర్జాల పత్రిక నిర్వహణ సులభం కావడం వల్ల చాలా మంది అంతర్జాల పత్రికను నిర్వహించడానికి ముందుకు వస్తున్నారు. అంతర్జాల పత్రికలు అనేకం రావడం వలన ఔత్సాహ రచయితలకు ఎన్నో అవకాశాలు లభిస్తున్నాయని చెప్పవచ్చు.

2) బ్లాగులు: అంతర్జాలంలో బ్లాగుకు ప్రత్యేకస్థానం ఉంది. ఒక్కొక్క అంశం గురించి విస్తృతంగా వివరించేవే ఈ బ్లాగులు. సాహిత్యంలో మొట్టమొదటి సారిగా కథల మాస్టారు కాళీపట్నం రామారావు గారు కథల గురించి దాదాపు 700 కథలతో కథా నిలయం అనే కథల బ్లాగును రూపొందించాడు. ఈ బ్లాగ్ లోని కథలను ఎవ్వరైనా ఎక్కడ నుంచైనా, బ్లాగ్‌ను ఓపెన్ చేసి చదువుకునే వెసులుబాటును కల్పించారు అదే విధంగా అనేక అంశాలకు సంబంధించిన రకరకాల బ్లాగులు తెలుగు సాహిత్యంలో కన్పిస్తాయి.

3)శోధ్‌గంగ : సాహిత్యానికి సంబంధించిన బ్లాగుల్లో శోధ్‌గంగను ప్రముఖంగా పేర్కొనాలి. పిహెచ్.డి. విద్యార్థులు గాని, మరెవరైనా ఏ విశ్వవిద్యాలయంలో జరిగిన ఏ పిహెచ్.డి. థిసీస్‌నైనా చూసే అవకాశాన్ని అందిస్తుంది శోధ్‌గంగ బ్లాగే. ముఖ్యంగా పరిశోధక విద్యార్థులకు విషయ అవగాహనకు, సమాచార సేకరణకు ఇది ఒక కల్పతరువు అని చెప్పవచ్చు.

4) భాషకు సంబంధించిన బ్లాగ్‌లు : తెలుగు భాష, దాని పుట్టుక, వ్యాప్తి, వికాసం, పదం, వాక్యం, మొదలైన వాటి నిర్మాణం. తెలుగు భాషకు సేవ చేసిన స్వదేశి, విదేశి భాషా శాస్త్రజ్ఞుల కృషిని గురించి సంపూర్ణ వివరాలను అందించే బ్లాగ్ ఇది. ఈ బ్లాగ్ కూడా విద్యార్థులకు ఎంతో ఉపయుక్తమైంది.

5) యూట్యూబ్ ఛానెల్స్ : అంతర్జాలంలో యూట్యూబ్ ఛానెల్స్ కూడా తెలుగు సాహిత్యానికి ఇతోధిక సేవ చేస్తున్నాయని చెప్పవచ్చు. యూట్యూబ్ ఛానెల్స్ పాఠశాల విద్యార్థులకు పద్యం పట్ల మక్కువ పెంచి పద్యానికి సంబంధిన యుట్యూబ్ ఛానెల్స్, పిల్లల పాటలకు సంబంధిన యూట్యూబ్ ఛానెల్స్ పోటీ పరీక్షల –శిక్షణకు

ప్రాచీన కాలంలో శాసనాలు, తాళపత్రగ్రంథాలతో ప్రారంభమయిన తెలుగు సాహిత్యం కాలనుగుణంగా అనేక మార్పులకులోనై ఆధునిక కాలంలో వివిధ ప్రక్రియలతో సుసంపన్నమై అలరారుతుంది అని

చెప్పవచ్చు. ప్రాచీన కాలంతో పోల్చుకుంటే ఆధునిక కాలంలో తెలుగు సాహిత్యంలో ప్రక్రియ బాహుళ్యం పెరిగింది. దానితో పాటు సాహిత్య సృజనకారులు పెరిగారు. ప్రతి ప్రక్రియలో వైవిధ్యభరితమైన రచనలు వచ్చాయి. ఆధునిక కాలంలో కాలమాన పరిస్థితులను బట్టి సాహిత్య వస్తువు మరియు రూపంలో అనేక మార్పులు వచ్చాయి. సాహిత్యాన్ని చదివే పాఠకుల అభిరుచిలోను సాహిత్య సృజనకారుల ఆలోచనల్లోనూ మార్పులు చోటు చేసుకున్నాయి. ఆధునిక కాలంలో అందరు బిజీ జీవులు కావడం వల్ల సాహిత్యాన్ని చదవడానికి ఎక్కువ టైమును కేటాయించలేకపోతున్నారు. అందువల్ల సాహిత్య ప్రక్రియల్లో క్లుప్తత, సంక్లిష్టత పెరిగింది. ఈ కోవలో కవిత్వంలో వచ్చిన ప్రక్రియలే హైకు, నానీలు మొదలైనవి. అదేవిధంగా కథలు విషయంలో కూడా కాలం కథలు పేజీ కథలు మొదలైన సంక్లిప్తరూపాలు వచ్చాయి. ఇక డిజిటల్ యుగం మొదలైన తర్వాత సాహిత్యంలో కూడా డిజిటల్ ప్రభావం ప్రారంభమైనదని చెప్పవచ్చు.

**అంతర్జాల సేవ :** ఇంటర్నెట్‌ను తెలుగులో అంతర్జాలం అని పిలుస్తున్నారు. ఆధునిక కాలంలో అత్యంత ప్రాచుర్యం పొందిన మరియు అత్యంత ప్రభావశీలమైన ప్రచార మాధ్యమం ఇది. ఆధునిక తెలుగు సాహిత్యానికి అంతర్జాలం చేస్తున్న సేవ అంతా ఇంతా కాదు. ఆధునిక తెలుగు సాహిత్యం మీద ఈ అంతర్జాల ప్రభావం అపారంగా ఉంది అని చెప్పవచ్చు. అంతర్జాలంలో భాగమైన అంతర్జాల పత్రికలు, బ్లాగ్‌లు, యూట్యూబ్ ఛానెల్స్, వాట్సావ్‌లు, ఫేస్‌బుక్‌లు, ట్విటర్‌లు, ఇన్‌స్టాగ్రామ్‌లు, వికిపీడియాలు మొదలైన అంతర్జాల మాధ్యమాల వేదికగా తెలుగు సాహిత్యం ప్రజలకు మరింత చేరువ అయ్యిందని చెప్పవచ్చు. ప్రస్తుతం అంతర్జాలం లేకుండా తెలుగు సాహిత్యాన్ని ఊహించలేని పరిస్థితి నెలకొన్నది. సాహిత్యంలో ప్రతి విషయానికి అంతర్జాలం మీద ఆధారపడవలసిన అవసరం ఏర్పడింది. అంతగా తెలుగు సాహిత్యం మీద అంతర్జాలం ప్రభావం చూపుతుందని చెప్పవచ్చు.

**అంతర్జాల పత్రికలు :** అంతర్జాలంలో సాహిత్య పత్రికలకు విశిష్ట స్థానం ఉంది. తెలుగు సాహిత్యానికి అంతర్జాల పత్రికలు ఇతోధికంగా సేవ చేస్తున్నాయనడంలో అతిశయోక్తి లేదు. అంతర్జాలంలో కథలకు సంబంధించిన కథా మంజరి లాంటి పత్రికలు కొన్ని. అదే విధంగా విమర్శకు, కవిత్వానికి సంబంధించిన పత్రికలు కొన్ని ఉన్నాయి. అంటే ఒక్క ప్రక్రియకే నిర్ధేశించబడిన ప్రత్యేక అంతర్జాల పత్రికలు మనకు కన్పిస్తాయి సంచిక, సారంగ, ఔచిత్యం, అమ్మనుడి, భావవీణ మొదలైన అంతర్జాల పత్రికల వల్ల సాహిత్యం ప్రజల ముంగిటికి వచ్చిందని చెప్పవచ్చు. పాతకాలంలో ఒక పత్రికలో వచ్చిన కథనో, కవితనో చదవాలంటే ముందు అది పబ్లిష్ అయిన పత్రికను సేకరించాలి. అదే అంతర్జాల పత్రికలో వచ్చిన రచనలను చదవాలంటే అంతర్జాలంలోకి వెళ్ళి వెంటనే చదివే వెసులుబాటు కలుగుతుంది. అంతర్జాలంలో వెలువడే పత్రికలు వార పత్రికలు, పక్ష పత్రికలు, మాస పత్రికలుగా అనేకం ఉండటం వల్ల వ్రాసే సాహిత్యకారులకు వ్రాయడానికి ఎక్కువ అవకాశాలు కలుగుతున్నవి. పత్రిక నిర్వహణ ఎంతో ఖర్చుతో కూడుకున్నది. కానీ నేడు అంతర్జాల పత్రిక నిర్వహణ సులభం కావడం వల్ల చాలా మంది అంతర్జాల పత్రికను నిర్వహించడానికి ముందుకు వస్తున్నారు. అంతర్జాల పత్రికలు అనేకం రావడం వలన ఔత్సాహ రచయితలకు ఎన్నో అవకాశాలు లభిస్తున్నాయని చెప్పవచ్చు.

2) బ్లాగులు: అంతర్జాలంలో బ్లాగుకు ప్రత్యేకస్థానం ఉంది. ఒకొక్క అంశం గురించి విస్తృతంగా వివరించేవే ఈ బ్లాగులు. సాహిత్యంలో మొట్టమొదటి సారిగా కథల మాస్టారు కాళీపట్నం రామారావు గారు కథల గురించి దాదాపు 700 కథలతో కథా నిలయం అనే కథల బ్లాగును రూపొందించాడు. ఈ బ్లాగ్ లోని కథలను ఎవ్వరైనా ఎక్కడ నుంచైనా, బ్లాగ్‌ను ఓపెన్ చేసి చదువుకునే వెసులుబాటును కల్పించారు అదే విధంగా అనేక అంశాలకు సంబంధించిన రకరకాల బ్లాగులు తెలుగు సాహిత్యంలో కన్పిస్తాయి.

3)శోధ్‌గంగ : సాహిత్యానికి సంబంధించిన బ్లాగుల్లో శోధ్‌గంగను ప్రముఖంగా పేర్కొనాలి. పిహెచ్.డి. విద్యార్థులు గాని, మరెవరైనా ఏ విశ్వవిద్యాలయంలో జరిగిన ఏ పిహెచ్.డి. థీసిస్‌నైనా చూసే అవకాశాన్ని అందిస్తుంది శోధ్‌గంగ బ్లాగే. ముఖ్యంగా పరిశోధక విద్యార్థులకు విషయ అవగాహనకు, సమాచార సేకరణకు ఇది ఒక కల్పతరువు అని చెప్పవచ్చు.

4) భాషకు సంబంధించిన బ్లాగ్‌లు : తెలుగు భాష, దాని పుట్టుక, వ్యాప్తి, వికాసం, పదం, వాక్యం, మొదలైన వాటి నిర్మాణం. తెలుగు భాషకు సేవ చేసిన స్వదేశి, విదేశి భాషా శాస్త్రజ్ఞుల కృషిని గురించి సంపూర్ణ వివరాలను అందించే బ్లాగ్ ఇది. ఈ బ్లాగ్ కూడా విద్యార్థులకు ఎంతో ఉపయుక్తమైంది.

5) యూట్యూబ్ ఛానెల్స్ : అంతర్జాలంలో యూట్యూబ్ ఛానెల్స్ కూడా తెలుగు సాహిత్యానికి ఇతోధిక సేవ చేస్తున్నాయని చెప్పవచ్చు. యూట్యూబ్ ఛానెల్స్ పాఠశాల విద్యార్థులకు పద్యం పట్ల మక్కువ పెంచి పద్యానికి సంబంధిన యుట్యూబ్ ఛానెల్స్, పిల్లల పాటలకు సంబంధిన యుట్యూబ్ ఛానెల్స్ పోటీ పరీక్షల –శిక్షణకు సంబంధించిన యూట్యూబ్ ఛానెల్స్ ఇలా సాహిత్యానికి సంబంధించిన ఎన్నో రకాల యూట్యూబ్ ఛానల్స్ మనకు అందుబాటులో ఉన్నాయి. ముఖ్యంగా నెట్,స్లెట్, గ్రూప్-1,గ్రూప్-2, సివిల్ సర్వీస్ ప్రిపేర్ అయ్యే విద్యార్థులకు ఇది ఒక విజయసాధనంగా మారాయని చెప్పవచ్చు.

6)వాట్సప్ గ్రూపులు: అంతర్జాలంలో అత్యంత ప్రభావశీలమైంది. అత్యంత తొందరగా ప్రజలకు చేరువ అయ్యేది, ఈ వాట్సప్. ఈ వాట్సప్ గ్రూపులు కూడా తెలుగు భాషకు ఇతోధికంగా సేవ చేస్తున్నాయని చెప్పవచ్చు. కవులకు సంబంధించిన అనేక వాట్సప్ గ్రూపులు ఏర్పడి ఒక అంశం ఇచ్చి కవిత రాయమనడం, ఉత్తమమైన వాటిని ఎన్నిక చేసి బహుమతులు ఇవ్వడం వల్ల కవుల్లో కవిత్వం రాయాలనే తపనతోపాటు పోటీ ఉండటం వల్ల మంచి కవితలు రావడానికి అవకాశం కలుగుతుంది.

అదే విధంగా కథలకు సంబంధించిన వాట్సప్ గ్రూప్‌లు ఎన్నో ఉన్నాయి. ఈ విధంగా సాహిత్యంలో అనేక అంశాలకు సంబంధించిన గ్రూప్ లు అనేకం ఉన్నాయి.

7)వాట్సప్ స్టేటస్: అంతర్జాలంలో వాట్సప్ ఎంత

శ్రద్ధాంజలి

ఆచార్య కరిమిండ్ల లావణ్య 9848410244

# ఆచార్య గుమ్మన్నగారి బాలశ్రీనివాసమూర్తి



తెలంగాణ విశ్వవిద్యాలయంలోని తెలుగు అధ్యయన శాఖ ప్రొఫెసర్ డా. బాల శ్రీనివాసమూర్తి 2023, ఏప్రిల్ 24న ఉదయం గుండెపోటుతో మరణించారు. ఆయన మరణంతో తెలంగాణ విశ్వ విద్యాలయం తెలుగు అధ్యయనశాఖ ఒక మంచి పరిశోధకుడిని, ఉత్తమ అధ్యాపకుణ్ణి, గొప్ప సాహితీ వేత్తను కోల్పోయింది.

2006 లో తెలంగాణ విశ్వవిద్యాలయం పుట్టిన మొదటి రోజు నుంచీ పాఠాలు చెప్పిన తెలుగు అధ్యాపకుడు ఆచార్య మూర్తి గారు. అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా డా. బాలశ్రీనివాసమూర్తి అసోసియేట్ ప్రొఫెసర్‌గా, ప్రొఫెసర్‌గా పనిచేశారు. తెలుగు అధ్యయనశాఖలో విభాగాధిపతిగా, పాఠ్య ప్రణాళిక సంఘ చైర్‌పర్సన్‌గా బాధ్యతలు నిర్వర్తించారు.

తెలంగాణ విశ్వవిద్యాలయానికి సౌత్ క్యాంపస్ బిక్నూరు ప్రిన్సిపల్‌గా, ప్రజా సంబంధాల అధికారి (పీఆర్ఓ)గా, ఎన్ ఎస్ ఎస్ యూనిట్ ప్రోగ్రాం ఆఫీసర్‌గా, కాంపిటేటీవ్ సెల్ డైరెక్టర్‌గా, వివిధ కమిటీలకు సభ్యులుగా పాలనాపరమైన పదవులు నిర్వహించారు.

మొదట వివిధ సాహిత్య పత్రికలకు జర్నలిస్టుగా, తర్వాత సర్దార్ పటేల్ డిగ్రీ, పీజీ కళాశాలలో అధ్యాపకుడిగా, కొంతకాలం డెప్యుటేషన్ మీద పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పని చేశారు.

తెలుగు అకాడమీ, తెలంగాణ సాహిత్య అకాడమీ, నీల్ కమల్, విజేత కాంపిటీషన్స్ తదితర ప్రముఖ సంస్థలో అనేక సాహిత్య పుస్తకాలకు సంపాదకులుగా వ్యవహరించారు. విలక్షణ పీవీ, ఆత్మ కథల్లో ఆనాటి తెలంగాణ, అభినవ పోతన వానమామలై వరదాచార్యులు, దేవులపల్లి రామానుజరావు, తెలంగాణం – తెలుగు మాగాణం, వెలుతురు కొలను, జీవనహిందోళం, మా ప్రసిద్ధిపేట, బ్రహ్మశ్రీ అవధానులు గుమ్మన్నగారి లక్ష్మీనరసింహశర్మ స్మృతీ పరిమళం, విజేత కాంపిటీషన్స్ సాహితీ సుధ, తెలంగాణ వైతాళికులలో కూడి ప్రతిభా మూర్తులు, సాహితీ మూర్తులు వంటి పుస్తకాలను రచించారు.

ఆత్మకథల్లో ఆనాటి తెలంగాణకు తెలుగు యూనివర్సిటి ఉత్తమ వచన రచనలో సాహితీ పురస్కారం స్వీకరించారు. సర్వ వైదిక సంస్థాన్ వారి పండిత పురస్కారం, జీవన హిందోళం పుస్తకానికి ప్రతిష్ఠాత్మకమైన గంగ్ర హన్మంత రావు పురస్కారానికి ఎంపిక అయ్యారు. ఇంకా అనేక సాహితీ పురస్కారాలను పొందారు. డా. బాల శ్రీనివాసమూర్తి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి పర్యవేక్షణలో తెలంగాణ పత్రికలు సామాజిక సాంస్కృతిక చైతన్యం, సెంట్రల్ యూనివర్సిటిలో ముదిగొండ వీరభద్రయ్య పర్యవేక్షణలో తాత్విక కావ్యాలు శతాంకుర సాహిత్యం మీద పరిశోధనలు చేశారు.

డా. జి. బాలశ్రీనివాసమూర్తి గారి మృతి పట్ల ప్రగాఢ సానుభూతిని తెలుపుతున్నాము. వారి కుటుంబ సభ్యులకు మనో స్థైర్యాన్ని, ధైర్యాన్ని కలిగించాలని ఆ భగవంతుడిని ప్రార్థిస్తున్నాము. వారి భార్య, కుమారుడు, కుమార్తె ఉన్నారు. ఆయన సిద్ధిపేట జిల్లా పోతిరెడ్డిపేటలో 1966, సెప్టెంబర్ 5 న జన్మించారు.

రచయిత తెలంగాణ విశ్వవిద్యాలయం,
తెలుగు అధ్యయన శాఖ అధ్యక్షులు, నిజామాబాద్

శక్తిమంతమైందో వాట్సప్ స్టేటస్ అంతే ముఖ్యమైంది, వాట్సప్ వాడే ప్రతి ఒక్కరు వాట్సప్ స్టేటస్ చూడటం పరిపాటి. ఈ వాట్సప్ స్టేటస్‌లో తాము వ్రాసిన కథలు, కవితలు లేదా ఏవైనా సూక్తులు, మంచి మాటలు పెడుతూ ఉంటారు, ఈ విధంగా వాట్సప్ స్టేటస్ వల్ల కూడా సాహిత్య సేవ జరుగుతుందని చెప్పవచ్చు.

8)వికిపిడియా : అంతర్జాలంలో వికిపిడియా అనేది విషయ సేకరణకు కల్పతరువు లాంటిదని చెప్పవచ్చు. సాహిత్యంలో ప్రముఖ వ్యక్తులను, రచనలను, జీవిత విశేషాలను అందించే అద్భుత సమాచార దాత వికిపిడియా. సాహిత్యంలో ఎవ్వరి గురించి తెలుసుకోవాలన్న, ఏ పుస్తకం గురించి తెలుసుకోవాలన్న వికిపిడియా మనకు ఉపయోగపడుతుంది.

9)ఫేస్‌బుక్ : అంతర్జాలంలో ఫేస్‌బుక్ కూడా బహుళ ప్రచారం పొందింది. ఈ ఫేస్‌బుక్ వేదికగా కొందరు సాహితీకారులు తమ కథలను విశ్వవ్యాప్తం చేస్తున్నారని చెప్పవచ్చు. ఈ విధంగా ఫేస్‌బుక్ కూడా సాహిత్యానికి ఇతోధికంగా సేవ చేస్తుందని చెప్పవచ్చు.

10) డిజిటల్ లైబ్రరీలు:– అంతర్జాలంలో డిజిటల్ లైబ్రరీలు చేస్తున్న సేవ అపారమని చెప్పవచ్చు. పాతకాలంలో ఒక పుస్తకం కావాలంటే లైబ్రరీకి వెళ్ళి చదవడమో, తెచ్చుకోవడమో చేసేవారు. దాని వల్ల వెళ్ళిరావడం అనే కాలయాపన జరిగేది. కానీ ఇప్పుడు ఈ డిజిటల్ లైబ్రరీల వల్ల ఎక్కడ నుంచైనా ఏ పుస్తకాన్నైనా నిమిషంలో ఓపెన్ చేసుకుని చదివే అవకాశం కలుగుతుంది. పరిశోధక విద్యార్థులకు, పోటీ పరీక్షలు రాసే విద్యార్థులకు ఇవి ఎంతగానో ఉపయోగపడుతున్నాయని చెప్పవచ్చు.

**ముగింపు:** అంతర్జాలం వలన ప్రజల్లో తెలుగు భాష సాహిత్యాల వినియోగం పెరిగిందని చెప్పవచ్చు. సాహిత్యంలో ఎంతో ప్రాధాన్యత, ప్రామాణికత ఉన్న ప్రాచీన గ్రంథాలను డిజిటలైజేషన్ చేయడం వల్ల ఈ అపురూప గ్రంథాలను తర్వాతి తరాల వారు కూడా ఉపయోగించుకునే అవకాశం కలుగుతుంది. ఇది అంతర్జాలం వలన మనకు కలుగుతున్న ముఖ్య ప్రయోజనం. పాతకాలంలో భాషా సాహిత్యాల సేవకు పత్రికలు ఎంతో ఉపయోగపడేవి. నేటి ఆధునిక కాలంలో పూర్వకాలంలో ఆ పత్రికలు చేసిన సేవను మరింత ప్రభావవంతంగా అంతర్జాలం నిర్వహిస్తున్నదని చెప్పవచ్చు. అంతర్జాలంలో జూమ్ వేదికగా అనేక జాతీయ అంతర్జాతీయ సాహితీ వెబినార్‌లను నిర్వహించుకునే అవకాశం కలిగింది. ఈ అంతర్జాలం పిల్లల దగ్గర నుండి పెద్దల దాకా ఆబాలగోపాలాన్ని అలరిస్తూ ముందుకు సాగుతుందని చెప్పవచ్చు. తర్వాతి కాలంలో ఈ అంతర్జాలం వల్ల తెలుగు భాషా సాహిత్యాలు మరింత మందికి చేరువవుతాయని ఆశిద్దాం.

రచయిత: అసోసియేట్ ప్రొఫెసర్,
తెలుగు ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఖైరతాబాద్, హైదరాబాద్,

నాగేంద్ర హంసావత్
9849061547

# బంజారలు - భాషా సాంస్కృతిక నాగరికత

తెల్లవారు జామున మూడు గంటల సమయంలో ఎవరో నా గది తలుపుతడుతున్నారు. నా గది తలుపులు పగటి పూటే ఎవరూ తట్టరు. రాత్రిపూట ఎవరై ఉంటారబ్బా అని నిద్రమబ్బులో సణుక్కుంటూ ఎవరు అని అడిగాను. అందుకు నేను రవిని అని నా మిత్రుడు సమాధానమిచ్చాడు. తలుపు తీసి ఏంటీ ఈ సమయంలో, ఏదైనా సమస్యనా అని అడిగాను. అందుకు రవి ఒరేయ్! మా అన్నయ్య కార్లో గోవాకి వెళ్తున్నాం, కారు డ్రైవింగ్ చేయడానికి మరొక వ్యక్తి కావాలి నువ్వు కూడా మాతో రా! అని చెప్పాడు. నేను రాలేను రా నీకు తెలుసు కదా! మొన్ననే కోచింగ్‌కి జాయిన్ అయ్యాను, గోవాకి వస్తే కనీసం ఐదు రోజుల క్లాసులు మిస్ అవుతాయి. ప్లీజ్ రా నువ్వు ఎలాగైనా రావాలి లేదంటే టూర్ మొత్తం వాయిదా పడుతుంది అని నాకు ఆలోచించుకునే సమయం కూడా ఇవ్వకుండా నా బట్టలు బ్యాగులో సదిరి బలవంతంగా కారులో ఎక్కించేశాడు. నాకేమో డ్రైవింగ్ కొత్త, ఇంత దూరపు ప్రయాణం ఎప్పుడూ చేయలేదు. అసలే గోవా హైవే ఏం జరుగుతుందో ఏమోనని లోలోపల భయంగానే ఉంది. కారులోని మేధావి మిత్రులందరూ కలిసి షార్ట్‌కట్‌లో వెళితే తొందరగా చేరుకుంటామని చెప్పి దారి తప్పి కర్నాటకలోని ఏదో ఊరిలో కారు ఆపారు. ఎటు వెళ్ళాలో తెలియదు. ముందుకు వెళ్లలేని స్థితి, వెనక్కు రాలేని పరిస్థితి.

ఒక కారులోంచి ఒక వ్యక్తి దిగి తన భార్యతో బంజార గోర్‌బోలి అమ్మ నుడిలో మాట్లాడుతున్నాడు. వీళ్ళెవరో మన బంజార / లంబాడీ జాతి వాళ్ళు, వీళ్ళను అడిగితే దారి సరిగ్గా తెలుస్తుందని వాళ్ళ దగ్గరికి వెళ్ళాను. మీరు ఎస్టీలు కదా అని అడిగాను. అందుకు వారు కాదు మేము ఎస్సీలం అని చెప్పారు. అదేంటి మీరు లంబాడీ భాష మాట్లాడుతున్నారు కదా, లంబాడీలే కదా అని వారిని అడిగాను. అందుకు వారు మేము మాట్లాడేది లంబాడీ భాషే (లబానీ)కాని మేము లమాణీలం అని చెప్పారు. ఆ తర్వాత ఎలాగో అలా గోవా చేరుకుని మరలా క్షేమంగా వెనక్కి వచ్చాం. కొంత కాలం గడిచింది. ఒకే భాష మాట్లాడుతున్నారు కాని వేరు వేరు పేర్లు, ఒకే జాతి మనుషులు కాని వేరు వేరు కేటగిరిలు ఇదెలా సాధ్యపడింది. నాలో చాలా సందేహాలు మొదలయ్యాయి. బంజారలు / లంబాడీలను గూర్చి తెలుసుకోవాలి. అసలు వీరి చరిత్ర, భాష, సంస్కృతి ఏంటి? ఎందుకు? ఈ మార్పులు తెలుసుకోవాలని అప్పటికే గిరిజన సంక్షేమ శాఖలో గిరిజన పరిశోధన సంస్థలో చేరిన నాకు ఇంకా ఎక్కువైంది. గ్రంథాలయానికి వెళ్ళి నా సందేహాల నివృత్తికి పుస్తక ప్రయాణం చేయసాగాను. గోవా ప్రయాణంలో కలిగిన సందేహాలు ఈ పుస్తక ప్రయాణంతో నివృత్తి చేసుకోగలిగాను. ఆ విశేషాలే ఈ వ్యాసంలో పొందుపరిచాను. నాగరికత పేరుతో బంజారల భాషా, సంస్కృతిలో కలిగిన మార్పులను ఈ వ్యాసంలో చూడవచ్చు.

**బంజారల పరిచయం:**

భారతదేశం మొత్తం వ్యాపించి వున్న అతిపెద్ద సమూహపు జాతులలో బంజార జాతి ఒకటి. బంజారాలు దృఢమైన సంకల్పం, శక్తి, రోషము, పౌరుషము గల వాళ్లు. పొడవాటి దేహం, చక్కని సుందరమైన తేజస్సు ముఖాసౌందర్యం గల వాళ్లు. పురుషులు మంచి కండపుష్టి కలిగి, మంచి ఎత్తుతో రాజపుత్రుల లక్షణాలని కలిగి ఉంటారు. వారి సంప్రదాయ దుస్తులు పంచెతో కట్టుకునే ధోతి, పై చొక్క, రుమాలు మొదలగునవి. స్త్రీలు అందమైన ముఖసౌందర్యం కలిగి రంగు రంగుల దుస్తులపై అద్దాల అమరికతో వారి సంప్రదాయ దుస్తులను ధరిస్తారు. బంజారాలు రాజస్థాన్ నుండి దెక్కన్‌కు మహ్మదీయుల సైనికులతోపాటుగా వచ్చారని ఎంతోమంది చరిత్రకారులు తెలిపారు. వీరు ముఖ్యంగా మొగలుల సైన్యాలతో పాటుగా వచ్చినట్లుగా మనకు మధ్య భారతదేశ చరిత్ర ద్వారా తెలుస్తుంది. బంజారాల సంప్రదాయ ఆచార వ్యవహారాలు దేశం మొత్తం ఘనంగా వర్ధిల్లడానికి గల బలమైన కారణం వారి ఎద్దుల బండ్లు. వాటితో భారతదేశం మొత్తం వారు సంచార వ్యాపారం కొనసాగించేవారు. ఇప్పటిలాగా రవాణా వ్యవస్థ అభివృద్ధి లేని రోజులలో సరుకులు ఎలా రవాణా చేయాలో ఏ దారుల గుండా వెళ్లాలో తెలిసిన వారు బంజారాలు. కాలక్రమేణా భారతదేశంలో ఆంగ్లేయులు రవాణా వ్యవస్థ, రైల్వేలు వంటివి అభివృద్ధిపరిచిన తర్వాత బంజారాల ప్రాముఖ్యత తగ్గిపోతూ వచ్చింది. వారు జీవనాధారం కోల్పోవలసి వచ్చింది. బంజారాలు సంచార వ్యాపారం నుండి స్థిరనివాసం, వ్యవసాయం, పశుపోషణ వంటి వృత్తులను ఎంచుకోవడం ఆరంభించారు. అదే క్రమంలో కొంతమంది బంజారాలు వేరే వృత్తులలో ఇమడలేక చిన్న చిన్న నేరాలు చేయసాగారు. అప్పటి ప్రభుత్వం వీరిని నేరస్తతెగగా ముద్రవేసింది. వీరిని క్రిమినల్ ట్రైబ్స్ యాక్ట్ క్రింద గుర్తించింది. వీరి యొక్క కదలికలపై ప్రభుత్వం నిఘా ఏర్పాటు చేసింది.

**బంజార - క్రిమినల్ ట్రైబ్:**

బ్రిటిష ప్రభుత్వం 1871వ సంవత్సరంలో క్రిమినల్ ట్రైబ్స్ చట్టాన్ని తీసుకువచ్చింది. అందులో క్రిమినల్ ట్రైబ్స్‌గా బంజారలు కూడా ఉన్నారు. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత 1952వ సంవత్సరంలో ఈ చట్టాన్ని రద్దు చేశారు. 1871 నుండి 1952 వరకు బంజారాలు దేశంలో క్రిమినల్ ట్రైబ్స్‌గా ఉన్నారు. ఈ చట్టాన్ని నిజాం రాజ్యంలో కూడా అమలుపరిచారు. బంజారాలు నేరస్త ప్రవృత్తిని విసర్జించటానికి గాను నిజాం ప్రభుత్వం బంజారాల ఆర్థిక స్థితిగతులను అభివృద్ధి చేయటానికి వారి సంక్షేమం కోసం ఎన్నో పథకాలని ప్రవేశపెట్టింది. తద్వారా బంజారాలని క్రిమినల్ కార్యకలాపాల నుండి తప్పించి మార్పు తేవాలని ప్రయత్నించింది.

ఇందుకు గాను ప్రతితండాను స్థానిక పోలీసుల నిఘాలో ఉంచేవారు. కొంతమంది బంజారాలు వారి తండాలను అడవులలో నుండి మైదాన ప్రాంతాలకు మార్చి పోలీసు వారికి సహకరించారు.

నిజాం - పాస్:

లంబాడీలలో నిజాయతీ పరులకి నిజాం ప్రభుత్వం వారి వారి ప్రవర్తనలను, గుణగణాలను బట్టి బంజారాలకు పాసులను ఇచ్చేది. ఈ పాసులను పోలీసులు నివేదిక ఆధారంగా ఇచ్చేది. మంచి ప్రవర్తన లేని బంజారాలు ప్రతి రోజూ పోలీసు స్టేషనులో వారి హాజరును చూపవలసి వచ్చేది. పోలీసులకు నిజాం ప్రభుత్వం సర్వాధికారాలను ఇచ్చింది. పోలీసులు ఎవరిదగ్గరైనా పాసులు లేనట్టయితే వారిని బయట తిరగనిచ్చేవారు కాదు. ఎటువంటి కారణం లేకుండా వారిని నిర్బంధించవచ్చు, అరెస్టులు చేయవచ్చు. ఈ చట్టాన్ని ప్రస్తుత AFSPA -1958 చట్టంతో పోల్చవచ్చునని నా భావన.

క్రిమినల్ ట్రైబ్స్ చట్టం కారణంగా లంబాడీలు / బంజారాలు చాలా దుర్భర జీవితాన్ని గడపాల్సి వచ్చింది. బంజారాలు బయట తిరిగేటప్పుడు నిజాం ప్రభుత్వం జారీ చేసే పాసులే వారికి బోనఫైడ్‌గా ఉండేది.

ఈ క్రింద చూపబడినది నిజాం ప్రభుత్వం జారీ చేసిన పాస్.

The following is one such pass issued by the Nizam's Governement.

(Certificate for exclusion issued by the Director of Security Department of District, of His Highness, Nizam's Government, established vide No.1345, F.)

No.1-61880

Name - Bhimla s/o Porsia; age: 22 years caste / Tribe - Lambada declared as criminal of village Madoor - Station House Madoor; Taluqa Kodangal, District, Gulbarga Sharif. As you have been proved to be a person of good conduct, so accordingly on the basis of powers laid down under the act No.5 and indicated at No.7 of the Criminal Tribes Act vide No.13-22, you are being excluded from the list of criminal tribes, register on the condition that you adopt a good behavioural way of life and earn your livelihood through honest means, so that you may not subject yourself to any kind of allegation under suspicion, crime or misbehaviour. In case you are foundalleged with suspicion, crime or misbehaviour; then the certificate of exclusion from the criminal tribes issued under the above mentioned conditions and terms will be withdrawn from you immediately.

Right hand thumb impression

Identification as observed by the Director of Administration

Sd/11-34

As Director Administration Security Department of Districts of His

Source: Census of India 1961
Lambadi Monograph Series, MOTA, New Delhi.

## నిజాం రాజ్యంలో బంజార జనాభా -1911

| ప్రాంతం | మగ | ఆడ |
|---|---|---|
| హైదరాబాద్ | 26 | 2 |
| అత్రఫ్ బాల్ద | 2,255 | 1,812 |
| వరంగల్ | 28,924 | 24,634 |
| కరీంనగర్ | 3,227 | 2,868 |
| ఆదిలాబాద్ | 2,806 | 2,573 |
| మెదక్ | 2,154 | 1,821 |
| నిజామాబాద్ | 971 | 848 |
| మహబూబ్‌నగర్ | 7,213 | 5,650 |
| నల్లగొండ | 20,728 | 17,337 |
| ఔరంగబాద్ | 2,284 | 2,197 |
| బీర్ | 159 | 204 |
| నాందేడ్ | 1,166 | 1,124 |
| ఫర్భానీ | 1,094 | 1,039 |
| గుల్బర్గా | 2,859 | 2,401 |
| ఉస్మానాబాద్ | 84 | 81 |
| రాయ్‌చూర్ | 132 | 130 |
| బీదర్ | 621 | 620 |

Source: The Castes and Tribes of HEH the Nizam Dominions, Syed Siraj Ul Hassan - 1989

బంజారలు భారతదేశం మొత్తం వ్యాపించి ఉన్నప్పటికీ వారిని ఒక్కొక్క రాష్ట్రంలో స్థానికంగా ఒక్కొక్క పేరుతో పిలుస్తారు.

| | | |
|---|---|---|
| 1. | తెలంగాణ | లంబాడీ |
| 2. | ఆంధ్రప్రదేశ్ | సుగాలి, లంబాడీ |
| 3. | ఉత్తరప్రదేశ్ | బంజార |
| 4. | హర్యానా | బంజార, సిరికివాలా |
| 5. | బీహార్ | వనజార |
| 6. | మధ్యప్రదేశ్ | బంజార |
| 7. | కర్ణాటక | లమాణా, లమాణీ, లంబాడీని, లంబాడ |
| 8. | మద్రాసు | సుగాలి |
| 9. | కేరళ | గహర్, గౌరియా |
| 10. | రాజస్థాన్ | గవారియా, గమాలియా |
| 11. | పంజాబ్ | సిరికివాలా |
| 12. | మహారాష్ట్ర | గవర, గవారా, కంగ్‌సిమా, సింగడి వనజారి |
| 13. | ఢిల్లీ | సిరికిబాండ్ |
| 14. | ఒరిస్సా | లంబాడీ |

ఏ జాతుల వారు ఏ కేటగిరిలో ఉండాలి అనే అంశాన్ని రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర ప్రభుత్వాలకు విన్నవిస్తే, భారత రాజ్యాంగం ప్రకారం రాష్ట్రపతి వాటిని ఆయా జాతులలో చేర్చుతారు. ఏదైనా ఒక జాతి / తెగను షెడ్యూల్డు తెగలుగా గుర్తించేందుకు లోకూర్ కమిటి కొన్ని ప్రామాణికాల్ని నిర్దేశించింది. అవి 1. అతి పురాతన సాంకేతిక విధానం (ఆహార సేకరణ, పోడు వ్యవసాయం), 2. ప్రత్యేక సంస్కృతి (భాష,

ఆచారాలు, నమ్మకాలు, కళలు వగైరా), 3. ప్రత్యేక నివాస ప్రాంతం (కొండలు, అడవులు, మైదానాలు లాంటివి), 4. బయటి వారితో కలవడానికి ఇష్టపడకపోవడం, 5. బాగా వెనుకబడి ఉండటం (మానవాభివృద్ధి సూచికలు (విద్య, ఆరోగ్యం, ఆదాయం లాంటివి). వీటి ఆధారంగానే ఒక్కొక్క రాష్ట్రంలో బంజారాలు ఒక్కొక్క కేటగిరిలో ఉన్నారనిపిస్తుంది. భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 366(25)లో షెడ్యూల్డు తెగల గురించి నిర్వచించడం జరిగింది. ఆర్టికల్ 342 ప్రకారం రాష్ట్రపతి షెడ్యూల్డు తెగలను ప్రకటిస్తారు. ఏదేని తెగలను ఈ జాబితాలో చేర్చడానికి గాని తీసివేయడానికి గాని పార్లమెంటుకు అధికారం ఉంది.

భారతదేశంలో బంజారాల కెటగిరీ

1. బంజారాలు ఎస్టీలుగా ఉన్న రాష్ట్రాలు: తెలంగాణ, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, బీహార్
2. బంజారాలు ఎస్సీలుగా ఉన్న రాష్ట్రాలు: కర్ణాటక, పంజాబ్, హర్యాన, హిమాచల్‌ప్రదేశ్, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్
3. బంజారాలు బిసీలుగా ఉన్న రాష్ట్రాలు: గుజరాత్, గోవా, అస్సాం, హర్యాన, జమ్ముకాశ్మీర్, కేరళ, మధ్యప్రదేశ్, తమిళనాడు, త్రిపుర, ఉత్తరప్రదేశ్, వెస్ట్ బెంగాల్, చత్తీస్‌ఘడ్,డయ్యు & డామన్ (కేంద్ర పాలిత ప్రాంతం)
4. బంజారాలు ఓబిసీలుగా ఉన్న రాష్ట్రాలు: రాజస్థాన్, మహారాష్ట్ర

బంజార గోర్‌బోలి భాష :

బంజారాలు/లంబాడీలు తమను తాము 'గోర్' అని ఇతరులను 'కోర్' అని పిలుస్తారు. దేశంలోని గిరిజనులతో పోల్చుకుంటే వీరికి కొన్ని ప్రత్యేకతలున్నాయి. దేశమంతా వీరు విస్తరించినప్పటికీ ఒకే రకమైన భాషను మాట్లాడుతున్నారు. లంబాడీ భాషలో చాలా ప్రాచీన లక్షణాలు కలవు. ఇది పాక్షికంగా మార్వాడి, ఉత్తర గుజరాతి భాషల మీద ఆధారపడి ఉంటుందని సర్ జాన్ గ్రియర్సన్ అభిప్రాయ పడ్డారు. గుజరాతీ+ మరాఠీ+ రాజస్థానీ+ హిందీ = గోర్‌బోలి భాష (లంబాడి భాష). లంబాడీలు మాట్లాడే భాష నాలుగు భాషల కలయికగా ఇండో ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినదిగా భాషా శాస్త్రవేత్తలు నిర్ధారించారు. వీరి భాషకు లిపి లేదు. సాహిత్యం మొత్తం మౌఖికంగానే ఉంటుంది. ఇప్పుడిప్పుడే కొందరు తెలుగు లిపి సాయంతో బంజార సాహిత్యాన్ని లిఖిస్తున్నారు.

భాషా సంస్కృతి - నాగరికత

భారతదేశంలో అంతటా కనబడే లంబాడీలు/బంజారాలు ఇండియాలోని ఇతర యే ప్రాంతంలో కన్నా హైదరాబాదు సంస్థానంలో ఎక్కువ సంఖ్యలో ఉండేవారని 1952వ సంవత్సరంలో హైదరాబాద్ ప్రభుత్వపు సాంఘికసేవాశాఖ డైరెక్టర్ అబ్దుల్ గఫూర్ గారు కొండజాతుల వారి సంక్షేమము అనే పుస్తకంలో రాశారు. మరియు లంబాడీలను బ్రింజారులు, గోహర్లు, హర్కారాలు, లామనెలు అని కూడా అంటారని వారు రాశారు. బంజారలు ధృఢకాయులు, వారిది పౌరుషవంతమైన జాతి, పొడవైన ఆకారము, అందమైన శరీర చర్మము ప్రకాశవంతమైన కన్నులు కలవారు. ఆయుధాలు ప్రయోగించుటలో వారు సమర్థులు. లంబాడీల ఉపతెగలలో మధురలను బ్రాహ్మణుల వంటి వారని, బంజారులు క్షత్రియుల వంటి వారని లంబాడీలను వైశ్యుల వంటి వారని, అబ్దుల్ గఫూర్ గారు వారి పుస్తకంలో వివరించారు.

బంజార / లంబాడీల భాషా సాంస్కృతిక అభివృద్ధికి భారత స్వాతంత్ర్యానికి పూర్వమే అప్పటి ప్రభుత్వాలు ఎంతో కృషి చేశాయి. లంబాడీలకు ప్రత్యేక టీచర్ ట్రెనింగ్ సెంటర్‌లను నిజాం ప్రభుత్వం ఏర్పాటు చేసింది. నిజాం ప్రభుత్వంలోని సాంఘిక సంక్షేమశాఖ లంబాడీల భాషపై, విద్యపై ప్రత్యేక శ్రద్ధ పెట్టి వారి మాతృ భాషలో - బంజార బాలశిక్ష, బంజార మొదటి రీడర్, బంజార రెండవ రీడర్, బంజార పెద్దవాళ్ళ చార్టులు, బంజార చిత్రపథ్, రాదామోలా కథలను తెలుగు మరియు హిందీ లిపుల సాయంతో ప్రచురించింది. బంజారల పుట్టుకకు ఆధారంగా భావించే రాదామోలల కథే, బంజార భాషలో ముద్రించబడిన మొదటి పుస్తకం అని కేంద్ర ప్రభుత్వం ప్రచురించిన లంబాడీ మోనోగ్రాఫ్ పుస్తకంలో లిఖించబడింది. రాయలసీమలోని పాలెంపల్లి తండలో 1936లోనే లంబాడీలకు ప్రత్యేక లంబాడీ పాఠశాల ఉండేది. విద్యను తెలుగు లిపి సాయంతో లంబాడీ భాషలో బోధించేవారు. 1952లో అప్పటి వరంగల్ జిల్లాలో దాదాపు ఒక లక్ష వరకు లంబాడీ ప్రజలు కలరు. వరంగల్ జిల్లాలోని మహబూబాబాద్ తాలుకాలో ఈ జాతి వారు విశేషంగా ఉన్నారు. తురూర్ గ్రామం చుట్టూ మొత్తం లంబాడా తాండాలు వ్యాపించి వున్నవి. తురూర్‌లోని లంబాడీలు తమ జాతి సముద్ధరణ కొరకు చాలా ఆదుర్థా పడుతుండినారు. వారు తమ కొరకు సొంతంగా ఒక ప్రైవేటు బడిని స్థాపించుకొని, ఆ కేంద్రంలో విద్య నేర్పబడుతుండేది అని గఫూర్ గారు రాశారు. బహుశా తెలంగాణలో ఇదే లంబాడీల మొదటి పాఠశాల అయి వుండవచ్చు.

బంజార / లంబాడీలను వారి భాషా, సంస్కృతిని ప్రత్యేకంగా గుర్తించి వారిని నాగరికులుగా చేయటానికి స్వాతంత్ర్యానికి పూర్వం నుండే ప్రభుత్వాలు ఎంతో కృషి చేసినట్లుగా మనకు పుస్తకాల ద్వారా తెలుస్తుంది. బంజారలు ఇతర గిరిజన తెగలులాగా కాకుండా మైదానాలలో ప్రత్యేక ఆవాసాలు తండాలలో నివసిస్తూ పట్టణ నాగరిక సమాజంతో అట్టే కలిసిపోయేవారు. అలా కలుస్తూపోతూ పోతూ మొదటగా వారి ఆడవారి సంప్రదాయ దుస్తులను మార్పించడం జరిగింది. (బంజారల సంప్రదాయ దుస్తులు వదిలి తెలుగు వారు ధరించే దుస్తులు వేసుకోవడం). ఈ తతంగం 1950వ దశకంలోనే మొదలైనట్లుగా తెలుస్తోంది. కారణాలు ఏవైనప్పటికీ వారి భాషా సాంస్కృతిక వారసత్వాన్ని వదిలి, నాగరిక సమాజంతో కలవటానికి ఆతురత పడుతుండినారని తెలుస్తోంది. 1956వ సంవత్సరంలో హైదరాబాద్‌లోని బాపునగర్‌లో నివాసముండే దీప్‌లాల్ చౌహన్, ప్రెసిడెంట్, ఆంధ్రప్రదేశ్ బంజార సేవా సంఘం గారి భార్య తన సంప్రదాయ వస్త్రాలను మార్చుకొని నాగరిక సమాజంలో కలవడానికి అంగీకరించినట్లు తెలుగు, హిందీ భాషలలో పత్రికలు ముద్రించి అందరికి పంచి, అందరిని ఆహ్వానించి పెద్ద పండుగగా ఈ వస్త్రాల

## ఆదర్శ దంపతులు
## కీ.శే.రావెళ్ళ కృష్ణారావు గారు, కీ.శే. పాపక్క గారు



2004లో 'నడుస్తున్న చరిత్ర' వల్ల వారితో ఏర్పడిన పరిచయం కుటుంబస్నేహంగా మారింది. ఆత్మీయంగా ఎదిగింది.. అక్టోబరు 2012లో కృష్ణారావుగారు కనుమరుగైనారు. ఇప్పుడు ఈ ఏప్రిల్ 15న పాపక్కగారు తనువు చాలించారు.

కృష్ణారావుగారికి నడుస్తున్నచరిత్ర పత్రికతోపాటు నడిచిన తెలుగు భాషోద్యమం ఎంతో ఇష్టం. ఎప్పుడూ నాకు సూచనలు చేస్తుండేవారు. వ్యక్తిగతంగా మా బంధం పటిష్టమై, ఆయన నిర్వహణలో నడుస్తున్న వయోజన విద్యాభివృద్ధి (SPACE) తో సంబంధం కలిగించింది. ఆయనతో సాన్నిహిత్యం వల్ల నాకు ఏర్పడిన సజ్జనసాంగత్యం ఉపకరించింది. ఆయన తనువు చాలించిన తర్వాత కూడా పాపక్కగారితోనూ, వారి కుటుంబంతోనూ స్నేహసంబంధాలు కొనసాగుతూనే వున్నాయి. నాపట్ల సోదరవాత్సల్యంతో నాక్షేమాన్ని కోరుకున్న పాపక్క గారు కూడా దివంగతు కావడంతో నైతికంగా నాకున్న పెద్ద అండ కనుమరుగయ్యింది.

పాపక్కగారి పూనికకు కృష్ణారావుగారు తోడై మాపెద్ద కుమారుని పెళ్ళిసంబంధం విషయమై చేసిన సహాయం మా కుటుంబానికి ఎంతో సంతోషాన్నిచ్చింది. వారి ఆశీర్వాదాలతో మా అబ్బాయి,కోడలు, ఇద్దరు పిల్లలతో హాయిగా ఉన్నారు. ఆ వివాహం తెలుగులో జరిగింది. అర్థంగాని భాష, అవసరం లేని పౌరోహిత్యం ప్రసక్తిలేదు. కట్న కానుకలు, ఆస్తిపాస్తుల వివరాలు కులగోత్రాల గొడవకు ఆస్కారం లేదు. నేను కోరుకున్నట్లే అంతా జరిగింది. ఈ ఘనత అంతా పాపక్కగారిదే. ఆమెకు తోడుగా నిలిచిన కృష్ణారావుగారిదే.

పాపక్కగారు కేవలం గృహిణికాదు. ఆమె ప్రధానోపాధ్యాయినిగా సూర్యాపేటలో పనిచేశారు. కృష్ణారావుగారితో 1960లో వివాహమైన తర్వాత రెండు ఎం.ఎ.డిగ్రీలు,ఎం.ఇడి చేశారు. పేద విద్యార్థులకు చదువు చెప్పి వారి ఎదుగుదలకు ఎంతో తోడ్పడ్డారు. కృష్ణారావుగారికి వెన్నుదన్నుగా నైతిక బలంగా ఆమె పాత్ర గణనీయం. ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. అంతా ఉన్నత స్థాయిలో జీవితాల్లో, సమాజంలో నిలదొక్కుకున్నారు. ఆ ఘనతలో పాపక్కగారి పాత్ర ఎంతైనావుంది. కృష్ణారావుగారు ఎన్నో ఉన్నతస్థాయి బాధ్యతల్లో ఉన్నా, పాపక్కగారి ప్రభావం ఆయన జీవితమంతా ఉంది. గొప్ప దాంపత్యం వారిది.

నాకు, నేను చేసే సామాజిక కార్యక్రమాలకు నైతిక అండగా నిలిచిన ఆదర్శదంపతులు కనుమరుగయ్యారు. కాలం తన పనిని తాను చేసుకుపోతుంది. మనకు ఎన్నో పాఠాలు నేర్పుతుంది. నేర్చుకొంటూ ఉండాల్సిందే. వారి కుటుంబ సభ్యులందరికీ ఆత్మీయ సహానుభూతి.

– సామల రమేష్‌బాబు

మార్పిడి కార్యక్రమాన్ని నిర్వహించి, నాగరిక సమాజంలో కలుస్తున్నట్లుగా లంబాడీ మోనోగ్రాఫ్‌లో రాశారు. నేటి తరం బంజార / లంబాడీలలో బంజారల సాంస్కృతిక దుస్తులు అరుదుగా కనిపిస్తున్నాయి. రేపటి తరంలో అవి కనిపిస్తాయన్న నమ్మకం లేదు.

### ముగింపు:

తెలంగాణ రాష్ట్రంలోని గిరిజన తెగలలో ఎక్కువ జనాభా కలిగి ముందు వరుసలో ఉన్న లంబాడీలు భాష సంస్కృతిని కాపాడుకోవటంలో వెనుక వరుసలోకి వెళ్లిపోయినట్టుగా అనిపిస్తుంది. కారణాలు ఏవైనప్పటికీ వారి వేష భాషలు మార్చుకుని అభివృద్ధి చెందుతున్న నాగరిక సమాజంలో కలవడమే వారి నాగరికతగా భావిస్తూ, తరతరాలుగా వారసత్వ సంపదగా వస్తున్న వారి వేష భాషలను మార్చుకుంటూ, ముందుకు వెళ్ళడం ఆర్థిక నాగరికత అనిపించుకున్న వారి సంప్రదాయ భాషా సాంస్కృతిక నాగరికతను మాత్రం కచ్చితంగా పోగుట్టుకుంటున్నట్లే. పీఠభూములలో తండాలు ఏర్పాటు చేసుకొని నివసించే వీరు, మిగిలిన గిరిజనుల్లా కాకుండా నాగరిక సమాజంతో వెంటనే కలిసిపోతున్నారు. ఈ నాగరిక సమాజంలో వారి జీవన పోరాటాలు కొనసాగిస్తూ వారి భాషా సంస్కృతిని నిర్లక్ష్యం చేస్తున్నారు. పట్టణాలు, నగరాలకు వలసలు వీరిలో ఎక్కువగా కనిపిస్తాయి. ఏ జాతి అయినా నాగరిక సమాజాలలో కలిసి జీవనాన్ని కొనసాగించినప్పుడు వారి భాషా, సంస్కృతి అభివృద్ధి చెందిన నాగరిక సమాజాల భాషా సంస్కృతుల ప్రభావంతో మార్పునకు గురికావడం, క్షీణించడం జరుగుతుంది, బంజార/ లంబాడీ విషయంలో కూడా అదే జరుగుతున్నది. నాగరిక సమాజంతో కలవకుండా ఇంకా తండాలలోనే జీవనాన్ని కొనసాగిస్తున్న బంజారలు / లంబాడీలు మాత్రం వారి వేష, భాషా, సంస్కృతిని కాపాడుకుంటూ వస్తున్నారు. ఇప్పటికైనా బంజారలు / లంబాడీలు మేల్కొని వారి భాష సాంస్కృతిక నాగరికతను కాపాడుకుంటూ రాబోయే తరాల వారికి అందించటానికి కృషి చేయాలి. లేదంటే నిన్నటి తరం కాపాడుకుంటూ కొనసాగిస్తూ వచ్చిన వారసత్వ భాషా సాంస్కృతిక నాగరికతను రేపటితరానికి అందించడంలో నేటి తరం విఫలమవుతుందని నా భావన. నాగరిక సమాజాలతో కలిసి జీవిస్తూ అభివృద్ధి పథంలో నడవటానికి వారసత్వ వేష, భాష, సంస్కృతిని మార్చుకోవాల్సిన అవసరం లేదని గుర్తించాలి.

రచయిత ఐసిఎస్ఎస్ఆర్-పిడిఎఫ్ స్కాలర్,
పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం-హైదరాబాద్

రాజ్యాంగం గుర్తించిన 22భాషలూ జాతీయ భాషలే

శ్రీనివాస్ అంకే
9652471652

# ' రేనాడు ' విస్తరణ

- రేనాణ్డు ఏళ ఈనై-ద్ది వాడి ఎరిగ
- పటుకాను రేనాణ్ణే - ళుచు తక్క పుళోల
- రేనాణ్ను ఏ ఋ (Zah)
- సిద్దవటం బా- న్తుల్ రేనాణ్డేళు - ఏణ్ణు
- తరుమర విషయంబేళుచు రేనాణ్డుపొడిచి
- వ్రేనాణ్ణేఋవేల
- రేనాణ్ణు ఏళువేశు ఏళుచుణ్డి

అని క్రీ.శ. ఆరు, ఏడు శతాబ్దాల నాటి శాసనాలలో రేనాడు విస్తృతంగా దర్శనమిస్తుంది. రేనాడు ప్రాచీన తెలుగునాడులలో ఒకటి.బహుశా క్రీ.పూ. ఒకటి,రెండు శతాబ్దాల నాటికే భౌగోళికంగా రాజకీయంగా స్థిరపడిపోయిన ప్రాంతం. విజయనగర సామ్రాజ్య శాసనాలలో కూడా రేనాడు ప్రస్తావనకొస్తుంది. కానీ ఆరుఏడు శతాబ్దాల నాటి నైసర్గికత పదహారవ శతాబ్దంలో లేదు. ఉదా:

- రేనాడు నందేల చెంన్నకేశ్వర - క్రీ.శ. 1521 - దొమ్మరినందేల శాసనం
- పినాకినదికి ఉత్తరం రేనాటి సీమలోను - క్రీ.శ. 1539 - బూతుమోపురు శాసనం
- ఘండికోట రాజ్యంలోని రనాటి సీమలోను - క్రీ.శ. 1557 - పెద్దముడియం శాసనం

రేనాడు ఏడువేల నాడుగా ప్రసిద్ధి. అంటే ఏడువేల గ్రామాలు కలిగిన ప్రాంతం.కడప,కర్నూలు,అనంతపురం, చిత్తూరు, జిల్లాల్లో భౌగోళిక నైసర్గికత కలిగిన ప్రదేశమిది.

కుందూరి ఈశ్వరదత్తు గారి విశ్లేషణ ప్రకారం రేనాటి ప్రాంత విస్తరణ ఇలా వుండేది

కమలాపురం, ప్రొద్దుటూరు
పులివెందుల, జమ్మలమడుగు } కడప జిల్లా
బనగానపల్లి
కోవెలకుంట్ల } కర్నూలు. జిల్లా
మదనపల్లి - చిత్తూరు జిల్లా
శ్రీకాళహస్తి - చిత్తూరు జిల్లా

రేనాడు అనే పేరు ఈ ప్రాంతానికి ఎందుకొచ్చింది? రేనాడు పదవ్యుత్పత్తి ఏమిటి? ఈ ప్రాంతంలో ఎక్కువభాగం నల్లరేగడినేల, రేగడినాడు రేనాడుగా స్థిరపడిందని పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు గారు చెబుతున్నమాట. ఈ ప్రాంతాన్ని రేనాటి చోళులు పాలించారు. రాజవంశం ద్వారా ఈ ప్రాంతానికి ఈ పేరు ఏర్పడలేదు. ఈ ప్రాంతం వల్లనే పాలనావంశాని కీ పేరు వచ్చింది రేనాటి చోళులని! భారతదేశంలో ప్రాచీన రాజవంశాలు, వృక్షాలు, మొక్కల పేర్లు పెట్టుకున్నాయి. వృక్షసంబంధంగానూ ఈ పేరు వ్యవహారంలోకి వచ్చినట్లుగానూ కనిపించడం లేదు (రేగు / రేను).

రేనాడులోని 'రే' రేగడిని గాక 'రేడు' అనే నృపవాచకమయ్యే అవకాశముందని నీలకంఠశాస్త్రి, ముట్లూరి వెంకట రామయ్యగార్లు చెప్పినట్లు ఆరుద్ర చెబుతున్నారు. ఇదీ వాస్తవం కాకపోవచ్చు. ఎందుకంటే మనకు లభిస్తున్న తొలితెలుగు శాసనాలు రేనాటి చోళులవి! వీరు ప్రాంత నేపథ్యంగానే బిరుదులుగా పెట్టుకున్నారు. ఉదా: ఎతికల్ ముత్తురాజు ఎతికల్ అనేది రేనాడులోని ఒక ప్రాంతం పేరు. 'ఱేడు' అనే మాట రేనాటి చోళుల శాసనాల్లోనే ఉంది. "పెన్బాఋ (Zah) ఇశఱేనికిన్" (పొట్లదుర్తి-మాలేపాడు శాసనం 610) ఱేనికిన్ అనే సమాస నిర్మాణం గమనించదగినది, ఇందులో 'ఱేడికిన్' అని లేదు. 'ఇశై' అంటే సంగీతమని ద్రావిడ భాషార్థం. 'పెద్ద బ్రాహ్మణుడైన ఇశఱేడు' అని పై మాటకు అర్థం. 'ఱేడు' శబ్దం తద్భవరూపం. రేనాటి చోళుల శాసనాల్లో తత్సమ తద్భవ రూపాలు రెండూ కనిపిస్తాయి. ఉదా: సోళ మహారాజు, ఎతికళ్ముతు రాజు. తొమ్మిదవ శతాబ్దానికి ముందున్న చోళ, వైదంబ శాసనాల్లో మూర్ధన్య అనునాసికాంతంగా 'రేనాణ్డు' అనే ఉంది. దంత్యఅనుసానికాంతంగా లేకపోవడాన్ని మనం గమనించాలి. పదవ శతాబ్దం తర్వాతనే ఔపవిభక్తికంగా 'రేనాటి' శబ్దంగా పరిణమించింది. అందువల్ల రేడు + నాడు = రేనాడు అనే నిర్మాణం ఏవిధంగానూ సాధ్యం కాదన్నది స్పష్టమవుతున్న విషయం. 'ఎతికల్' అనే మాట ప్రాంతాన్ని సూచిస్తుంది. అది శ్రీకాళహస్తి సమీపంలోని 'ఇనగలూరు' గా కొందరు చెబుతున్నప్పటికి సమంజసంగా కనిపించడం లేదు. ఎందుకంటే 'ఎపిగ్రాఫికా కర్నాటకా' - 12వ సంపుటంలో 'ఎరిగలవాడి అరునూరు' అనే పదం కనిపిస్తోంది. పావగడ ప్రాంతంలోని 'నిడుగల్లు' ఎతికల్ రూపాంతరమని నీలకంఠశాస్త్రి గారి అభిప్రాయం. ఈ అభిప్రాయం సహేతుకంగా వుంది. నేలటూరు వెంకటరమణయ్య గారి 'పూర్వోద్ధృతము' లో రేనాటి చోళుడు పావగడ తాలూకాలోని నిడిగల్లు, ఎరిగల వాడి వైపు విస్తరించినట్లు రాశాడని డా. అవధానం ఉమామహేశ్వర శాస్త్రి కూడా ఉదాహరించారు. అందువల్ల నేటి పావగడ ప్రాంతం కూడా రేనాడులో ఉండేదనడంలో సందేహం లేదు. ఈ ప్రాంతంలోని మరో రెండు చోళ శాఖలు కూడా కనిపిస్తున్నాయి. హేమావతి చోళులు, నిడిగల్లు చోళులు అని. ఈ రెండు శాఖలతో పాటు రేనాటి చోళులు కూడా ఒకే కుదురు నుండి విస్తరించినట్లు రేనాటిచోళుల 'ఎతికల్ ముత్తురాజు', ఎపిగ్రాఫికా కర్నాటకా - 12 సం 'ఎరిగలవాడి' మాటలు ఋజువు చేస్తున్నాయి.

"ఇక్ష్వాకుల కాలంలో హరిణకులు, పుంగీయుల మొదలైన వారు వారిసామంత ప్రాంతాలుగా ఆంధ్రదేశంలోని వివిధ భాగాలను పాలించినట్లు వాళ్ళ శాసనాలు తెలుపుతున్నాయి. పూంగీయుల పేర 'పూంగినాడు' హిరణకుల పేర 'హిరణనాడు' ఏర్పాడ్డాయి. హరణ శబ్దం తెలుగులో 'అరణ'గా మార్పు చెందినట్లే 'హిరణ' శబ్దం 'ఇరన' గా మారింది. తర్వాత స్వరవ్యత్యయం వల్ల 'ఇరన' యే 'రేన' గా

మారి 'నాడు'తో కలసి 'రేనాడు' గా పరిణామం చెందింది" అని డా. కోడూరి ప్రభాకర్‌రెడ్డి గారి అభిప్రాయం.

ఈశ్వరదత్తు గారు మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్ట్సు ఆధారంగా మరోమాట చెప్పారు. హిరణ్యరాష్ట్రమున కానామము హెరన్నాకులను తెగవారీప్రాంతమున నివశించి యుండుటచే గల్గియుండవచ్చునని యూహింపబడుచున్నది."

ఇవి భిన్నాభిప్రాయాలుగా కనిపిస్తున్నప్పటికీ, ఇవి ఇకే భావనకు సంబంధించినవే! మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్ట్స్ అంటే మరేమీకాదు కైఫీయత్తులే!

ప్రభాకర్‌రెడ్డి గారి అభిప్రాయమైన హిరణ > ఇరన > రేన పరిణామం కూడా సాధ్యం కాదు. ద్రావిడ భాషలో మూలంలేని ఇ ప్రత్యయం పదాదిలో వచ్చి కూర్చుంటుంది. 'ఎ' గా కూడా పరిణమిస్తుంది. ఇది సంఖ్యా వాచకాల్లో కూడా కనిపిస్తుంది. ఉన్న ప్రత్యయం వీడిపోదు.

రెండు = ఇరంటు రామ = ఇరామన్

రెండు చెఱువులు = ఎరడికెఱ రేయి = ఇరవు

హిరణికులు ఈ ప్రాంతంలో ఉండేవారని అందువల్లనే ఈ ప్రాంతాన్ని హిరణనాడు, హిరణ్యక రాష్ట్రంగా పిలిచారా? ఇక్ష్వాకుల కాలంలో 'వాసిఠీపుతకందచలికరెంణక' అనే దండనాయకుడు ఉండే వాడు అతడు 'హిరణంక' వంశస్థుడు. అతడు పాలించడం వల్ల ఈప్రాంతానికి హిరణ్య రాష్ట్రమని పేరు వచ్చినట్లు కొందరి అభిప్రాయం. ఇది అర్ధసత్యంగా కనిపిస్తోంది. ఎందుకంటే ఒకే సమయంలో హిరణంక పదం నుండీ హిరణ్య, రేనాడు అనే రెండు పదాల పరిణామం ఒకేసారి జరగడం సాధ్యంకాదు. రేనాడు దేశ్యశబ్దం. హిరణంక హిరణ్యగా మారే అవకాశం ఉంది. క్రీ.శ. 1929లో లభించిన కర్నూలు జిల్లా, పత్తికొండ సమీపంలో అశోకుని ఎర్రగుడి శాసనం ఆధారంగా కొన్ని విషయాల్ని బి.ఎస్.ఎల్ హనుమంతరావు వివరిస్తున్నారు. అశోకుని సామ్రాజ్యం నాలుగు భాగాలుగా వుండేది. పశ్చిమోత్తర ప్రాంతానికి తక్షశిల, కళింగ ప్రాంతానికి తోసలి, పశ్చిమ ప్రాంతానికి సోపార, దక్షిణ ప్రాంతానికి సువర్ణగిరి రాజధానులుగా వుండేవి. ఈ సువర్ణగిరి కర్నూలు జిల్లా పత్తికొండ సమీపంలో ఎర్రగుడి పొరుగు గ్రామమైన జొన్నగిరి. అనంతపురము జిల్లాలోని రామగిరి బంగారు గనులు, కోలారు బంగారుగనులలో మౌర్యులకాలంలోనే తవ్వకాలు జరిపినట్లు చరిత్రకారులు తేల్చిన విషయమే! ఎర్రగుడి, జొన్నగిరి, పత్తికొండ ప్రాంతాల నుండి వజ్రకరూరు ప్రాంతం వరకు అనాది కాలం నుండీ వజ్రాలూ లభిస్తున్నాయి. అందువల్ల ఈ ప్రదేశాన్ని హిరణ్య రాష్ట్రమని పిలవడంలో ఆశ్చర్యమేమీ లేదు. కన్నడలో హొన్నమాడి అనేవారు. హిరణ్యానికి కన్నడరూపం హొన్న! హిరణ్యం, సువర్ణం పదాలు బంగారానికి పర్యాయపదాలు. అశోకుడి శాసనంలో హిరణ్య రాష్ట్రమని చెప్పక పోయినప్పటికి హిరణ్య రాష్ట్రానికి సువర్ణగిరి రాజధాని అని నిర్దిష్టంగా అంచనావేయవచ్చు.

ఏడవ శతాబ్దం నాటి రేనాటి చోళరాజు పుణ్యకుమారుని దొమ్మరి నంద్యాల సంస్కృతతామ్రశాసనం లోని ఈ విషయాన్ని గమనించండి ".... శ్రీమాన్పుణ్యకుమారో నామ హిరణ్య రాష్ట్రాధిపతి...."

అదేవిధంగా పుణ్యకుమారునిదే మాలెపాడు సంస్కృత తామ్ర శాసనాన్నీ చూడండి '...... శ్రీమాన్ పుణ్యకుమారా నామనృపతి రభవల్ / అపొ హిరణ్యరాష్ట్ర సహితాన్ స్వరాష్ట్ర నివాసిన స్వర్వాన్ ఇత్థమాజ్ఞాపయతి / ఆత్రేయగోత్రాయ చిరువన హళ కేశవశర్మణే హిరణ్య రాష్ట్రే సుప్రయోగనద్యా దక్షిణ తీరే బీరపాఱు గ్రామ నామః"

ఇందులోని బీరపాఱు గ్రామం నెల్లూరుజిల్లా ఆత్మకూరు సమీపంలోని బిల్లుపాడు గ్రామమని ఈశ్వరదత్తు గారి వివరణ. బీరపాఱు గ్రామానికి దొమ్మరి నంద్యాల ప్రాంతానికి కనీసం 150 కి.మీ. దూరం ఉంటుంది. ఈ ప్రాంతానికంతా పుణ్యకుమారుడే రాజు. ఈ రెండు గ్రామాలు పెన్నానది తీర గ్రామాలే! పై శాసనంలోని సుప్రయోగానది మరేదోకాదు పెన్నానదే! పెన్నానదిని సుప్రయోగగా సంస్కృతీకరించారు. (పేఱేఱుని కృష్ణానదిగా సంస్కృతీకరించారు). పై రెండవ శాసనం ఆధారంగా కొందరు చరిత్రకారులు హిరణ్యరాష్ట్రం అతని రాజ్యంలో భాగంగా ఉండేదని అభిప్రాయ పడినా, స్వరాష్ట్రంగా ఆమోదించడం ఉత్తమం. హిరణ్యరాష్ట్రం పెన్నాపరివాహక ప్రాంతమని అభిప్రాయాన్ని కూడా ఎపిగ్రాఫికి కర్నాటకా లోని 'ఎరిగలవాడి' అనే పూర్వపక్షం చేస్తోంది. హిరణ్య రాష్ట్రంలో పెన్నానది ప్రవహిస్తుందనే అర్థం చేసుకోవాలి తప్ప పెన్నా పరివాహక ప్రాంతం హిరణ్య రాష్ట్రం కాదు.

అశోకుని శాసనకాలం క్రీ.పూ. మూడో శతాబ్దం. పుణ్యకుమారుని కాలం క్రీ.శ. ఏడో శతాబ్దం. బిల్లుపాడు గ్రామానికి అశోకుని శాసనస్థలమైన జొన్నగిరికి కనీసం 320 కి.మీ. దూరం. అదేవిధంగా పావగల సమీపంలోని నిడిగల్లు నుండి బిల్లుపాడు 340 కి.మీ. దూరంలో ఉంటుంది. ఈ మొత్తం ప్రాంతాన్నంతా హిరణ్యక రాష్ట్రమని అశోకుని కాలం నుండీ పుణ్యకుమారుడి వరకు తొమ్మిది శతాబ్దాల పాటు పిలిచారన్నమాట.

ఇదే పుణ్యకుమారుని తెలుగు తిప్పలూరి శిలాశాసనాన్నీ చదవండి "స్వస్తిశ్రీ ఎరికల్ ముత్తురాజు పుణ్యకుమారు - గణ్యమాను - మఱున్ర పిదుకుమదము - దితు - త్తమోత్తము - యినవా చెహ్ లియ పటుకాను రేనాణ్డేళుచు తకపు...."

పై పుణ్యకుమారుని సంస్కృత తెలుగు శాసనాలాధారంగా తెలుగులో వున్న రేనాడు, సంస్కృతంలోని హిరణ్యరాష్ట్రం ఒక్కటేనని స్పష్టమవుతోంది. రేనాడు పదాన్ని హిరణ్య రాష్ట్రంగా సంస్కృతీకరించారు. హిరణ్యరాష్ట్రం, రేనాడులలో ఏది ముందున్నదీ తేల్చడం ఇప్పుడు సాధ్యం కాని పని.

మధ్యయుగంలో కొంతకాలం ఈ ప్రాంతం మార్జవాడ/మర్జవాడ/మహారాజవాడిగా వ్యవహారంలో ఉండేది. మార్జవాడ కూడా ఏడువేలనాడు, కాళహస్తి, చంద్రగిరి, వాయల్పాడు, మదనపల్లి, పరిగి, చింతామణి ప్రాంతాలలో లభించిన శాసనాల ఆధారంగా ఈ ప్రాంతం మహారాజవాడిగా వాడుకలో ఉన్నట్లు ఈశ్వరదత్తు గారు నిరూపించారు. అయినప్పటికి మార్జవాడ ప్రస్తావన కల్గిన శాసనాలు తక్కువ. పైపెచ్చు విజయనగర శాసనాల్లో కూడా రేనాడు ప్రస్తావన ఉంది.

ఎరిగలవాడి, మార్జవాడ పదాల్లో వున్న వాడ/వాడి ఒకే అర్థాన్ని సూచిస్తాయి. ప్రాచీన శాసనాల్లో కనిపించే హారము (ప్రాంతము) నుండి ఈ ప్రాంతాలు రూపొందాయి. హారము > పారము > పాడి > వాడి

**తరువాయి 38 పుటలో..**

బూసి వెంకటస్వామి
7386529274,
పెండ్యాల లావణ్య
7989781963

# తెలుగు గిరిజన మాతృభాషలు - వ్యవహార శైలి

**ఉపోద్ఘాతం :**

గిరిజనులు అడవినే నమ్ముకున్న అడవితల్లి బిడ్డలు. ప్రాచీన ఆచారాలను, సంప్రదాయాలను వీడకుండా కొండల్లో, కోనల్లో అనాగరికంగా జీవిస్తున్న తెగలను ఆదివాసీయులని, కొండ ప్రజలని, గిరిజనులని (ట్రైబల్స్) వ్యవహరిస్తున్నారు. భారతదేశం మొత్తం మీద గిరిజనులు 570 తెగల వాళ్ళున్నారని అంచనా. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 33 తెగల ఆదివాసీయులు జీవిస్తున్నారు. అంధ్, కమ్మరి, కొండదొరలు, ఎరుకలు, కొండరెడ్లు, కొలాములు, కోందులు, కోయలు, గజబ, గోండులు, పోర్జా, తోటీస్, చెంచులు, యానాదులు, జాతవులు, తోడా, నక్కలవాళ్ళు, నాయపోడలు, బగత, భిల్లులు, వాల్మీకి, సవరలు, సుగాలీలు, కోదులు, ములియా (లేదా) కులియా, ప్రధానులు, మాలీలు, మన్నెదొరలు, నూకదొర, ఖెంథో రోనా, కొండకాపు, పొరజులు, రెడ్డి దొర మొత్తం 33 మంది గిరిజన తెగలు ఆంధ్రప్రదేశ్‌లో నివసిస్తున్నారు.

**గిరిజన తెగలు - మాతృభాష - వ్యవహారిక భాష :**

ఆదివాసీయులు ఎన్ని తెగలున్నప్పటికీ ఒకే రకమైన సంస్కృతి సంప్రదాయాలను పాటించరు. ఎవరి పరిధి మేరా వారు ఏర్పాటు చేసుకున్న సంస్కృతి సంప్రదాయాలకు విలువనిస్తారు. సంస్కృతి, సంప్రదాయాలు, ఆచారాలు ఎలా వేరువేరుగా ఆచరించి పాటిస్తారో అదేవిధంగా ఎవరి మాతృభాషల్లో వాళ్ళు వ్యవహరిస్తున్నారు. ఆదివాసీయులు ఎవరి మాతృభాషల్లో వాళ్ళు వ్యవహరిస్తున్నా ఆయా పరిసర ప్రాంతాల్లోని ఇతర భాషల ప్రభావం గిరిజనుల భాషలపై తప్పనిసరిగా పడుతుంది. గిరిజన భాషలు ఒక ప్రాంతంలోని వృక్షజాలం, జంతుజాలం మరియు ఔషధ మొక్కలను గురించే కాక అనేక విజ్ఞానాంశాలను గురించి తెలియజేస్తాయి. కొండ కోనల్లో జీవించే గిరిజనులు ఎన్ని తెగలవాళ్ళు ఉన్నప్పటికీ ఎవరి తెగకు సంబంధించిన ప్రత్యేకమైన మాతృభాషలను కలిగి ఉంటారు. కొన్ని గిరిజన తెగలు మైదాన ప్రాంతానికి అతి సమీపంలో ఉండడం వలన తెలుగు భాషను కూడా తమ మాతృభాషగా వ్యవహరిస్తున్నారు.

ఆదివాసీ తెగల్లో అంథ్ తెగలు మరాఠీ భాషను మాతృభాషగా కలిగి ఉన్నారు. మహారాష్ట్ర ప్రాకృతం నుండి పుట్టిన భాషే మరాఠి. ఆంధ్రప్రదేశ్‌లోని ఏడుకోట్ల భాషా వ్యవహర్తలపై మరాఠి భాష ప్రభావం ఉంది. అంథ్ తెగవాళ్ళు తమ మాతృభాషతోపాటు తెలుగు భాషను కూడా మాట్లాడుతున్నారు.

ఎరుకల తెగవాళ్ళు తమ మాతృభాషలో అధికశాతం తమిళ భాషా పదాన్ని వాడుతున్నారు. వీరి భాషకు లిపిలేదు. మైదానప్రాంతానికి దగ్గరగా ఉండడం చేత తమిళంతోపాటు తెలుగు భాషను కూడా మాతృభాషగా వ్యవహరిస్తున్నారు

కొండదొరలు తమ మాతృభాషలుగా కొండ, కూబి భాషలను మాట్లాడుతున్నారు. ఈ భాషా వ్యవహర్తలు తమ జాతిని'కుబిజ్' అంటారు.(జ్ బహువచన ప్రత్యయం) వీరి భాషను 'కూబి' అని, తెలుగువారు కొండ దొరలని వ్యవహరిస్తున్నారు.

**ద్రావిడ భాషా కుటుంబ గిరిజన భాషలు :**

కొలాము తెగలవారు గోండి భాషకు దగ్గరగా ఉండే ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషలను వ్యవహరిస్తున్నారు. ఆదిలాబాద్‌లోని కొలామి భాషా వ్యవహర్తలు ఉర్దూ, మరాఠీ భాషల్ని మాట్లాడుతున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని కొలాములు తెలుగు భాషను కూడా తమ మాతృభాషలతోపాటు కలిపి వ్యవహరిస్తున్నారు.

కొలాములు వ్యవహరించే భాషా పదాలు : పూజారిని 'దెలక్' అని,గ్రామ పెద్దని 'నాయకన్' అని, బంట్రోతును 'మహాజన్' అని వంటవాడిని 'తర్మక్' అని, ఆహారాన్ని వండించేవాడిని 'గతియ' అని వారి వారి వ్యవహార భాషల్లో ఉచ్చరిస్తుంటారు.

కోందులు తెగ తమ మాతృభాషగా కువి భాషను మాట్లాడుతున్నారు. కువి భాషకు లిపి లేదు. కువి భాషలోని పదాల విస్తృతి చాలా తక్కువగా ఉంటుంది. మిగిలిన అన్ని భాషలకంటే తక్కువ పదాలతో విషయాన్ని పరిమితమైన భాషతో సమన్వయించుకోవడం కనిపిస్తుంది. కువి భాషలో అధికశాతం తెలుగు పదాలు ఉచ్చరిస్తుంటారు.

కోయ తెగలు ద్రావిడ భాషలకి చెందిన కుయి భాషను వ్యవహరిస్తున్నారు. అలాగే తెలుగు భాషను కూడా మాట్లాడుతున్నారు. కోయ భాషకు లిపిలేదు. కోయ పదాలు తెలుగు లిపిలో కనిపిస్తాయి. కోయ కథలు, కోయ బైబిలు, కోయ పొడుపు కథలు మొదలగునవి వెలువడ్డాయి.

గోండు తెగలు ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన 'కోయజ్' భాషను మాతృభాషగా వ్యవహరిస్తున్నారు. గోండు భాషకు లిపి లేదు. గోండుల భాషా పదాలు : పాడి = ఇంటి పేరు, సారి = రొట్టె, చాకోట్ = క్షేమం, కాండి = కొడుకు, పేడి= కూతురు.

చెంచు తెగలు తెలుగుభాషనే తమ మాతృభాషగా వ్యవహరిస్తున్నారు. అయితే వీరి తెలుగు భాషలో తమిళ పదాలు కనిపిస్తాయి. చెంచు భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది.

**ముండా భాషా కుటుంబానికి చెందిన గిరిజన భాషలు :**

జాతపు తెగలు 'కుయ్' భాషను మాతృభాషగా వ్యవహరిస్తున్నారు. జాతపులు, సవరలతో కలిసి సహజీవనం చేస్తున్నారు. సవర తెగలు ముండా భాషను మాట్లాడుతున్నారు. సవర భాషకు అంతకుముందు లిపి లేదు. గిడుగు రామ్మూర్తి పంతులు గారి కృషి ఫలితంగా సవర భాషకు లిపితోపాటు వ్యాకరణ, నిఘంటువులు రూపొందించబడ్డాయి.

సవర భాషలో కొన్ని భాషా పదాలు : సవర భాషలో గ్రామాన్ని 'గోర్ఘాం' అని, మంత్రగాళ్ళను గొరవలని వ్యవహరిస్తున్నారు.

'తోడా'గా తెగల వాళ్ళు తమ మాతృభాషను 'తోడగా' వ్యవహరిస్తున్నారు. దీనికి లిపి లేదు.'తోడా' భాషకి తమిళభాషకి సన్నిహిత సంబంధముంది. నక్కలతెగ తెలుగు భాషతోపాటు తమిళం, కన్నడ భాషా పదాలను కలిపి వ్యవహరిస్తున్నారు. నాయక్‌పోడ్ తెగలు మాతృభాషగా తెలుగు భాషతోపాటు కొలామె భాషను కూడా వ్యవహరిస్తున్నారు.

భిల్లులు తెగ వీరి మాతృభాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది. వీరు వీరి భాషను భిల్లీ భాషగా వ్యవహరిస్తున్నారు. భిల్లీ భాషలో ముండాలి, ద్రవిడ పదాలున్నాయి.

వాల్మీకి తెగలు'కుపియా'భాషను మాతృభాషగా వ్యవహరిస్తున్నారు. లిపి లేని భాషల్లాగానే వాల్మీకి భాషకు లిపిలేదు.వాల్మీకి భాషకు 54 అక్షరాలతో లిపిని రూపొందించారు.

**ఇండో ఆర్యన్ కుటుంబానికి చెందిన గిరిజన భాషలు :**

లంబాడీలనే బంజారా, లమాని, లంబాని, సుగాలి, గోర్మతి, గోరబోలి అనే పేర్లతో వ్యవహరిస్తుంటారు. లంబాడీ భాషలు ఇండో ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినవి. వీరి భాషకు లిపిలేదు. తెలుగు, హిందీ, రాజస్థానీ భాషల్ని సుగాలి భాషతో కలిపి వ్యవహరిస్తున్నారు.

**ఆదివాసీల నక్షత్ర రాశులు - భాషా పదాలు :**

ఆదివాసీయులు ఎన్ని తెగలున్నప్పటికీ వారి మాతృభాషల్లోనే వ్యవహరిస్తున్నారు. నాగరికులు తెగలు రాశులు - నక్షత్రాలను బట్టి శుభాశుభకార్యాలను నిర్లయిస్తారో ఆదివాసీయులు కూడా వారి మాతృభాషల్లోని రాశులు - నక్షత్రాల ప్రకారం నిర్ణయించుకుంటారు.

**తెలుగు వారి నక్షత్ర రాశులు - 27**

| | |
|---|---|
| 1.అశ్విని | 2.భరణి |
| 3.కృత్తిక | 4.రోహిణి |
| 5.మృగశిర | 6.ఆరుద్ర |
| 7.పునర్వసు | 8.పుష్యమి |
| 9.ఆశేష | 10.మఖ |
| 11.పూర్వఫల్గుణి | 12.ఉత్తర |
| 13.హస్త | 14.చిత్త |
| 15.స్వాతి | 16.విశాఖ |
| 17.అనురాధ | 18.జ్యేష్ఠ |
| 19.మూల | 20.పూర్వాషాడ |
| 21.ఉత్తరాషాడ | 22.శ్రవణము |
| 23. ధనిష్ట | 24.శతాభిష |
| 25.పూర్వాభద్ర | 26. ఉత్తర |
| 27.రేవతి | |

**ఆదివాసీయుల నక్షత్ర రాశులు - 33**

| | |
|---|---|
| 1.కుంబిస్త | 2.రేవస్త |
| 3.ఎనక | 4.ఎనగ |
| 5.ఆసడ | 6.పాటి |
| 7.బిరిన | 8.కెర్త |
| 9.రోహిని | 10.దాగరక |
| 11.ఏర్క | 12.కోడ్రు |
| 13.గొమ్ము | 14.వట్టి |
| 15.కుప్పి | 16.మగ |
| 17.పొరిగ | 18.తూన్‌గ |
| 19.తోక | 20.సబ్ధు |
| 21.సిత్త | 22.సాతి |
| 23.అస్తి | 24.కొత్త |
| 25.జట్టి | 26.మూలగ |
| 27.గండగ | 28.పడువు |
| 29.పొల్టింగ | 30.గులకాసిక |
| 31.ఆలగ | 32.తొడ్డిగ |
| 33.ఏకుంబిస్త | |

నగర వాసులు నక్షత్ర రాశులను శుభాశుభకార్యాలలో వాడుకుంటున్నారో ఆదివాసీయులు కూడా తమ మాతృభాషలో ఉన్న 33 నక్షత్ర రాశులను విరివిగా ఉపయోగించుకుంటున్నారు. ఆదివాసీయులు ముఖ్యమైన పండుగలు, జాతర్లకు శుభముహూర్తాలు నక్షత్ర రాశుల ఆధారంగా పురోహితుడు నిర్ణయిస్తాడు. పురోహితుడిని ఆదివాసీయులు 'దీసరోడు'గా వ్యహరిస్తారు. వీరు విత్తనాలు చల్లాలన్నా, ఇల్లు కట్టాలన్నా, పోడు కొట్టాలన్నా, పెళ్ళి చేయాలన్నా 'దీసరోడే' మంచిరోజును నిర్ణయిస్తాడు. చనిపోయిన వాళ్ళకి ఏ రోజు కర్మకాండ చేయాలో, పుట్టిన బిడ్డ నక్షత్రబలం ఎలాంటిదో నక్షత్ర గమనాల ఆధారంగా మార్గదర్శకంగా చెపుతాడు. ఆదివాసీయులు మొత్తం 33 నక్షత్ర రాశులను తమదైన లిపిలో ఉపయోగిస్తున్నారు. వీళ్ళు హైందవ మత సిద్ధాంతం ప్రకారమే నడుచుకుంటారు. పండుగ చేయాలన్నా జాతర చేయాలన్నా తిధి,వారం, నక్షత్రాల ప్రకారమే చేసుకుంటారు.

| తెలుగు వారి వారాల పేర్లు | ఆదివాసీయుల ఉచ్చారాలో వారాల పేర్లు |
|---|---|
| 1.ఆదివారం | 1.ఆది అర |
| 2.సోమవారం | 2.సొంబారి |
| 3.మంగళవారం | 3.మంగలార |
| 4.బుధవారం | 4.బుధవార |
| 5.గురువారం | 5.లక్కిన్‌వార |
| 6.శుక్రవారం | 6.సుక్లోర |
| 7.శనివారం | 7.శని అర |

| ఆడబిడ్డ పుడితే పెట్టేపేరు | మగబిడ్డ పుడితే పెట్టే పేరు |
|---|---|
| 1.అడ్డి | 1.అడ్డాయి |
| 2.సొంబరి | 2.సొంబర |
| 3.మంగడి | 3.మంగడ |
| 4.బుధి | 4.బుధ |
| 5.లక్కి | 5.లకియ |
| 6.సుక్కి | 6.సుక్కు |
| 7.సందరి | 7.శనియ, సందడి |

మన తెలుగు వారాల లాగానే ఆదివాసీయులు కూడా వారి భాషలో వారాలను అనుసరిస్తారు. ఏరోజు బిడ్డ పుడితే ఆ వారం

రోజు పేరునే పుట్టిన పిల్లలకి పెట్టుకుంటారు. అమావాస్య రోజు మగబిడ్డ పుడితే 'మాసా' అని ఆడబిడ్డ పుడితే 'నాసలి' అని పేర్లు పెట్టుకుంటారు.

ఆదివాసీయులు స్వర్గానికి, నరకానికి, భూలోకానికి తమ వ్యవహార భాషల్లోనే వ్యవహరిస్తారు. వీరు స్వర్గాన్ని 'రువాంగ్' అని, భూలోకాన్ని 'లబో' అని,పాతాళలోకాన్ని'కింబోరై' అని వ్యవహరిస్తున్నారు.

1.రువాంగ్: ఆకాశలోకం స్వర్గలోకం. ఇక్కడ దేవుళ్ళు, దేవతలుంటారని నమ్ముతారు.

2.లబో: భూలోకం మనుష్యులుండే లోకం.'లబో' అంటే 'భూమి' అని అర్థం. అలాగే 'మట్టి' అని కూడా వ్యవహరిస్తారు.

3. కింబోరై :పాతాళలోకం భూమి కింద ఉండే లోకాన్ని పాతాళలోకం అంటారు. చనిపోయిన వాళ్ళంతా పాతాళ లోకంలోఉంటారని నమ్ముతారు.

మనం సూర్యచంద్రుల్ని పురుష దేవతలుగా ఆరాధిస్తాము. అయితే ఆదివాసీయులు సూర్యచంద్రుల్ని స్త్రీమూర్తులుగా ఆరాధిస్తారు. వీరు సూర్యుడిని 'ఉయ్యుం' గాను, చంద్రుడిని 'అంగాయ్' గాను, తారలను 'తుయ్‌త్తుయ్' గాను వ్యవహరిస్తారు. చంద్రమ్మ బిడ్డలే నక్షత్రాలని భావిస్తారు. ఆదివాసీయుల భాషల్లో సూర్యగ్రహణాన్ని 'మోయుం' అని, చంద్రగ్రహణాన్ని 'మోగై' అని వ్యవహరిస్తారు. తోకచుక్కను'అలాతుయ్' గాను, ఉల్కాపాతాన్ని 'ఆసొక్తి' గాను,వర్షాన్ని'గనూర్' గాను, ఇంద్రధనుస్సును'ఇడిరబోయ్' గాను, దెయ్యాల్ని 'కుల్బ' పేతరాలుగా వ్యవహరిస్తారు.

ఆదివాసీయుల సామెతలు :

మన తెలుగు వ్యవహారంలో ఉన్న సామెతలు, పొడుపు కథలు, జాతీయాలు ఆదివాసీయుల మాతృభాషల్లో కూడా ఉన్నాయి. సందర్భానికి తగినట్టుగా వీరు ఆయా సామెతల్ని, పొడుపు కథలు, జాతీయాల్ని ప్రయోగిస్తారు.

ఆదివాసీయుల భాషల్లోని సామెతలు :

1. కాణిన కొచ్చొదినేతో పిపిన్ పేట్ ఫోళ్ళాది
   (గుడ్డిదానికి కంచు పళ్లెమిస్తే, కడుపు పగిలిపోయే వరకు తాగిందట)
2. బాటీ తూటన్ ఘీయ్‌మాపడీ
   (రొట్టె విరిగి నేతిలో పడ్డట్టు)
3. భరీహాండీ చళ్కేని
   (నిండు కుండ తొణకదు)
4. కొత్రా బస్సూజ్కర, హాతీ చల్లోజ్జా
   (ఏనుగు రోడ్డు మీద పోతుంటే కుక్కలు మొరిగినట్టు)

ఆదివాసీల పొడుపు కథలు :

పొడుపు కథలన్నీ కూడా ఆదివాసీయులు తమ దైనందిన జీవితంలో ఆటవిడుపుగా ప్రయోగిస్తారు.

1. నరాల వాడు సంతకెళితే పోరాలవాడు ఇంటికి వస్తాడు – ఉల్లిపాయ
2. కోకంతా కాలిన కోకంచు కాలదు – దారి
3. పండు పండుకు పన్నెండు తొనలు, తొనకు ముప్పై పిక్కెలు – సంవత్సరం, నెల, రోజులు.
4. ఎండు మానుమీద పచ్చి మాను పడ్డది – మంచంపై మనిషి పడుకోవడం

ఆదివాసీయుల జాతీయాలు :

సామెతలు, పొడుపు కథల్లానే జాతీయాలను ఆదివాసీయులు ప్రయోగిస్తారు.

1. అగ్గసగ్గ – చవకగా
2. అరిగోసు – ఇబ్బందులు పడటం
3. చిలుంవదులు – ఖర్చు చేయించడం
4. డెమాబుస్క్ – పనికిరాని
5. రెక్కపట్టు – పెళ్ళి చేసుకొను

ఈ విధంగా ఆదివాసీయులు వారివారి మాతృభాషల్లో జాతీయాలు, సామెతలు, పొడుపు కథల్ని ప్రయోగిస్తున్నారు. నిత్యవ్యవహారంలో వారు విరివిగా తమ మాతృభాషా మాధుర్యాన్ని అనుభవిస్తూ వ్యవహరికంలో తెలుగు భాషను పరిపుష్టం చేస్తున్నారు.

ముగింపు :

ఆంధ్రప్రదేశ్‌లో నివసించే గిరిజన తెగలు తెలుగుభాషనే వ్యవహరిస్తున్నారు. గిరిజన భాషల్లో లిపి ఇంకా అభివృద్ధి చెందలేదు. ప్రభుత్వాలు చొరవ తీసుకుని గిరిజన భాషలను ప్రోత్సహించాల్సిన అవసరం ఉంది. గిరిజన సాహిత్యం, విజ్ఞానంపై పరిశోధనలు జరిగినంతగా భాషలపై పరిశోధన జరగలేదు. అల్ప సంఖ్యాక వర్గానికి చెందిన గిరిజనులు మాట్లాడే భాషలు కాలక్రమంలో కనుమరుగయ్యే ప్రమాదం ఉంది. భాష కనుమరుగయితే ఆ జాతిసంస్కృతి కూడా కనుమరుగవుతుంది. అందుకే గిరిజనుల భాషలను కాపాడుకోవాల్సిన ఆవశ్యకత నేడు ఎంతైనా ఉందని చెప్పవచ్చు. ప్రభుత్వంతోపాటు, స్వచ్ఛంద సంస్థలు, వివిధ వర్గాల వారు చొరవ తీసుకుని గిరిజన భాషలను పరిరక్షించాలి. ముఖ్యంగా ప్రాథమిక విద్యాస్థాయిలో వారి మాతృభాషలో బోధించేందుకు ప్రయత్నాలు జరగాలి. వారి నిత్య వ్యవహారంలో ఉన్న పదజాలాన్ని తెలుగుభాష మాధ్యమంలోనైనా తెలియజేసే విధంగా పాఠ్యాంశ రూపకల్పన జరగాలి. కొండ కోనల్లో నివసిస్తున్న గిరిజనులలో ఒకవైపు చైతన్యం తీసుకువస్తూనే వారి మాతృభాషను కాపాడవలసిన బాధ్యత ప్రతి ఒక్కరిపై ఉంది. అందుకు అందరూ తమ వంతుగా కృషి చేస్తారని ఎవరి మాతృభాషను వారు కాపాడుకుంటూనే ఎదుట వారి మాతృభాషను గౌరవిస్తారని ఆశిద్దాం.

ఆధార గ్రంథాలు :


1. నదీం హసైన్, భారతీయ గిరిజనులు, ఓరియంటల్ లాంగ్మన్ లిమిటెడ్, హైదరాబాద్, 1995.
2. డా. యం. సూర్యనారాయణ, భారతదేశము – గిరిజన సముదాయాలు, తెలుగు అకాడమీ, హైదరాబాద్, 2005.
3. గోనా నాయక్, యం. గిరిజన పొడుపు కథల విశిష్టత, వాజ్మ తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 2002, అక్టోబర్.
4. వెంకటరావు టి, సవరల జీవన సరళి.
5. డా. జర్రా అప్పారావు, విశాఖపట్టణం జిల్లా గిరిజన విజ్ఞానం/ ఒక పరిశీలన.



రచయితలు సహాయ ఆచార్యులు, తెలుగుశాఖ,
ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం


వాడని భాష వాడిపోతుంది. వాడినకొద్దీ వికసిస్తుంది

టి.వి.రామకృష్ణ
9951441131

# బాలసాహిత్యం - గేయాలు

కథలు, నాటికలు లాగే గేయాలు కూడా బాలసాహిత్యంలో ప్రముఖపాత్ర వహిస్తాయి. ఆంగ్లంలో మనం చెప్పుకునే 'నర్సరీ రైమ్స్', 'మదర్ గూస్ రైమ్స్' నే మనం 'బాలగేయాలు' అంటాము. అయితే ఇక్కడ మనం బాలాగేయాలకు సరైన నిర్వచనం చెప్పుకోవాలి.




ఎందుకంటే, మన తెలుగు బాలసాహిత్యంలో గేయాలు అంటే పెద్దలు పిల్లల మీద రాసిన కవితలు, పిల్లలను ఓదార్చడానికి అమ్మ పాడే లాలి పాటలు, పెళ్ళిళ్ళు, పండగలు, ఇంకా అనేక సందర్భాలలో పాడుకొనే పాటలు, ఎగతాళి పాటలు, శతక పద్యాలు లాంటి అనేక ప్రక్రియలను బాలగేయాల క్రింద జమ కట్టేశారు. ఇవన్నీ బాలగేయాల నిర్వచనం ప్రకారం బాలగేయాల క్రిందకు రావు. ఇవి పిల్లలకోసం రాసిన గేయాలు కావు.

ఇప్పుడు బాలాగేయాలకు సరైన నిర్వచనాన్ని పరిశీలిద్దాం!

'సరళమైన భాషతో, తేలిక పదాలతో, ప్రాస, లయతో ఉండి భావ యుక్తంగా పిల్లలు తేలికగా పాడగలిగేవి లేదా చెప్పగలిగేవి'

'అలతి, అలతి మాటలతోపిల్లలకు వినోదాన్ని, ఆనందాన్ని, విజ్ఞానాన్ని పంచే చిన్న, చిన్నపదాలు, వాక్యాలతో భావయుక్తంగా పిల్లలు పాడుకోగలిగినవి.'

'ఆనందంతో, అభినయంతో, పిల్లలు ఆస్వాదించ గలిగే చిన్న, చిన్న గేయాలను బాలాగేయాలు అని చెప్పవచ్చు'

గేయాలు సాధారణంగా 0-10 సంవత్సరాల పిల్లలను ఉద్దేశించబడినవి. ఈ వయసు పిల్లలు నేర్చుకొనే క్రమంలో ఉంటారు. కొత్త ప్రక్రియను దేన్నైనా నేర్చుకోవడానికి ప్రయత్నిస్తారు, ఆస్వాదిస్తారు. ముఖ్యంగా లయ బద్ధంగా ఉండే పదాలను, పాటలను, గేయాలను అమితంగా ఇష్టపడతారు, వాటిని విని ఆనందిస్తారు. ఈ వయసు పిల్లలకు ఆట, పాటలతో కూడిన విద్య అవసరం. కాబట్టి గేయాలు అభినయంతో, లయ, ప్రాసతో కూడినవిగా ఉండాలి. ఇలా అభినయంతో లయబద్ధంగా గేయాలను పాడినప్పుడు పిల్లలు వాటిని బాగా ఆస్వాదిస్తారు, ఆనందిస్తారు, వాటిని మరలా, మరలా పాడటానికి ఇష్టపడతారు. ఇంకా ఈ వయసు పిల్లలు భాషను నేర్చుకొనే క్రమంలో ఉంటారు. కాబట్టి ప్రాథమిక స్థాయిలో కథలతో పాటు గేయాలను తప్పక పిల్లలకు పరిచయం చేయాల్సిన అవసరం ఉంది. అయితే దురదృష్టం ఏమిటంటే మన బళ్లలో ఆంగ్ల గేయాలకే అధిక ప్రాధాన్యత ఇస్తారు. అవికూడా పిల్లలు ఆనందించే విధంగా చెప్పరు. అదికూడా ఒక మొక్కుబడి వ్యవహారంగా ఉంటుంది. ఆంగ్లంలో గాని, తెలుగులో గాని, హిందీలో గాని, గేయాలు భాషను పట్టించడంలో ప్రథమ పాత్రను పోషిస్తాయి. అయితే బడి వాతావరణంలో మనకు అలాంటి దాఖలాలు ఎక్కడా కనిపించవు. గేయాలు చెప్పడం ఒక ప్రహసనంగా, మొక్కుబడి వ్యవహారంగా కొనసాగుతుంది. **ఇంకొక విషయం ఏమిటంటే ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు తెలుగు బాల గేయాలను చెప్పడానికి నామోషిగా భావిస్తారు.**

బాలగేయాల చరిత్రను గమనించినట్లైతే, ఆంగ్లంలో 18 వ శతాబ్దం లో మొదలైనట్లు తెలుస్తోంది. పాతతరం ఆంగ్ల గేయాలన్నీ బ్రిటిష్ వారి హాయాంలో మన నెత్తిన రుద్దబడ్డాయి. అవన్నీ ఆ సమయంలో వివిధ సంఘటనల ఆధారంగా బ్రిటన్లో రచించినవి. ప్రత్యేకంగా పిల్లలకోసం రాసినవుకావు. 'బాబా బ్లాక్ షీప్, హావ్ యు ఎని వూల్?' అనే రైమ్ బ్రిటన్‌లో ఆ కాలంలో ఉన్ని మీద ఎక్కువ సుంకం విధించారు. అది రాజుకు, చర్చికి, రైతుకు పోగా, గొర్రెలను కాచుకొనే పిల్లవాడికి ఏమి మిగలదు అని చెప్తూ రాసిన గేయం. అది మన పిల్లలకు ఎలా అన్వయిస్తుందో ఎవ్వరికీ అర్థం కాదు. అలాగే 'లండన్ బ్రిడ్జ్ ఫాలింగ్ డౌన్, ఫాలింగ్ డౌన్.' గేయం కూడా చెక్కతో కట్టిన లండన్ వంతెన కూలిపోయిన సందర్భంలో రాసిన గేయం. ఇలాంటి మనకు ఎటువంటి సంబంధం లేని అనేక ఆంగ్ల గేయాలను ఇప్పటికీ మన ఆంగ్ల మాధ్యమ పాఠశాలల్లో కొనసాగు తున్నాయి. ఇంకా ఘోరమైన ఇంకొక గేయం 'రింగా రింగా రోసెస్, పాకెట్ ఫుల్ ఆఫ్ పొసెస్,...' అనే గేయం లండన్ లో ప్లేగు వ్యాధి సంభవించినపుడు రాసింది. ఇంకా అలాంటి ఆంగ్ల గేయాలను ఇప్పటికీ మన పాఠశాలలలో వల్లె వేయిస్తున్నారు. బ్రిటిషువాడు వదలి పోయిన చెత్తను ఇప్పటికీ వదలించుకోలేక ఉన్నామని చెప్పడానికి ఇది ఒక మంచి ఉదాహరణ.




ఇక మన తెలుగు బాల గేయాల విషయానికి వస్తే, పాతతరంలో ప్రత్యేకంగా పిల్లలకోసం రాసినా బాల గేయాలు అసలు లేవు. ఎందుకంటే సంస్కృత ప్రభావం, వ్యాకరణ ప్రభావం, గ్రాంథిక రచన ప్రభావం ఎక్కువగా ఉణ్ణింది. అందువల్ల బాలగేయాలకు అంత ప్రాధాన్యత ఇవ్వలేదు. చందోబద్ధమైన పద్య కావ్యాలకే అధిక ప్రాధాన్యత ఇచ్చారు.

అయితే జనభాషలో అనేక జానపద పాటలు, లాలి పాటలు

మౌఖికంగా ఒక తరంనుంచి ఇంకొక తరానికి చలామణి అయ్యాయి. చిన్న పిల్లలను లాలిస్తూ పిల్లవాడిని బుజ్జగించడానికి, నిద్రపుచ్చడానికి ప్రాంతాల వారీగా అనేక పాటలు చలామణి అయ్యాయి. ఇప్పటికీ అవి కొన్ని చలామణి అవుతున్నాయి. ఇవి తల్లులు పిల్లల కోసం పాడే పాటలు. ఇవి బాలాగేయాలు కావు. 'జోఅచ్యుతానంద జో జో ముకుందా..' లాంటి పాటలు ఈ కోవకు చెందినవి.

'చందమామ రావే, జాబిల్లి రావే..' - 'తారంగం, తారంగం ..' లాంటి గేయాలు చిన్న పిల్లలను సముదాయించడానికి తల్లులు, నానమ్మలు పాడే పాటలు. ఇవి కూడా బాల గేయాల నిర్వచనం ప్రకారం బాల గేయాల క్రిందకు రావు.

అలాగే అనేక సందర్భాలలో పాడుకునే ఎగతాళి గేయాలను కూడా బాల గేయాల క్రిందకు చేర్చారు. అవి కూడా బాల గేయాలకిందకు రావు. పిల్లలను, పెద్దలను కించపరిచే విధంగా కొన్ని గేయాలు ఉన్నాయి. వాటిని కూడా బాల గేయాల జాబితా నుంచి తీసివేయాలి.

అలాగే పిల్లలను పొగుడుతూ, పిల్లలను వర్ణిస్తూ రాసిన అనేక పాటలను, కవిత్వాన్ని బాల గేయాల క్రింద చేర్చారు. ఇప్పటికీ అనేక మంది రచయితలు పిల్లలను వర్ణిస్తూ, పొగుడుతూ రాసే కవిత్వాలను బాలగేయాల పేరుతో రాస్తున్నారు.

శతకాలు, మకుట పద్యాలు పిల్లలకోసం రాసినవి కావు. అప్పటి కాలంలో ప్రజలను చైతన్య పరచడానికి, నీతి బోధించడానికి పెద్దలకోసం రాసినవి. వేమన శతకం, సుమతి శతకం ఈ కోవకు చెందినవే! అలాగే కృష్ణ శతకం, దాశరథి శతకం భక్తిని ప్రబోధించడానికి రాసిన శతకాలు. ఇంకా అనేకమంది రచయితలు అనేక శతకాలు రాశారు. అవన్నీ పిల్లలను ఉద్దేశించి రాసినవి కాదు. అయితే వేమన శతకం, సుమతి శతకాలలో భాష సరళంగాను, వాడుక భాష లోనూ, శృతి, లయలతో ఉంటాయి. ఇవి కొంచెం బాలగేయాల నిర్వచనానికి దగ్గరగా ఉంటాయి. భాషను పట్టించే క్రమంలో వీటిని ఉపయోగించుకోవచ్చు.

నలభైవ దశకంలో తెలుగు బాల గేయాలకు ఒక రూపు వచ్చినట్లు మనకు తెలుస్తోంది. ఆ కాలం లోనే అనేక పిల్లల పత్రికలు వెలువడ్డాయి. అనేక మంది పెద్ద రచయితలు బాల గేయాలను సృజించారు. ఎవరు రాశారో తెలియని అనేక బాల గేయాలు ఇప్పటికీ చలామణి అవుతున్నాయి. దాదాపు 40-50 పాత తరం గేయాలు అందుబాటులో ఉన్నాయి. అయితే తెలుగు బాలగేయాల మీద కసరత్తు చేసిన రచయితలు చలా తక్కువ మందే ఉన్నారు. కొంతమంది పాత తరం కవులు బాలగేయాలను సృజించారు. వాటిలో కొన్నింటిని ఇప్పుడు పరిశీలిద్దాం!

**గురజాడ** గారికి బాల గేయాల మీద ఎంత అవగాహన ఉందో ఈ క్రింది చిన్న గేయాన్ని చూసినప్పుడు మనకు అర్ధం అవుతుంది.

'అరటికాయ బజ్జి,
మినపప్పు సొజ్జి,
కలసి మెలసి తిందాం!
కథలు, వెతలు విందాం!'

అలాగే **దేవులపల్లి కృష్ణ శాస్త్రి గారు** రాసిన ఈ బాల గేయాన్ని పరిశీలిద్దాం!

'హుత్ ఉడుతా, హూత్ ఉడుతా, ఊరికి వెడతావా? - సీత
థాత్ సీత ! థూత్ సీత! తప్పక వెళతాను! - ఉడుత
బండి లేదు, బస్సు లేదు, ఎలాగ వెళతావు? - సీత
తొండ గుర్రం బండికి కట్టి తోలుకు వస్తాను - ఉడుత
బండి మీద బైఠాయించి ఎక్కడికి వెళతావు? - సీత
ఢిల్లీ వెళతా, కాశీ వెళతా,
బొంబాయి వెడతా, కలకత్తా చూస్తా,
సాయంత్రానికి చెన్నాపట్నం చెంగున వస్తాను!' - ఉడుత
(కొద్ది మార్పులతో)

అలాగే **అనపర్తి సీతారామంజనేయులు గారు** రాసిన ఈ బాల గేయం ఒకసారి పరిశీలిద్దాం!

జామచెట్టు కొమ్మ మీద రామ చిలుకా,
కొంటె కిష్టి దాన్ని చూచి వెక్కిరించే,
మట్టి గడ్డ దాని పైకి విసిరికొట్టే!
కోపగించి రామచిలుక రామ్, రామ్, రామ్,
జామకాయ విసిరికొట్టే జామ్,జామ్,జామ్!
కిట్టి గాడి నెత్తిమీద ధాం, ధాం, ధాం!

**చింతల పాటి చిట్టిబాబు గారు** రాసిన ఈ బాల గేయాన్ని కూడా ఒకసారి పరిశీలిద్దాం!

'గోడమీద సింహం, చూస్తేనే భయం, భయం,
ఉరిమి ఉరిమి చూస్తుంది, వణుకు పుట్టుకొస్తుంది,
కదలదేమి సింహం, మెదలదేమి సింహం,
కోపమణిగి పోయానా? నిద్రలోకి జారెనా?
గోడమీద సింహం నిజం సింహం కాదురా,
గోడమీద సింహం వట్టి రాతి బొమ్మరా!'

పై మూడు గేయాలను పరిశీలించినపుడు పిల్లల మనో భావాలకు అనుగుణంగా ఎంత చక్కగా రాశారో అనిపిస్తుంది. పిల్లలు హాస్యాన్ని అమితంగా ఇష్టపడతారు. ప్రాస, లయ, పిల్లలను భావా వేశాలకు అనుగుణంగా పద ప్రయోగాలు గమనిస్తాం. బాలగేయాలకు సరైన నిర్వచనాన్ని కల్పించేవిగా ఈ మూడు గేయాలను చెప్పుకోవచ్చు.

పిల్లలతో మమేకమై, అడి, పాడి బాలగేయాలను సృజించారు **జైసీతారామ్ గారు.** ఆయన సృజించని అంశం అంటూ లేదు. తెలుగులో పిల్లల మనోభావాలకు అనుగుణంగా అలతి, అలతి మాటలతో ఎన్నో అద్భుత మైన బాలగేయాలను అందించిన ఏకైక వ్యక్తి జై సీతారామ్ గారంటే అతిశయోక్తి కాదు. ఆయన రాసిన కొన్ని బాలగేయాలను ఇప్పుడు పరిశీలిద్దాం!

'**అద్దంలో** ఎవరమ్మ? ముద్దుమొహం బొమ్మ!
నేనెట్ల దువ్వితే, తానట్ల దువ్వు
నేనెట్ల నవ్వితే, తానట్ల నవ్వు!'
ఎంత, ఎంత ఎండ? ఎత్తు ఎత్తు గొడుగు,
ఎంత, ఎంత వాన? ఎత్తు ఎత్తు గొడుగు,
ఎంత, ఎంత గాలి? ముడుచు ముడుచు గొడుగు!
ఈగ, ఈగ వెళ్ళిపో, ఇల్లు విడిచి వెళ్ళిపో,
సుబ్బరంగా నువ్వుంటే చెప్పకుండ వెళుతా!

**దోమా,** దోమా వెళ్ళిపో, దూరంగా వెళ్ళిపో,
మురుగు నీరు లేకుంటే చెప్పకుండా వెళుతా!
తప్పిట కొడితే టం,టం,టం,
ఢంకా వాయిస్తే ఢం, ఢం, ఢం,
మద్దెల వాయిస్తే ఝుం, ఝుం, ఝుం,
శంఖం ఊదితె భం, భం, భం!
**కాకమ్మ** నలుపు, కారు మబ్బు నలుపు,
కోడిగుడ్డు తెలుపు, కొంగమ్మ తెలుపు,
చిలకమ్మా పచ్చన, చెట్లన్నీ పచ్చన,
పండు నిమ్మ పసుపు, బంగారం పసుపు!

ఇలా పాత తరం గేయాలైన 'చిట్టి చిలకమ్మా, అమ్మా కొట్టిందా?' చికు చికు రైలు వస్తోంది, దూరం దూరం జరగండి,' - లాంటి గేయాలను, జై సీతారాం గేయాలను, ఇంకా కొన్ని ఎంపిక చేసుకోన్న గేయాలను లెక్క గడితే మనకు 200 గేయాలకు మించి ఉండవు. బాల గేయాలకు ఎంత కరువో ఉందో మనం ఒకసారి ఆలోచించుకోవాలి. **బాలగేయాలు తక్కువ సంఖ్యలో ఉండటం ఒకటైతే, అసలు తెలుగు బాల గేయాలను బళ్లలో పరిచయం చేయక పోవడం ఇంకొక దౌర్భాగ్యం. పిల్లలకు ఇష్టమైన విషయం, పిల్లలు ఆనందించే విషయం, అలాగే భాష నేర్చుకోవడానికి దోహదపడే బాల గేయాలను విస్మరించటం నిజంగా శోచనీయం.**

ఉడత భక్తిగా నేను కూడా 'బుడుగో.. బుడుగో..' పేరుతో కొన్ని బాల గేయాలను రాశాను. వాటిలో కొన్నిటిని ఇక్కడ పరిచయం చేస్తాను.

**'చెట్టు** మీద వాన, గట్టు మీద వాన,
ఇంటి పైన వాన, ఇంటి బైట వాన,
రోడ్డు మీద వాన, గొడుగు పైన వాన,
నా మీద లేదంట, ఎందుకంట?'
టప్.. టప్.. టప్.......!
**'నా** పేరు ఉర్లగడ్డ, నేనేమో దుంపకూర!
నా పేరు బెండకాయ, నేనేమో కాయగూర!
నాపేరు తోటకూర, నేనేమో ఆకుకూర!'
**అమ్మ** చేతి వంట, నాకెంతో ఇష్టమంట,
నాకేమో ఆకలంట, బడేమో వదలరంట,
అమ్మ గోరు ముద్దలు, నాకేనంట,
గంట కొట్టినాక, నేబోయి తింట!
**ఎండాకాలం** వచ్చింది, బుడుగో.. .. బుడుగో.. .. !
ఎండల్ని తెచ్చింది ఉడుకో.. .. ఉడుకో.. .. !
వానాకాలం వచ్చింది, బుడుగో.. .. బుడుగో.. .. !
వానల్ని తెచ్చింది, గొడుగో.. .. గొడుగో.. .. !
చలికాలం వచ్చింది, బుడుగో.. బుడుగో.. .. !
చల్ల గాలులు తెచ్చింది, వణుకో.. ....వణుకో.. ....!

వందల సంఖ్యలో ఉన్న ఆంగ్ల బాల గేయాలతో పోలిస్తే, తెలుగు బాలగేయాల సంఖ్య చాలా తక్కువ. హిందీలో కూడా బాల గేయాల మీద విస్తృత ప్రయోగాలు జరిగాయి. మన తెలుగు బాలగేయాల మీద విస్తృత చర్చలు జరగాల్సి ఉంది. బాల గేయాలను విరివిగా రాయాల్సి ఉంది. బాల గేయాలను ఏరి, కూర్చి సంకలనాలు ప్రచురించాల్సిన అవసరం ఉంది. అలాగే పిల్లలు పాడుకొనే విధంగా జానపద గీతాలు, జాతీయ గీతాలను సంకలం చేయాల్సిన అవసరం ఉంది. ప్రాథమిక స్థాయిలో ఖచ్చితంగా బాల గేయాలను పరిచయం చేసే విధంగా విద్యా ప్రణాళికలు రూపొందించాలి. కథలు, గేయాలు, నాటికలు పిల్లలు తెలుగు భాషను ఆహ్లాదంగా నేర్చుకోవడానికి దోహదపడతాయి. గేయాలు భాషను నేర్పడంతో పాటు భావ వ్యక్తీకరణకు దోహద పడతాయి. పిల్లల ఆలోచనకు, ఊహాశక్తికి గేయాలు అవకాశం కల్పిస్తాయి.కాబట్టి ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు, బళ్ళు బాలసాహిత్యాన్ని పిల్లలకు విరివిగా అందించాలి. అందుకు తగిన ప్రణాళికలను రూపొందించుకోవాలి. భాషా వేత్తలు, ప్రణాళికా వేత్తలు, రచయితలు తెలుగు బాల సాహిత్య ఆవశ్యకతను గుర్తించాలి. **తెలుగు సాహిత్యంలో బాల సాహిత్యానికి సముచిత స్థానం కల్పించాల్సిన అవసరం ఉంది.** తెలుగు భాషా సభలలో బాలసాహిత్యానికి ప్రముఖ స్థానం కల్పించాల్సిన అవసరం ఉంది. బాల సాహిత్యం మీద విస్తృతంగా చర్చలు జరగాల్సిన అవసరం ఉంది.

వ్యాస రచయిత బాలసాహితీవేత్త

---

**32 వ పుట తరువాయి.....**

/ వడి > బడి. హారము అనే మాటకు పథం సమానార్థకం. పథం > పాడి > వాడి.

హిరణ్య రాష్ట్రంలో జీవించడం వల్లనే హిరణీకులుగా పరిగణనలోకి వచ్చారని కూడా అర్థమవుతోంది. వారివల్ల హిరణ్య రాష్ట్రమనే పేరురాలేదు. ఈ క్రమంలోనే ప్రాంత నేపథ్యంగానే రేనాటి చోళులు అనేమాట కూడా ఇలాగే ఏర్పడింది.

ఈ ప్రాంతాన్నే పదహారవ శతాబ్దం నుండి రాయలసీమగా పిలుస్తున్నారు. ప్రపంచ చరిత్రలో దేశాలకు దేశాలే అదృశ్యమవుతుంటాయి. అటువంటిది రెండు వేల మూడు వందల సంవత్సరాలుగా ఈ ప్రాంతం భౌగోళికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా ఒకే ప్రాంతంగా వుండటం నిజంగా అద్భుతం. పేర్లు మారాయంతే! భాషాపరంగా కూడా రాయలసీమ మాండలికంలో భాగంగా నెల్లూరు ప్రాంత భాష వున్నదని ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి ఇదివరకే తేల్చి చెప్పివున్నారు. హిరణ్యరాష్ట్రమే రేనాడు. రేనాడు మార్జవాడగా ఆ తరువాత రాయలసీమగా పిలువబడుతోంది.

ప్రాచీన యుగంలో బంగారు వజ్రాలు లభించిన ప్రాంతం. మధ్యయుగంలో బంగారం, రత్నాలు, వజ్రాలు వీధుల్లో రాసులుగా పోసి వ్యాపారం చేసిన ప్రదేశం కాస్తా ఆధునిక కాలంలో రైతు ఆత్మహత్యలతో కరువు పీడిత ప్రాంతంగా మిగలడం శోచనీయం.

రచయిత అనంతపురం ప్రభుత్వ కళాశాలలో
తెలుగు అధ్యాపకులు

---

మాతృభాషకాని భాషలో విద్యాభ్యాసం
విద్యార్థి చదువుకు అడ్డంకిగా మారుతుంది
-యునెస్కో

జి.వి.పూర్ణచందు
9440172642

# పత్తిత్తులు

నే..నేను లల్లని! తెల్లగా విచ్చుకున్న పత్తిపువ్వుని!
దూది వలిచేవాడు వచ్చి నన్ను బాది దుమ్ము దులుపుతాడు
కదురు మీద నూలుని దారంలా పేనుతుందింకో ఆవిడ
నేతనేస్తం మగ్గాని కెక్కించి బట్టగా నేస్తాడు
ఆ పైన బండకేసి బాది దయలేకుండా నన్ను ఉతుకుతారు
దర్జీ వచ్చి కత్తిరించి సూదులు గుచ్చి చొక్కా కుడతాడు
దర్జాగా ఎవడో దాన్ని తొడుక్కు తిరుగుతాడు
ఇన్ని బాధలు నేను భరిస్తేనే ఇంత కుదిరింది...
ఆ వేలుపు నన్ను కలుపుకోవాలంటే ఇన్నీ తప్పవుకదా!

కాశ్మీరీ కవయిత్రి లల్లేశ్వరి (1320 -1392) వాక్కులివి! ఈ లల్లాయిపదాలు తెలుగులో ప్రసిద్ధమే! బహుశా వీటిని పాడుకోని తెలుగు ఉండేవాడు కాదేమో! "బాగా పాడ్తున్నావోయ్ అంటే "నాదేం ఉంది లేండి...ఏదో లల్లాయిపదాలు...అంతే!" అనేవాళ్లు పూర్వం వినయంగా! సామాన్యుడిక్కూడా అర్థం అయ్యేలా ఉండేవన్నమాట లల్లవాక్కులు! తెలుగువాళ్లు లల్లేశ్వరి, లల్లయోగేశ్వరి, లాల్ దేద్, లల్ల ఆయీ, లల్లదీదీ, లల్లతల్లీ ఇలా పిలుస్తారీ కాశ్మీరీ కవయిత్రిని. శివభక్తులు, సూఫీ సంప్రదాయాలకు చెందిన వ్యక్తులు తెలుగు నేలపైన లల్లవాక్కుల్ని ప్రచారం చేసి ఉండాలి.

'పత్తివిత్తు' జీవనయానం స్వచ్ఛంగా, నిరాడంబరంగా, నిస్వార్థంగా సాగటాన్ని లల్లతల్లి ఈ వాక్కుల్లో వివరించింది. లోకోపకారి కావటమే భగవంతుని చేరే మార్గం అనేదే ఇందులో సారాంశం. పత్తివిత్తు మొలకెత్తి, మొక్కగా ఎదిగి, పూలుపూసి, ఆ పూలు కాయలై, కాయల్లో ఉండే పత్తితో బట్టలు నేస్తే, దర్జీ చొక్కా కుడితే, మనం బట్టకట్టి తిరుగుతున్నాం. ఇంత చేసినా పత్తివిత్తుకి కించిత్తు గర్వంలేదు. అదీ 'పత్తివిత్తుతనం' అంటే జనవ్యవహారంలో అది పత్తిత్తుతనం అయ్యింది. తెలుగువారికి పత్తిత్తు పవిత్రతకి, లోకోపకారానికి చిహ్నం.

కానీ, తెలుగులో ఈ పదం ఏ కారణం చేతో దాని పవిత్రతకు, లోకోపకార కాంక్షకు దూరం అయ్యింది. నిఘంటువుల్లో ఈ పదం అసలే కనిపించదు. కావ్యాల్లో కూడా దీని ప్రస్తావన తక్కువ. 12వ శతాబ్దికి చెందిన లల్లమ్మ పత్తి విత్తుల పత్తిత్తుతనాన్ని చెప్పిన ఈ 800 యేళ్ళ కాలంలో ఈ పదానికి సాహిత్య గౌరవం దక్కింది తక్కువ. ఆధునికంగా కవులు ఈ పదాన్ని ఘనంగానే వాడుతున్నారుగానీ, అనుకూల (పాజిటివ్) అర్థంలో, గౌరవప్రదమైన భావనలో వాడట్లేదు. "అయ్యా తమరు పత్తిత్తులాంటివారు" అని ఎవర్నయినా అంటే ఆయన గౌరవంగా తీసుకోకపోవచ్చు. "ఆయనేమన్నా పత్తిత్తా?" అంటే తిరుగుబోతని, నేరాలకు పాల్పడే వ్యక్తి అని రూఢీ అయిపోతుంది. అంతమాట అవతలి వాణ్ణి అనలేనప్పుడు ఆ వ్యక్తిని ఆక్షేపించటానికి "పాపటలో వెంట్రుక నెరిస్తే పత్తిత్తు" అని సామెత పుట్టింది. వెనకటికి మిస్సమ్మ సినిమాలో నాయకుడు తాను పత్తిత్తుననటానికి కాండక్ట్ సర్టిఫికేట్ చూపిస్తానంటాడు. అలాంటిదే ఇది!

ఒక పదాన్ని వ్యంగ్యం చేయటంలో తెలుగులో చాలా అనుకూలత ఉంటుంది. 'దయచేయండి' అనే పదాన్ని గౌరవపూర్వకంగానూ వ్యంగ్యంగా కూడా వాడతాం. "తమరు గొప్పోరండీ" అంటే పొగడ్తే కావాలని లేదు, తిట్టు కూడా కావచ్చు. పత్తిత్తు కూడా ఇలా వ్యంగ్యానికి గురైంది. పత్తిత్తుల్లో కూడా ఉత్తపత్తిత్తులుంటారు. 'శ్రీ 420' లాంటి వాళ్లన్నమాట.



లల్లేశ్వరి యోగిని

"గూడెమంతా కోడై, 'అబ్బో! అది పత్తిత్తు ! కొలాన తప్పు బుట్టింది' అని కూస్తుంది!" ఇలా పత్తిత్తు పదం వెలిసిపోయి, తన అసలు రూపం కోల్పోయి, పతితులు పత్తిత్తులయ్యారు. పత్తిత్తు అంటే వేశ్య, దుర్మార్గుడు, నేరస్థుడు అనే అర్థాల్లోకి మారిపోయింది. **భాషలో ఇలాంటి అర్థపరిణామాలు సహజం. కంపు అనే పదం తన ఇంపుదనాన్ని కోల్పోయి దుర్వాసనకు ప్రతీక అయ్యింది కదా!**

"మహా పత్తిత్తు పొంగలి 'పెడతావుంది సూడండిరా ! ఇప్పుడేందో పదిమందిలో యింతకు ముందేంవో ఎవుడికీ తెలియకుండా ఒకడికి పొంగలి పెట్టించింది"

"ఈ అధికారి పదిమందిలో అసహ్యంగా, అవమానంగా మాట్టాడతాడు. వాడేమీ పత్తిత్తు కాకపోయినా తనకింద వాళ్ళని గుప్పెట్లో బిగించాలని చూస్తాడు" ఇలా తానే గొప్ప అనుకునేవాణ్ణి ఉత్తపత్తిత్తులా నటిస్తున్నాడనే అర్థంలో అడపాదడపా ఈ ప్రయోగం కనిపిస్తోంది.

ఈ ఉత్తపత్తిత్తులు ఇవ్వాళ సైన్సుని అడ్డంపెట్టుకుని విత్తనాలలోని జీవశక్తిని పరిహరించి అవి పునరుత్పాదకతకు పనికి రాకుండా చేసి, రైతు మళ్ళీ పంట వేయటానికి తన దగ్గరకే విత్తనాల కోసం వచ్చి కొనాల్సిన పరిస్థితిని తెచ్చారు. దాంతో లోకోపకాకారకాలైన పత్తివిత్తులు ఈ రోజు ప్రమాదంలో పడ్డాయి. ఇప్పుడు రైతాంగానికి దొరికే పత్తివిత్తులు నిజంగా పత్తిత్తులు కావు.

రేగడివిత్తులు' నవల్లో ఈ ఉత్తపత్తిత్తుల దౌష్ట్యానికి రైతుల కుటుంబాలు అనేకం అతలాకుతలం కావటాన్ని రచయిత్రి చంద్రలత ఇలా వర్ణిస్తారు: "నీ వెన్నన్నా చెప్పు - రామన్నా! గా పత్తి ఈ నడిగడ్డను శనిగడ్డ చేసి ఇడస్తది - నా బొందిల పానం వుండగ గా పత్తిత్తులు ఎదపెట్టను. నీ కాల్మొక్త - నా పాలికి నన్నిడుసు - నా మగన్ని గా పత్తిమింగి - నా బిడ్డల గా పత్తికి బలిపెట్ట - బతికుంటే గింత బలుసాకు తింటన్న ఓ రామన్నా - నీకు దండం పెడ్తా- " అని.

మాఫియాల ప్రయోజనాన్ని కాపాడేందుకు కొందరు శాస్త్రవేత్తలు, కొందరు పాలకులు, కొందరు అధికారులు పూనుకోవటం చేత ప్రజా ప్రయోజకాలన్నీ ఈ పత్తివిత్తుల మాదిరే బలౌతున్నాయి. నెయ్యి నెయ్యి కాదు, నూనె నూనె కాదు. తేనె తేనె కాదు. ఏదీ ఏదీ కాకుండా పోయేలా చేసిన "శ్రీపత్తిత్తు"లకే పాలకవర్గాలు బాసటగా ఉంటున్నారు. అ

పి. శివరామకృష్ణ 'శక్తి'
94414 27977

# మసకతర్కం - బూటకపు చుట్టరికాలు- బూటకపు పరిష్కారాలు, అణిచివేతలను ఎదుర్కొనే వ్యూహాలు.

మానవ మేధకు సహజమైన, ఉజ్జాయింపు అంచనాలను ( approximate) సుమారు లెక్కలను 'మసక తర్కం' (fuzzy logic ), సూత్రీకరించేది. కుడి- ఎడమ, పచ్చి- పండు,పగలు- రాత్రి, ఎండా- వానా, మొదలైన ప్రకృతిలో ద్వంద్వాత్మకమైన ధర్మాలు (binary), లాభం నష్టం, కష్టం- సుఖం, మంచి- చెడ్డ, సవ్యం- అపసవ్యం, మడి- మయల, ఉడికించటం - వేయించటం, పచ్చిది-కాల్చినది, ఎక్కువ- తక్కువ ఇత్యాదిగా సంస్కృతిలో విస్తరించే వర్గీకరణకు, తరతమాల బేరీజుకు పునాది.




మనో వ్యాపారంలో అతివ్యాప్తి, అవ్యాప్తి, భ్రమ ప్రమాదాలను - బీరకాయ పీచు, బోడిగుండుకు బట్టతలకు ముడివేయటం, శాఖాచంక్రమణం; బాదరాయణ సంబంధం - ఇవి సాహిత్యంగా, అలంకార శాస్త్రం మన్నిస్తే, కార్య కారణ సంబంధం లేని వీటిని 'బూటకపు చుట్టరికాలు'గా (కవన శర్మ 35) నిత్యజీవితంలో తిరస్కరిస్తాము (ప్రపంచ తెలుగు వ్యాస సంకలనం ప్రపంచ తెలుగు రచయితల సంఘం 2019 లో 'తెలుగు, తెలుగేతర భాషా సాహిత్య నిర్మాణ సూత్రాలు' పుట 183).

శాస్త్రవేత్తలు పరీక్షించి నిగ్గు తెల్చేవి, రుజువు చేసినవి ఖచ్చితమైన లెక్కలుగా (accurate), సార్వకాలిక సత్యాలుగా భావించే బుద్ధిజీవులు, నేడు, మేధస్సు, తీరుతెన్నులను, సమన్వయించుకుంటూ కృత్రిమ మేధను పెంపొందిస్తున్నారు. కాని, అభివృద్ధి పేరిట నడిచే ఈ నాటకంలో శ్రమజీవులు ప్రతిదశలో నెట్టివేయబడుతున్నారు.




లిపి వచ్చాక రాతకోతలు, మాయ మర్మం పెరిగి, నలుగురు కలిసి చర్చించి నిర్ణయం తీసుకోవటం, మాటమీద నిలబడటం తగ్గిపోయింది. నాణేలు, బంగారం వంటి కృత్రిమ విలువలు చలామణిలోకి వచ్చాక, వ్యాపారం, దొంగలెక్కలు, సెన్సెక్స్‌లు,షేర్ మార్కెట్లు పెరిగి, వస్తు మార్పిడి తగ్గింది. అచ్చుయంత్రం వచ్చాక, మరీ నేటి కంప్యూటర్ యుగంలో, ధారణశక్తి క్షీణిస్తుంది.ఇప్పుడు ఈ కృత్రిమమేధ, మాయజలతారును, నకిలీ మేధావులను సృష్టిస్తోంది అని భాషా శాస్త్రవేత్త, పౌరహక్కుల అభిమాని నోం చామ్స్కీ హెచ్చరిస్తున్నాడు.తమకు అనుగుణంగా బదులిచ్చేలా ప్రభావితం అయ్యే మాయరోగం దీనికున్నట్లు అనుమానిస్తున్నారు. 1965 నుండి వాడుకలోకి వచ్చిన ఈ మసక తర్కాన్ని, 89 లో సుదీప్త కవిరాజ్ ప్రస్తావిస్తే, 2000లో దీపేశ్ చక్రవర్తి Habitations and modernity లో వివరించిన తీరును అమ్మనుడిలో 'కంప్యూటర్‌కు అక్షాంశ రేఖాంశాలకు స్థలాల పేర్లను జోడించ లేమా' వగైరా వ్యాసాలలో చర్చించాము.

ఇలా మార్పుజరుతుగున్న ప్రతిదశలో - పెట్టుబడి దారులు, వేతనజీవులు ఎక్కువ వోట్లు చేజిక్కించుకుని అధికారం చెలాయించే పాలక వర్గాలు, ఒకరి తరువాత ఒకరిని బలహీనులుగా మార్చి, వదిలించుకుంటూ, అణగదొక్కుతూ, ఎక్కువ వాళ్ళకోసం (maximise the pleasure of maximum number of people) ఒక్కటొక్కటి కోల్పోతున్న వాళ్ళమీద 'అధికారమదము గల్గిన ఈ బధిరాంధక వర్గాలు' గా సవారి చేస్తూ, 'బూటకపు పరిష్కారాల'తో (ఆలోచనే ఆయుధంగా నోం చామ్స్కీ కూర్పు. అనువాదం ముక్తవరపు పార్ధసారధి. ప్రజాశక్తి ప్రచురణ 2005 పుట 51) ప్రగతిని పక్కదారి పట్టిస్తున్నారు. వైద్యరంగంలో కొత్త కొత్త రోగాలు, మందులూ, కొత్త కొత్త ఆవిష్కరణలు, కొత్త ఆశలు రేపుతూ వ్యాపారం పెంచుకున్నట్లే, ఉపాధి అవకాశాలు పెంచుతున్నట్లే, ఈ అంతర్జాలంలో కొత్త వలలు, గూడులు, వెనులుబాట్లు, కొత్త కొత్త సౌకర్యాలు చూపించి, ఉపాధి భ్రమలతో ఆకట్టుకుంటున్నాయి.,



కథారచయితగా అందరికీ తెలిసిన కందుల వరాహ శర్మ(కవన శర్మ) గారు ఒక శాస్త్రవేత్త. ఆయన ఒక సత్యాన్వేషిగా 2006 లో తెచ్చిన చిన్న పుస్తకం 'సైన్సు నడిచిన బాట' లో ఈ మసక తర్కం, బూటకపు (spurious) చుట్టరికాలు, బూటకపు సూత్రాలు(పుట 35) పదాలు వాడుతూ జీవ, సాంఘిక పరిణామ వాదాలలో, ప్రాచ్య, పాశ్చాత్య దృక్పథాలలో అందదుకులను చర్చించారు.

'భౌతిక శాస్త్రంలో క్వాంటం భావాలు వచ్చాక ప్రపంచంలో ప్రాచ్యదేశాల ఆలోచనా విధానాలపట్ల పాశ్చాత్య దేశాలు ఆసక్తి కనబరుస్తున్నాయి.కృత్రిమ మేధస్సు ( artificial intelligence) సృష్టించటం అవసరమయ్యాక భారత హిందూ, జైన బౌద్ధ తర్క

శాస్త్రాలలో ఉన్న fuzzy logic ( మసక తర్కం - నిజానికి దీన్ని విస్తృత తర్కం అనాలి) పట్ల ప్రపంచ శాస్త్రజ్ఞులకు కుతూహలం ఏర్పడింది'.(పుట 11)

కానీ శర్మ చుట్టూ చేరింది సాహిత్య గాళ్ళు. కథల పోటీలో తమకు మొదటి బహుమతి వస్తే, ఆయనకు ఓదార్పు బహుమతి మాత్రమే వచ్చినందుకు గేలిచేస్తుండేవారు, ఆయన మీవి 'ఎర్రక - ద్దాలని' ఎద్దేవా చేస్తుండేవారు.

(ఆంధ్రజ్యోతి స్మారక వ్యాసంలో వివిన మూర్తి ) మాటల గారడితో చేసే నేలవిడిచిన సామును అదుపులోకి తేవలసిన విమర్శకులు, మరింత మెరుగుపెట్టి గిల్టు నగలను అంటగడుతున్నారు. సిద్ధాంతాలు, కవిత్వాలు, ఉద్యమాలు, ఆ వి-రణల పేరిట ఆశపడటం, భంగపడటం- ఈ నాటకం అంతులేని కథలా సాగుతున్నది.




'1952 నుండి 61 మధ్య, కమ్యూనిస్ట్ పార్టీ ఎన్నికలలో దిగబడిపోయి క్రమంగా వర్గ పోరాట సంఘర్షణ పట్ల మెతకవైఖరి అవలంబించటాన్ని.'కత్తులవంతెన నవలలో మహీధర రామమోహనరావు ఉదహరిస్తారు. ( ప్రజా సాహితి .మహీధర స్మారక సంచిక జూలై 2000 పుట 73). 'మనం రోడ్ల కూడలి లోకి వచ్చాం. కాస్త దారి చూపటం అవసరం. ఇన్నివేలు లక్షల సంవత్సరాలు కమ్యూనిస్టుల మొహం ఎవరికైనా తెలుసా! అయితే వాళ్ళు ఇపుడు ఉన్నారు గనుక. ఏదో ఉద్ధరిస్తారనుకున్నాం గనుక వాళ్ళకేసి చూసాం. ఇప్పుడు మీరే నేర్చుకోండి మంచి చెడ్డలు' అంటూ కళ్యాణి పాత్ర ద్వారా హితవు చెప్పిస్తాడు. అంతకు ముందు వచ్చిన నవల 'ఎవరికోసం'లో కథానాయకుడు తనకు మొదట్లో ఎదురైన భూసమస్య వదిలిపెడతాడు. మహీధర కుటుంబం ఎన్నో రచనలు, అనువాదాలు చేసారు. సైకిళ్ళ మీద తిరిగి ఆ సాహిత్యంతో జనాన్ని చైతన్య వంతులను చేశారు. ఆ చైతన్యం, సంఘ సంస్కరణకు తప్ప, భూమి,కూలి మొదలైన వనరుల పంపకంలో ప్రభుత్వం చేసే అవకతవకలను సరిదిద్దటంలో అక్కరకురాలేదు. లేదా చైతన్య వంతులైనవారు అందుకోసం తెలివి తేటలను ఉపయోగించలేదు. సిద్ధాంతాలు వల్లిస్తూ, అస్తిహక్కును సోషలిస్టు వ్యవస్థ కోసం కలలుకంటూ, సాహిత్యంలో పాత్రల మధ్య




తర్క వితర్కాల చర్చలతో కుస్తిపడుతూ, పార్టీలు, సంఘాలను పట్టుకుని వేలాడుతూ వచ్చారు. చివరకు మహీధరలాగా నిస్పృహకు లోనైనారు.

రైతుకూలీ సంఘాలు, పౌరహక్కుల సంఘాలలో చేరి, పదవుల పంపకంలో ఇరుక్కు పోయాయని, తీవ్రవాద ఉద్యమం భవిష్యత్ స్వప్నాలతో ఆకర్షించింది. కాని, ట్రేడ్ యూనియన్ సమస్యలలో రైతాంగ పోరాటాలలో పిడుక్కీ బియ్యానికీ సాయుధ మంత్రం ఉపయోగిస్తున్నారని, కమ్యూనిస్ట్ ఉద్యమం ఉదారవాద విధానాలను విస్మరించిందని, కన్నబిరాన్, మన రాష్ట్రంలో పరిస్థితులు, తనకెదురైన అనుభవాలు వివరిస్తారు (24 గంటలు,)

భాషా శాస్త్రవేత్త నోం చామ్స్కీ, ప్రపంచ పరిణామాలు ఏకరువు పెడుతూ,'ఒక భావజాలం, సిద్ధాంతానికి, కట్టుబడని వాళ్ళు మాత్రమే సమస్యల్ని స్పష్టంగా అర్థం చేసుకుని పరిష్కారం చూపించగలరు.' **సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నవాళ్లు సిద్ధాంతాల గురించి మాట్లాడుతారు తప్ప సమస్యలగురించి కాదు.** వీళ్ళు ఎదుటివాళ్ళను మభ్యపెట్టటానికి నైతిక విలువలు,మానవహక్కులు వ్యక్తికీ సమాజానికి ఉన్న సంబంధం, సోషల్ బిహేవియర్ సైన్సులు ఉంటాయి. వీళ్ళవన్నీశాస్త్రీయంగా కనిపించే బూటకపు పరిష్కారాలు'. (51)

'చట్టం ఉంటే పోరాటం చెయ్యటానికి కొంత ఆధారం లభిస్తుంది. కేవలం చట్టంవల్ల హక్కులురావు. కాకపోతే అవి అమలు జరగటానికి పోరాటం చేయాలి. లేకపోతే చట్టాలు, తీర్పులు,కాగితాలలోనే ఉండిపోతాయి.మానవ స్వభావాన్ని ఎప్పుడూ ఎవరూ ఖచ్చితంగా అంచనా వెయ్యలేరు. ఎప్పుడైనా ఎవరైనా మారకపోతారా అని ఒక ఆశ. ఎంత నిర్హేతుకమైనా ఏదో ఒకటి చేయాలనిపిస్తుంది'. కాని ఏదో ఏదో గుంపులో కొట్టుకు పోకుండా,'ఆర్థికంగా తక్కువ సామర్థ్యం కలిగినప్పటికీ,పనిమీద అధికారం ముఖ్యం' ( 29)అని జాగ్రత్తలు చెపుతూ, సామాన్యపౌరులను సాధికారం చెయ్యకుండా నాయకులు అందరినీ ఉద్ధరిస్తారనుకోటం పొరపాటు(19).'ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలు ప్రారంభించే ముందర రాగల ప్రమాదాన్ని ఊహించండి. ఉహించినదానికన్నా ఎక్కువ ప్రమాదమే జరగొచ్చు లేదా ఇంతచేస్తే ఏ చిన్న మార్పైనా రాకపోతుందా అని ఆశించండి. రెండు ప్రత్యామ్నాయాలను ముందర పెట్టుకున్నప్పుడు ఏదో ఒకటి తప్పక జరుగుతుంది. (ఆలోచనే ఆయుధంగా పుట 37.) అని చామ్స్కీ భవిష్యత్తులోకి ఆశగా చూస్తాడు.

'పరాజయమ్ము కల్గునంచు పారిపోకుమోయ్' అ

గ్రంథాలయం

**పల్నాటి యుద్ధము**
పద్యనాటకం
**రచన:గాడేపల్లి కుక్కుటేశ్వరరావు**
పుటలు: 76, వెల 100/-
ప్రతులకు: గాడేపల్లి చక్రి
ప్లాట్ 101,జి బ్లాక్, అపర్ణ లేక్ బ్రీజ్ అపార్ట్‌మెంట్స్, చందానగర్,
హైదరాబాద్ - 500 050
ఫోన్:79939 90622



పుస్తక సమీక్ష

# మెకంజీ కైఫియతులు (పశ్చిమ గోదావరి)




మెకంజీ కైఫియతులు
పశ్చిమ గోదావరి
రచన:డా.లంకా
వెంకటేశ్వర్లు
వెల:రూ. 100
ప్రతులకు:
26-2-4, అమీనాపేట
ఏలూరు,ప.గో.జిల్లా
ఫోన్: 9492471444

ఆంగ్లేయులు మన దేశాన్ని మూడువందల ఏళ్ళు పాలించగా, ఇంగ్లాండు నుంచి వచ్చిన అధికారులలో దాదాపు 90 శాతం మన దేశాన్ని దోచుకున్నారు. మిగిలిన 10శాతం మంది మాత్రం మన దేశ,భాషా సంస్కృతులను, ప్రజలను ప్రేమించారు. ఆ కొద్దిమందిలో కల్నల్ కాలిన్ మెకంజీ ఒకరు. మెకంజీ మన చరిత్రకు కావలసిన ముడిసరకును సేకరించి, పదిలపరచి, 'మెకంజీకైఫియత్‌లు'గా పేరుగాంచిన అమూల్యమైన చరిత్రను చరిత్రలను మనకు అందించిన మహనీయుడు. అయితే మెకంజీని తలచుకున్నప్పుడు కావలి వెంకటబొర్రయ్యను కూడా తలచుకోవాలి. దక్కన్ ప్రాంతంలోని స్థానిక చరిత్రలను తవ్వితీయడంలో, మనకు అందించడంలో జరిగిన కృషిలో అగ్రస్థానం మెకంజీదికాగా, తన మేథాశక్తితో ఆ కృషికి రూపాన్ని ఇచ్చినవారు కావలి సోదరులు - బొర్రయ్య, వెంకటలక్ష్మయ్య మరియు వెంకట రామస్వామి. కల్నల్ మెకంజీ, కావలి సోదరుల సహాయంతో పదిలపరిచిన వేలకొలదీ కైఫియత్తులలో పశ్చిమగోదావరికి చెందిన 11 కైఫియత్‌లను అధ్యయనం చేసి పుస్తక రూపంలో వెలువరించారు డా. లంకా వెంకటేశ్వర్లు.

ప్రాచీనకావ్యాలు, శాసనాలు - వీటితోపాటు కైఫియత్‌లు కూడా చారిత్రిక నేపథ్యం ఉన్న గ్రంథాలుగా కొంతవరకు గుర్తించవచ్చు అంటూ కైఫియత్‌లు - సామాజికత శీర్షికన మొదటి అధ్యాయంతో చెప్తూ రెండవ అధ్యాయంలో కైఫియత్ చరిత్రకారులయిన మెకంజీ, తొలి తెలుగు చరిత్రకారుడు కావలి వెంకట బొర్రయ్య ; వెంకట లక్ష్మయ్య మరియు తొలి సాహిత్య చరిత్రకారుడు - దక్కన్ కవుల జీవితచరిత్రలను సంక్షిప్తంగా ఆంగ్లంలో వ్రాసి (1829లో) పేరుపొందిన వెంకటరామస్వామి - గురించి వివరాలను అందించారు.

మూడవ అధ్యాయంలో పశ్చిమగోదావరికి చెందిన 11 కైఫియత్‌లను - వాటికి సంబంధించిన వివరాలను పాఠకుల అవగాహన కోసం అధోజ్ఞాపికలను కూడా ఇచ్చారు. కైఫియత్‌ల సారాన్ని కైఫియత్‌ల ఆధారంగా ఆనాటి - 18.19 శతాబ్దాలలోని భాషాంశాల విశ్లేషణ - నాలుగు, ఐదు అధ్యాయాలలో పొందుపరిచారు. పశ్చిమ గోదావరికి సంబంధించిన కైఫియత్‌లను ఈ కాలపు స్పృహతోపాటు విశ్లేషించడానికి, రచయిత వాటిల్లో పేర్కొన్న గ్రామాలు, ప్రదేశాలు,దేవాలయాలలో స్వయంగా క్షేత్ర పర్యటన కూడా చేయటం వలన ఈ పుస్తకానికి విలువ చేకూరింది. అందువలన వాటికి సమకాలీనత చేకూరింది. 'మెకంజీ కైఫియత్‌లు' అనే పేరున వ్యవహారంలో ఉన్నప్పటికీ వీటిని 'కావలి సోదరుల కైఫియత్‌లు' అనాలని రచయిత సూచించడం విశేషం. అంతేకాకుండా 'అనుబంధం'లో దస్తావేజుల రచనకు మూలం కైఫియత్‌లు అని రచయిత ప్రతిపాదిస్తూ 1868వ సంవత్సరంలో ఏలూరు సబ్‌రిజిస్ట్రారు కార్యాలయంలో రిజిష్టరు అయిన దస్తావేజులను ఉదాహరణగా జతచేశారు. ఈ కైఫియత్‌ల అధ్యయనం వలన ఆనాటి లిఖితభాషా స్వరూపం - లేఖన పద్ధతులు,వర్ణస్థాయి, పదస్థాయి, సంధి, ధ్వని మరియు విభక్తి - ఇలా భాషా, వ్యాకరణాంశాలను కూడా రచయిత విశ్లేషించారు.

కైఫియత్‌లు ఒకనాటి ప్రజల చరిత్రను తెలిపే రచనలుగా, ఆనాటి భాషాస్వరూపాన్ని తెలుసుకొనేందుకు ఉపకరిస్తాయనే వాస్తవాన్ని ఈగ్రంథంలో రచయిత సమర్థవంతంగా, సరళంగా అందరికీ అర్థంఅయ్యే శైలిలో స్పష్టపరిచారు. మును ముందుమాటలో వేల్చేరు నారాయణరావుగారు ఈ పుస్తకాన్ని గురించి "చాలా వివరణాత్మకమైన, ఆలోచనతో కూడినదనీ; మాటల్లో చెప్పడానికి వీలుకానంత విలువైనదని" పేర్కొనటం కంటే మించిన యోగ్యతాపత్రం ఇంకేముంటుంది

ఎమ్.వి.శాస్త్రి 94413 42999

గ్రంథాలయం



**గ్రాడ్యుయేట్ ఆటో సర్వీస్**
రచన:గోవిందరాజు చక్రధర్
పుటలు: 120, వెల 120/-
ప్రతులకు: నవోదయ బుక్ హౌస్
ఆర్యసమాజ్ ఎదురువీధి
కాచిగూడ, హైదరాబాద్ - 500029
ఫోన్:98498 70250

పుస్తక సమీక్ష

# జీన్‌వాల్‌జీన్ నవల

## (Leh Miserables)by Victor Hugo




జీన్‌వాల్‌జీన్
రచన:చెలంచెర్ల భాస్కరరెడ్డి
వెల:రూ. 200/-
ప్రతులకు:చెలంచెర్ల భాస్కరరెడ్డి
ప్లాట్ నెం.ఎస్17,
14వవీధి,(ఉత్తర)
సత్యం జి.నగర్,
వావిలేటిపాడు,
గుండుపాలెం పోస్టు,
నెల్లూరు - 524 003
ఫోన్: 94404 72840

ప్రముఖ ఫ్రెంచి కవి, నవలా రచయిత, నాటకకర్త, రాజకీయవేత్త, నీతివాది, విక్టర్ హ్యూగో (1802-1885) చేసిన గొప్ప సాహిత్య రచనగా ప్రసిద్ధి చెందిన బృహత్ నవల 'లే మిజరబుల్స్' (1862). విశ్వ సాహిత్యంలో నవలా విభాగంలో 19వ శతాబ్దంలో అత్యున్నతమైనదిగా పేరు పొందింది. ఎన్నో భాషలలోకి అనువాదం చేయబడటమేకాక అన్ని ప్రచార మాధ్యమాలలోనూ - సినిమా, టి.వి, నాటకరంగం, సంగీత రూపకంగానూ ప్రదర్శించబడి విశేషంగా మన్ననలను పొందించి. ఈ నవలలోని ఇతవృత్తం ఆధారంగా చేసుకుని తెలుగు చలనచిత్రరంగంలో కూడా 'బీదలపాట్లు' అనే పేరుతో రెండు సార్లుగా 1950లో ఒకసారి, 1972లో రెండవసారి చిత్రాలు నిర్మించబడిన విషయం ఇక్కడ మనం గుర్తుచేసుకోవాలి.

ఈ నవలకు 'అనుసృజన చేసారు - చెలంచెర్ల భాస్కరరెడ్డి - 'జీన్ వాల్ జీన్' పేరుతో.నిజానికి, ఇది మూలానికి సంక్షిప్తీకరణ కూడా. తెలుగుభాషా సాహిత్యాల మీద, భావితరం మీద రచయితకు ఉన్న గాఢమైన ప్రేమాభిమానాలకు ఈ అనుసృజన ఉదాహరణగా చెప్పవచ్చు. రచయిత దృష్టిలో తనను ప్రభావితం చేసిన ప్రతిభావంతులు ముగ్గురు -ఒకరు కావలి జవహర్ భారతి రెక్టర్‌గా పనిచేసిన దొడ్ల రామచంద్రారెడ్డి, రెండవ వారు విక్టర్ హ్యూగో, మూడవ వారు ఈ నవలలో ప్రధాన పాత్ర జీన్‌వాల్‌జీన్ - అని రచయిత - " ఈనవల నాకిష్టం ఎందుకంటే.." అనే ముందుమాటలో పేర్కొనటం గమనించాలి. ఆ ముగ్గురు ప్రతిభావంతులలో నవలా రచయిత విక్టర్ హ్యూగో, ప్రధానపాత్ర జీన్‌వాల్‌జీన్ లపై రచయితకు ఎంత ఇష్టమో తెలియజేస్తుంది.నవలలోని ప్రధాన పాత్ర అయిన జీన్‌వాల్‌జీన్, అక్క పిల్లల ఆకలి తీర్చడంకోసం ఒక రొట్టెను దొంగిలించిన నేరానికి 19 సం.లు జైలుశిక్ష అనుభవిస్తాడు. ఒక బిషప్‌గారి బోధనలతో ప్రభావితుడై, ఆయన ఇచ్చిన వెండిపళ్లాలతో వ్యాపారం చేసి ధనవంతుడై, ఆపట్టణానికి మేయర్‌గా అవుతాడు. అతని ఫ్యాక్టరీలో పనిచేసి, వ్యక్తిగత అపవాదుల కారణంగా పనికోల్పోయి, జీవనభృతికోసం వేశ్యగా మారిన 'ఫాంటైన్' రెండవ ప్రధానపాత్ర కాగా, మూడవ పాత్ర పోలీస్ ఇన్‌స్పెక్టర్ - జావెర్ట్‌ది. జీవాల్‌జీన్ తరువాతకాలంలో పారిశ్రామికవేత్తగా, ధనవంతుడుగా మేయర్‌గా ఉన్నత స్థితికి చేరుకున్నా, గతంలో అనుభవించిన జైలుశిక్ష, నేరస్థునిగా పడిన ముద్ర అతన్ని వెంటాడుతూనే వుంటాయి. దీనికి తోడు జావెర్ట్ అతడిని నిరంతరం అనుమానితుడుగా చూసి వెంటాడుతుంటాడు.'చివరకు జావెర్ట్, జీన్‌వాల్‌జీన్‌లోని దయాగుణాన్ని గుర్తిస్తాడు. అలాగే 'ఫాంటైన్' తనను ఎంత ద్వేషించినా , ఆమెకు శిక్షతొలగించేలా చేసి, తన ఆశ్రమంలో చోటిచ్చి ఆదరిస్తాడు జీన్‌వాల్‌జీన్. సూక్ష్మంగా ఇదీకథ. ఆయితే ఇందులో వాటర్‌లూ (1815) యుద్ధకాలం నుండి పారిస్ తిరుగుబాటుపోరాటం (1831) వరకు ఫ్రాన్స్‌లో చోటుచేసుకున్న సామాజిక పరిస్థితులు, సామాన్యుల జీవనవిధానం, మహరాజులూ, కులీన ప్రభువులు, అధోజగత్సహోదరుల విషాద జీవితాలు - ఇలా వీరిచుట్టూనే నవల తిరుగుతుంది. ఒక క్రొత్త ప్రపంచానికి వీళ్ళే సారధులవుతారన్న సంకేతమూ లభిస్తుంది.

ఈ అనుసృజన సరళమైన శైలిలో, కథన శైలి వేగంగా సులువుగా సాగి మూలరచనను పూర్తిగా చదవాలనే ఆసక్తిని కలిగిస్తుంది. జీన్‌వాల్‌జీన్ వంటి పాత్రలు మనకు అక్కడక్కడా తారసపడుతుంటారు. మనసున్న మారాజులు ఈ నవలని చదివి ప్రభావితులవుతారన్న నమ్మకం ఈ రచయితకే కాదు, పాఠకులకు కూడా కలుగుతుంది.

ఎమ్.వి.శాస్త్రి, 94413 42999

గ్రంథాలయం




**కార్వేటి నగరం కథలు**
బాలసాహిత్యం
**రచన:ఆర్.సి.కృష్ణస్వామిరాజు**
పుటలు: 108, వెల 140/-
ప్రతులకు: ఆర్.సి.కృష్ణస్వామిరాజు
22-4-71,బ్యాంక్ ఎంప్లాయిస్ కాలనీ,
మంగళం రోడ్, తిరుపతి - 517507
ఫోన్:93936 62821

**సంఘర్షణ**
ప్రగతిశీల కవిత్వం
**రచన:గోలి మధు**
పుటలు: 110, వెల 80/-
ప్రతులకు: రేఖా కృష్ణార్జునరావు
ఎన్.సి.సి రోడ్, మంగళగిరి గుంటూరు
జిల్లా, 522503
ఆంధ్రప్రదేశ్
ఫోన్:98481 99098



పుస్తక పరిచయం

# అభ్యాసకుల కరదీపిక "తెలుగుబడి" బాలవాచకం




మన మాతృభాష తెలుగు భాషను మన పిల్లలు దోషరహితంగా చదువలసిన అవసరాన్ని, తప్పులు దొర్లకుండా రాయవలసిన ఆవశ్యకత ఉంది. అందుకోనవే తెలుగు ఉపాధ్యాయుడు కూకట్ల తిరుపతి ఈ చిరు పొత్తాన్ని మన ముందుంచారు. ప్రస్తుతం ప్రపంచీకరణ ప్రభావం వల్ల అందరూ అన్యభాషల మోజులో పడి, అమ్మభాషను అభాసుపాలు చేస్తున్న క్లిష్ట సందర్భంలో ఉన్నాం. ఆంగ్లభాషను నేర్చుకోవడం మంచిదే కావచ్చు కానీ మన తల్లిభాషను మరచిపోతే తెలుగుజాతి మనుగడకు ముప్పు తప్పదని రచయిత నొక్కి వక్కానించారు. తెలుగు భాషను సులభంగా చదువ రాయ నేర్చుకోవడానికి కవి, రచయిత కూకట్ల తిరుపతి 'తెలుగుబడి' బాలవాచకం అనే పుస్తకాన్ని చక్కగా రూపొందించారు. కరీంనగర్ పట్టణానికి చెందిన ఈయన పెద్దపల్లి జిల్లా, జూలపల్లి మండల కేంద్రంలోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల (బాలురు)లో తెలుగు భాషోపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. ఈ పుస్తకం ద్వారా పిల్లలు తెలుగు భాషను దోషరహితంగా చదువడం, రాయడంను సులువుగా నేర్చుకోవచ్చు. ఇందులో సరళపదాలు, గుణింతపదాలు, ద్విత్వాక్షరపదాలు, సంయుక్తాక్షరపదాలు, సంశ్లేషాక్షరపదాలు మరియు ఆ పదాలతో కూడిన వాక్య రచనలను సోదాహరణంగా వివరించిన తీరు పాఠకులను ఆకర్షిస్తుంది. ఇదే వరుస క్రమంతో, పద పద్ధతిలో తెలుగు భాషను సులభంగా అభ్యసించవచ్చు. ప్రతి అంశంలో వాక్య నిర్మాణాన్ని కూడా తేలికగా చేసి చూపించారు. వీటికి సంబంధించిన డిజిటల్ పాఠాల క్యూఆర్ కోడ్లను ఆయా పాఠాల దగ్గర పొందుపరచడం విశేషం. పాఠకుడు స్వయంగా ఈ పుస్తకంలోని పాఠాలను చదువుకోవచ్చును. అలాగే క్యూఆర్ కోడ్లను స్కాన్ చేసి డిజిటల్ పాఠాలను చూస్తూ, వింటూ భాషను సొంతంగా నేర్చుకోవడానికి అనువుగా ఈ పుస్తకాన్ని రచయిత కూకట్ల తిరుపతి అభ్యాసకులకు అనుకూలంగా మలచినారు. ఇలా సాంకేతిక పరిజ్ఞాన్ని జోడించడం ఈ పుస్తకం కొత్తదనం. తెలుగు భాషలో సులభతరం నుంచి కఠినతరం వైపుగా బోధనాభ్యసన ప్రక్రియను కొనసాగించడానికి వీలుగా ఈ పుస్తక రూపకల్పన చేశారు.

తెలుగు భాషను చదువడం, రాయడం నేర్చుకున్న తర్వాత తెలుగు వాడిగా జీవించడానికి పనికి వచ్చే పాఠాలను ఇందులో పొందుపరచడం ముదావహం. తెలుగు పండుగలు, మన ఆటలు, తెలుగు సామెతలు, తెలుగు జాతీయాలు, పొడుపు కథలు, తిథులు, వారాలు, నక్షత్రాలు, రాశులు, కార్తెలు, మాసాలు, ఋతువులు, కాలాలు, తెలుగు సంవత్సరాలు, తెలుగు అంకెలను అందుబాటులో ఉంచారు. ఇప్పటి తరానికి ఈ పుస్తకం ఎంతో ఉపయుక్తంగా ఉన్నది. తెలుగు భాషను నేర్చుకోవడంతో పాటు తెలుగువాడిగా జీవించడానికి, సంస్కృతి సంప్రదాయాలను అలవర్చుకోవడానికి, అనువుగా ఈ పుస్తక రూపకల్పన జరిగిందని చెప్పవచ్చు. భావస్ఫోరకమైన ముఖ చిత్రాన్ని కూకట్ల సాయి భారవి అందించారు. ఈ పుస్తకానికి విశేషమైన ప్రజాదరణ లభించడంను బట్టి చూస్తే, మాతృభాషాభిమానం ఇంకా సన్నగిల్లడం లేదనిపిస్తున్నది. మన దేశంలోని ముంబై, చెన్నై, రాజస్థాన్, న్యూఢిల్లీ తదితర ప్రాంతాలలోని తెలుగువారితో పాటు అమెరికా, మయన్మార్, దుబాయ్ మొదలైన దేశాలలోని ప్రవాస తెలుగువారి నుంచి ఈ పుస్తకానికి విశేషమైన స్పందన లభించడం అభినందనీయం. తెలుగు భాష మూలాల్లోకి వెళ్ళి, తెలుగును తేలికగా నేర్చుకోవడానికి ఈ పుస్తకం దోహదం చేస్తుంది. ప్రతి తెలుగువాడు చదవవలసిన పుస్తకమిది. ప్రతి పాఠశాల గ్రంథాలయంలో ఉండవలసిన పుస్తకం 'తెలుగుబడి' బాలవాచకం. అ

తెలుగుబడి బాలవాచకం, రచయిత: కూకట్ల తిరుపతి
పుటలు: 79 వెల : రు.80, ప్రతులకు:కూకట్ల లక్ష్మి,
ఇ.నం: 08-03-207/4/2/ ఇ/1, రోడ్డు నం.07,
వాసుదేవ కాలని, కట్టరాంపూర్, కరీంనగర్ - 505001.
తెలంగాణ ఫోన్: 9949247591.

---

## పుస్తక పరిచయం: సామాజిక శ్రేయస్సు - అమ్మనుడి 'కందము' పంచశతి




రచయిత శ్రీ చందు నాగేశ్వరరావు తెనాలివాసి. 'జనసాహితి'సంస్థలో ఎన్నో సంవత్సరాలుగా క్రియాశీలంగా పనిచేస్తున్నారు. ఆ సంస్థ కార్యక్రమాలతోపాటు, ఆస్ఫూర్తితోనే తెలుగుబాషోద్యమంలో కూడా చురుకుగా పాల్గొంటున్నారు. 2017 నుండి ప్రత్యేకంగా 'మాతృభాషోద్యమ వేదిక కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు. ఉద్యమాల స్ఫూర్తితో ఈ 500 కంద పద్యాలను రచించి, వీటినొక సంకలనంగా ఇప్పుడు ప్రచురించారు. 140 పుటలుగల ఈ పుస్తకం వెల రు.200లు. 1.ప్రతులకు: చందు నాగేశ్వరరావు, ప్లాట్‌నెం.105, వెన్నెల రెసిడెన్సీ, శివరామకృష్ణవీధి, నాజరుపేట,తెనాలి-522201, ఫోన్ 7989663908, 2.మైత్రీబుక్ హౌస్, జలీల్ వీధి,అరండల్ పేట, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ - 520 002

ధారావాహిక

ఈమని శివనాగిరెడ్డి-స్థపతి
98485 98446

# అడుగుజాడలు - ఆనవాళ్ళు 23

# నా పంచలింగాల - పాపనాశం యాత్ర

'ఆంధ్రనగరి' 'ఆంధ్రపథం', 'ది బ్లాక్ రివర్' 'ది హిమ్స్ ఆఫ్ ది హరప్పన్స్' పుస్తకాల రచయిత సాయి పాపినేని, ఒకరోజు నాకు ఫోను చేసి, 'నేను యాంకోర్‌వాట్ వెళ్తున్నాను. మీరు కూడా వస్తారా?' అని అడిగారు. నేను ప్లీచ్ ఇండియా ఫౌండేషన్ అనే వారసత్వ పరిరక్షణ సంస్థ సీఈవోగా, తెలంగాణా ప్రభుత్వ పర్యాటక శాఖ ఆధ్వర్యంలోని బుద్ధవనం ప్రాజెక్టు బుద్ధిస్ట్ ఎక్స్‌పర్ట్ కన్సల్టెంట్‌గా పనిచేస్తున్నందున, పనుల ఒత్తిడివల్ల రాలేనని చెప్పటం నాకు బాధేసినా, రానని చెప్పాను. సాయి పాపినేని నన్ను ఒప్పించటానికి ప్రయత్నించారుగానీ నేను వెళ్లలేకపోయాను. ఒంటరిగానే వెళ్లి యాంకోర్ వాట్, యాంకోర్ థాం, తాప్రోం, చూచి, వియత్నాంలోని దానాంగ్ (ధాన్యకటకం), అమరావతి (ఖ్వాంగ్‌నామ్), ఫాండ్‌రాంగ్ (పాండురంగ)లోని కలింగరాయి దేవాలయం గురించి నాతో మాట్లాడుతూ చారిత్రక విషయాలను చర్చిస్తుండేవాడు. నేనక్కడకు వెళ్లలేదుగానీ, సాయిగారు నాకు అన్ని వివరాలు చెప్పి ఆలోటును తీర్చారు. యాత్ర ముగించుకొని తిరిగొచ్చేప్పుడు, హోచిమన్‌లో ఆగినప్పుడు తన అనుభవాలను నాతో గంటకుపైగా పంచుకొన్నాడు. తిరిగొచ్చిన పదిరోజులకు ఏ ఊరన్నా వెళదాం సార్ అన్నాడు. లేడికి లేచిందే పరుగు. అలంపూరు దగ్గర పంచలింగాల, పాపనాశం చూద్దామా అని అడిగాను.

పొద్దున్నే 6.00గం.లకు బయలుదేరి ఖాజాగూడ (హైదరాబాదు) మీదుగా అవుటరు రింగ్ రోడ్ ఎక్కి, షంషాబాద్ దగ్గర దిగి బెంగుళూరు రోడ్డు పట్టుకొని 3 గంటల్లో రయ్‌మని కర్నూలు దగ్గరకు చేరుకున్నాం. పుల్లూరు-పంచలింగాల చెక్‌పోస్ట్ దగ్గర టిఫిన్ చేసి, పంచలింగాల వైపు మళ్లాం.

పంచలింగాల. ఐదులింగాలున్న ఊరు. సాధారణంగా ఒకపానవట్టంపై ఒక శివలింగం ఉండటం ఆనవాయితి. ఒకే పానవట్టం పైన రెండు శివలింగాలున్న దేవాలయాలు, నాగర్ కర్నూలు జిల్లా, శ్రీశైల ఉత్తర ద్వారంగా ఉన్న ఉమామహేశ్వరం వద్ద, పెద్దపల్లి జిల్లా కాళేశ్వరం వద్ద ఉన్నాయి. ఇవి వరుసగా, పద్మనాయక రాజులు, విజయనగర రాజులు నిర్మంచిన ఆలయాలు. మళ్లీ ఇప్పుడు, పంచ లింగాల వద్ద ఒకే పానవట్టంపై ఐదు శివలింగాలు ప్రతిష్ఠించబడి ఉండటానికి తుంగభద్రానది తీరంలోను ఒక గ్రామానికి పంచ లింగాల అన్న పేరొచ్చింది. జాతీయ రహదారి నుంచి ఒక కిలోమీటరు దూరంలో గ్రామం. నేను 1978-81 మధ్య అలంపూరులో పనిచేసినప్పుడు, పంచలింగాల గుళ్లను చూశాను. ఈ నలభై ఏళ్లలో కొత్త కొత్త ఇళ్లు రావటాన గుళ్లు కనిపించకుండా పోయాయి. రోడ్డుమీద కూరగాయలమ్ముతున్న అతన్ని గుడి గురించి వాకబు చేశాను. ఒక కుర్రవాడు మాత్రం మా వెంటవచ్చి పంచలింగాల గుళ్లను చూపించాడు.

ముందుగా ఆలయ సముదాయాన్ని చేరుకునే రెండు అంతస్తుల ప్రవేశ మండపముంది. బాదామీ చాళుక్యుల (క్రీ.శ.7వశతాబ్ది) నాటి ఈ మండపమే తెలుగు నేలపై తొలి రెండంతస్తుల మండపమని చెప్పగానే సాయిపాపినేని కళ్ళు విప్పారాయి. ఆ మండపానికి ఆనుకొని ఒక ఇల్లుంది. దాని లెట్రిన్‌ను మండపానికి ఆనించి కట్టాడు చరిత్రపై అవగాహనలేని ఆ ఇంటి యజమాని. ఇక్కడే కాదు, చాలా చోట్ల ఇలాంటి దృశ్యాలే. పురాతన స్థలాలు, కట్టడాల పరిరక్షణ చట్టానికి పదునుపెడితేనే ఇలాంటి అరుదైన కట్టడాలు గౌరవించబడతాయి. ఇద్దరం అక్కడొక



ఫొటోదిగి ఎడమ వైపు చూశాం.

అదొక చాళుక్యుల గుడి. భూమట్టానికి ఆరడుగుల లోతులో ఉంది. మెట్ల ద్వారా దిగి చూస్తూ, కీ.శ.7వ శతాబ్ది నాటి అపురూప మహిషాసుర మర్దని శిల్పం. ఎప్పుడో ఒకప్పుడు పూజారి ఇచ్చే హారతికి గబ్బిలాలు బయటకెళ్తాయని మాతో వచ్చిన పోరడు చెప్పాడు. నిర్లక్ష్యమే నివేదన, గబ్బిలాల కంపే సుగంధంగా శతాబ్దాల తరబడి అలవాటుపడింది అమ్మవారు. చక్కటి విగ్రహం. కుడివైపు చేయి, శూలం విరిగిపోయాయి. ఇద్దరం చాళుక్య శిల్ప రీతిని పరిశీలించి బయటికొచ్చాం. ఆలయం చుట్టూ కమ్ముకొచ్చిన ఇళ్లు, అక్కడొక ఆలయముందున్న సంగతినే మరపింపజేస్తున్నాయి. ప్రధాన ఆలయం



చూద్దామని ముందుకుసాగాం.

ఎడమవైపున వరుసగా క్రీ.శ.7వ శతాబ్ది మాతృదేవత (నగ్నబంధక), చెన్నకేశవ, ఒక శిథిల శాసనం భూమిలో కూరుకుపోయి ఆలనా పాలనా లేక అలమటిస్తున్నాయి. అమ్మతల్లి విగ్రహం అచ్చం బాదామీలో ఉన్నట్లే తొలిచాళుక్య శిల్ప సంప్రదాయంలో మలచబడింది. స్థానికులు ఈ విగ్రహాన్ని రేణుక-ఎల్లమ్మ అని కొలుస్తున్నారు.



ఇక్కడున్న చాళుక్య వినయాదిత్య సత్యాశ్రయు (క్రీ.శ. 680-696)ని శాసనం వల్ల పంచలింగాల గ్రామంలోని ఆలయాలు బాదామీ చాళుక్యుల కాలంలో నిర్మించబడి, రాష్ట్ర కూటులు, కళ్యాణ చాళుక్యుల కాలం వరకూ విలసిల్లినాయని చెప్పొచ్చు. అందుకు అక్కడే ఉన్న కళ్యాణ చాళుక్య చక్రవర్తి మొదటి సోమేశ్వరుని క్రీ.శ.1042-68)
చివరి పాలనా సం. దాని శాసనం రుజువు. తరువాత ఎదురుగా ఉన్న ప్రధాన ఆలయంలోకి దిగి చూశాం. పానవట్టం మీద ఒకే శివలింగముంది.
అడుగుదామంటే పూజారి లేదు. లింగాన్ని బాగా అలంకరించి, నైవేద్యం పెట్టి వెళ్లాడు. పానవట్టం మీద ఒక డజను దాకా అరటిపండ్లు, ఒకటో రెండో జామకాయలు ఉన్నాయి. దేవునికి దణ్ణంపెట్టుకొన్నాం. అరటిపండు కనిపించే సరికి ఆకలౌతున్న



ట్లనిపించింది. దేవునికి మరోసారి మొక్కి రెండు అరటిపండ్లు కాజేసి తిన్నాం.

పంచలింగాల గుడి ఎక్కడుందని మాతో ఉన్న కుర్రాడిని అడిగితే, పక్కనే ఉందని తీసుకెళ్ళాడు. ఆ గుడిగర్భాలయ, అర్థ మండపం, మహామండపాలు బాగా లోతులో ఉన్నాయి. నేను వంగి జాగ్రత్తగానే దిగాను. ఇంతలో కొబ్బరికాయను తేలిగ్గా కొట్టిన చప్పుడు వినిపించింది. గుళ్ళో నేను తప్ప ఎవరూ లేరు. శబ్దం వినిపించిన దిక్కు చూశాను. ఇంకా దిగుతూ ఉన్న సాయి పాపినేని మాడుమీద చేయిపెట్టుకొని కనిపించాడు. ఏమీలేదుసార్, దూలం తలకు తగిలింది అంతే అన్నాడు. ఇద్దరం కలిసి ముందు నేలమట్టంలో ఉన్న పానవట్టం పైనున్న ఐదు శివలింగాలను చూశాం. ఆశ్చర్య మేసింది. నాలుగు అంగుళాల ఎత్తు, 8-9 అంగుళాల వ్యాసంతో వరుసగా ఐదు లింగాలు. అవి శిల్పితయారుచేసినవి కావు. నదిలో దొర్లి దొర్లి గుండ్రంగా తయారైన రాళ్లు, ప్రతిష్టించిన తరువాత అవి స్వయం భూలింగాలైనాయి.

అయిదు లింగాలను ఒకే పానవట్టం మీద ప్రతిష్టించటంతో ఈ ఆలయం చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకొంది. రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ ఎక్కడాలేని ఏకైక ఆలయంగా ప్రసిద్ధి చెందింది. సాయి పాపినేని ఆ అయిదు లింగాల్నీ నిశితంగా చూస్తూనే ఉన్నాడు. ప్రదక్షిణం చేస్తున్ననాకు గర్భాలయం ఒక మూలన కళ్యాణ చాళుక్యుల (క్రీ.శ 11వ శతాబ్ది) నాటి మహిషాసురమర్దని, సూర్య, ఋషి, సప్త మాతల (బ్రాహ్మీ, మహేశ్వరి, వైష్ణవి, కౌమారి, వారాహి, ఇంద్రాణి, చాముండి) విగ్రహాలు కుప్పపోసి కనిపించాయి. ఒక్కొక్క విగ్రహాన్ని పరిశీలిస్తున్న నన్ను ఫోటోతీస్తూ బొప్పికట్టినా, నొప్పి తగ్గిందన్న సాయి పాపినేని మంచితనం నన్నెంతో ఆకట్టుకొంది.

ఆలయం చుట్టూ ఆకారపు పద్ధతిలో చుట్టూగోడ, పైన పటములు కలవు. దానిపైన మెట్లవరసల్లా, కదంబ నాగరశైలి విమానం, అన్నీ కలిసి మమ్మల్ని వెయ్యేళ్ల కిందటి కాలనాళికలోకి తీసుకెళ్లాయి. అదే



ఆలయంలో కాలాముఖ శైవమతాచార్యుడైన కాశ్మీర పండిత దేవుని శిల్పం దగ్గర సాయి పాపినేని ఆగిపోయాడు. అది ఒక విడిగా చెక్కిన శిల్పం. పద్మాసనంపై కూర్చుని ఒకచేతిలో అక్షమాల, మరో చేతిలో ఒక ఫలాన్ని ధరించి, ఒంటిపై ఉదరబంధం, యజ్ఞోపవీతం, కంఠహారం, చెవులకు రుద్రాక్ష కుండలాలు, నుదుటిన శైవనామాలు, పైన లలాటపట్టిక, శిఖముఖంలో ధ్యానసమ్నిగతానుభవం వల్ల చేకూరిన ఆనందాన్ని వ్యక్తంచేస్తున్న చిరునవ్వు. కళ్యాణ చాళుక్యుల కాలంలో కాశ్మీరు దేశానికి చెందిన ఒక ఋషి పుంగవుడు తుంగభద్రా తీరంలోనున్న పంచలింగాలకెందుకొచ్చాడని సాయి పాపినేని నన్ను ప్రశ్నించాడు.

నేను సమాధానం కోసం వెదుక్కొని అక్కడే ఉన్న క్రీ.శ. 1068వ సం.పు భువనైకమల్ల రెండో సోమేశ్వరుని కన్నడ శాసనాన్ని చదివి, ఆ చక్రవర్తి మహాసామన్తాధిపతి చక్రవర్తి దిగ్విజయ యాత్రలో కందూరునాడులోకి ప్రవేశించిన సందర్భంగా, పంచలింగదేవరకు ద్వారగోపాన్ని నిర్మించి, దేవర తలవృత్తికి, జీర్ణోద్ధరణకు, పంచలింగ మఠాశ్రమం, సత్రాల నిర్వహణకుగాను, కాశ్మీర పండితునికి కొంత భూమిని దానం చేసిన వివరాలున్నాయనీ, శాసనంలో పేర్కొన్న కాశ్మీర పండితుని విగ్రహమే ఇది అని వివరించాను. ఆ తరువాత ఆలయస్థంభాలపైన చెక్కిన చిన్న పరిమాణపు దశభుజ నటరాజ, మహిషమర్దని శిల్పాలు చూడముచ్చటగా ఉన్నాయి. బయటికెళ్తుండగా, సాయి పాపినేని మరోసారి, పంచలింగాలను చూచి

ఐదింటిలో మధ్యలోని లింగం పెద్దగా ఉందని చెప్పాడు. ఆలయ శిఖరాల గోడలకు సున్నం, స్థంభాలు, ద్వారశాఖలపైన గల రంగుల్ని తొలగించేలా దేవాదాయ శాఖకు ఒక లేఖ రాద్దామన్నాడు.

పాపనాశం. అసలా పేరెందుకొచ్చిందని అడిగాడు సాయి పాపినేని. అలంపురం వద్ద రేణుకా-ఎల్లమ్మను ఆయన కుమారుడు పరశురాముడు, తండ్రి ఆజ్ఞపై తలనరికి చంపిన పాప పరిహారార్థంగా, పరశురాముడు, పాపనాశేశ్వరాలయాన్ని నిర్మించాడని స్థానిక స్థల పురాణం చెబుతుందన్నాను. అది సరే, ఆ ఆలయాలను ఏ రాజ వంశకాలంలో నిర్మించారో చెప్పండని అడిగాడు మళ్లీ. ఈ ఆలయాలు, అలంపురం నుంచి కూడలి సంగమేశ్వరం వెళ్ళే దారిలో తుంగభద్ర తీరంలో ఉండేవని, నీటి ముంపు నుంచి వీటిని భారత పురావస్తు సంస్థ (ఏఎస్సై) అక్కణ్ణించి తరలించి, ఇక్కడ



పునర్నిర్మించమని వివరంచాను.

ఇక ఆలయ సముదాయం నుంచి బయటికొచ్చిన మాకు ఎడమ వైపున పందేల్లో ఎత్తే గుండ్రటి రాళ్లు కనిపించాయి. దసరా పండుగ సందర్భంగా ఈ గుండ్లను ఎత్తే పోటీలు నిర్వహిస్తారని కుర్రవాడు చెప్పాడు. అలా కదలి బయటికొచ్చాం. అక్కడొక మధ్య యుగాల నాటి బురుజు శిథిలావస్థలో కనిపించింది. ఎన్నాళ్ళనుంచో చూడాలనుకున్న పంచలింగాల చూచిన ఆనందంలో సిగరెట్ తాగటం మరచిపోయిన సాయి పాపినేనిని నేను మనసులో అభినందించాను. మళ్లీ కారు స్టీరింగ్ పుచ్చుకొని, ఇప్పుడు మన ప్రయాణం ఎక్కడికి సార్ అన్నాడు.

ఇంకెక్కడికి..... నేను ఉద్యోగంలో చేరిన అలంపూరులోని పాపనాశం దేవాలయాల్ని చూడటానికి అన్నాను. కారు కదలింది. అలంపూర్ చౌరస్తా (అడ్డరోడ్డు)లో టీ తాగి, పాపనాశం దేవాలయాలను చేరుకొన్నాం.

పాపనాశం దగ్గర రెండు దేవాలయ సముదాయాలున్నాయి. చిత్రమేమిటంటే, రాష్ట్రకూట, కళ్యాణ చాళుక్యుల కాలం (క్రీ.శ. 10-11 శతాబ్దాలు) నాటి ఈ ఆలయాల గర్భాలయాలు,చదరం, గజపృష్ఠాకారం, దీర్ఘచదరంగా నిర్మించబడినాయి. మొదటి సముదాయంలోని ప్రధానాలయం గర్భాలయ, అర్థమండప, రంగ మండపాల తీరు, రంగమండప స్థంభాలపై డిజైన్లు, ద్వార శాఖలు ఆకర్షణీయంగా ఉన్నాయి. పక్కనే ఉన్న మరో సముదాయం కూడా అలాగే నిర్మించబడింది. రంగ మండపం కప్పుపైన దిక్పాలుర నడుమ నటరాజు, దశావతారాల మధ్య బుద్ధుని శిల్పాలున్నాయి. బుద్ధుడిని విష్ణుమూర్తి అవతారాల్లో ఒకటిగా చేసిన వైష్ణవమాయకు ఇదొక నిదర్శనమని, అలంపూరులోని సూర్యనారాయణాలయం



రంగమండపం కప్పుపై కూడా, దశావతార శిల్పాల నడుమ బుద్ధుని బొమ్మ ఉందని, క్రీ.శ.10వ శతాబ్దంలో ప్రచారంలో వచ్చిన ఈ విధానం జయదేవుని అష్టపదులు, అన్నమయ్య కీర్తనల్లో కూడా ఉందని చెప్పాను.

పాపనాశం ఆలయాలు, శిల్పాలు చూచి బయటకువచ్చిన మాకు ఒక ఒంటరి దేవాలయం కనిపించింది. అదేమిటని సాయి పాపినేని అడిగాడు. నేను 1978-81 మధ్య అలంపురంలో, శ్రీశైలం జలాశయ నీటి ముంపు దేవళాల తరలింపు కోసం ఏర్పాటు చేసిన దేవదాయశాఖ కార్యాలయంలో సహాయస్థపతిగా పనిచేసినపుడు, అలంపూర్ ఊరు బయట కూడలి సంగమేశ్వరం వెళ్ళేదారిలో తుంగభద్రానది ఒడ్డున ఉండేదని, నేను ఆలయాన్ని ఊడదీశాను గానీ, ఆ తరువాత నేను పురావస్తు శాఖకు బదిలీ అయిన తరువాత దేవాదాయశాఖ ఇక్కడ పునర్నిర్మించిందని, దీన్ని బుగ్గ రామలింగేశ్వరాలయమంటారని చెప్పాను. మీ ఓపికకు మెచ్చుకోవాలి సార్ అన్నాడు. ఇద్దరం కలసి తెలంగాణా పర్యాటకాభివృద్ధి సంస్థ హరిత హోటల్లో భోజనం చేసి తిరుగు పయనమయ్యాం. దారిపొడవునా పంచలింగాల, పాపనాశం బీచుపల్లి బ్రిడ్జి వద్ద కృష్ణానదిలో ఉన్న నిజాం కొండపై ఉన్న మట్టికోట, గద్వాల సంస్థానం, సోమనాద్రి భూపాలుడు, కర్నూలులోని కొండారెడ్డి బురుజుల చరిత్రలపై చర్చించుకొంటూ, చర్చించుకొంటూ ఉన్నామే గానీ, మాకు తెలియకుండానే హైదరాబాదు చేరుకున్నాం. ఆలయాలు, శిల్పాలు, శాసనాలు, కథలు, గాథలు మమ్మల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తూనే ఉన్నాయి. అ

## గ్రంథాలయం



**చిత్తరువు పద్యద్విశతి**
రచన:
డా.గన్నోజు శ్రీనివాసాచారి
పుటలు: 88, వెల 200/-
ప్రతులకు:
డా.గన్నోజు శ్రీనివాసాచారి
ఇంటినెం.14-9-95,
అచల నిలయం
ఆంజనేయస్వామి గుడివద్ద,
టీచర్స్ కాలనీ, మహబూబ్‌నగర్,
తెలంగాణ - 509 001 ఫోన్:88888 99493



**ఆమె మార్పు ఎజండా**
కవిత్వం
రచన:మహమ్మద్ ఖాజామైనద్దీన్
పుటలు: 110,
వెల 50/-
ప్రతులకు: తెలంగాణ సాహితి
1) ఇంటినెం.1-10-85/18
షాషాబ్‌గుట్ట, మహబూబ్‌నగర్
ఫోన్:93966 26276

వెండితెర

పి.వి.సత్యనారాయణ రాజు
90524 02000

# తెలుగుదనం,మానవ సంబంధాల మాధుర్యం కలబోసిన ఉత్తమ చిత్రం 'బలగం'



బలగం సినిమా మీరిప్పటికే చూసి ఉంటారు. చూడకపోతే ఆమెజాన్ ప్రైమ్ వీడియోలో చూడండి. ఈ వ్యాసంలో చిత్రంలోని కొన్ని ముఖ్యమైన ఘట్టాలను మాత్రం ప్రస్తావించాను. చిత్రం చూడాలనుకునేవారు చూసిన తర్వాతే ఈ వ్యాసం చదవండి.

పల్లె బ్రతుకులోని సంస్కృతి, సంప్రదాయాలు చూపించిన ఈ చిత్రంలో నాకు ముఖ్యంగా కనపడిన మరో అంశం పురుషాహంకారం. పురుషాహంకారమనగానే ఆడవారిని మాత్రమే అణగదొక్కుతారని అనుకోకండి. ఒక తరం మగవాళ్ళు తమ ముందు తరంలోని మగవాళ్ళని, కొంతవరకు తర్వాతి తరంలోని మగవాళ్ళని కూడా ఎలా శాసిస్తారో ఇందులో చూపించారు. తర్వాతి తరం వారు భార్యాపిల్లలుకలిగే దాకా లొంగి ఉంటారు. తర్వాత వారు శాసించటం మొదలుపెడతారు. అప్పటికి ఇప్పటి తరం వాళ్ళు ముసలివారవుతారు. సత్తువ లేక వీళ్ళు వాళ్ళకి లొంగి ఉండాలి. ఇదొక విషవలయం.

కథలో కొమురయ్యకి ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. కొమురయ్యకి డెబ్భై ఐదేళ్ళుంటాయి. చిత్రం మొదట్లో కొమురయ్యే ఇంటి పెత్తనం చేస్తున్నాడని అనిపిస్తుంది. ఇది కేవలం పైకి కనపడేది మాత్రమే. తర్వాత తెలిసేది ఏమిటంటే కొమురయ్య కొడుకులకి, అల్లుడికి తగాదా అయింది. దానివల్ల ఆయన ఇరవై ఏళ్ళు కూతుర్ని చూడనైనా చూడలేదు. ఆయన నిజానికి తగాదా జరిగినపుడు కొడుకుల్ని చీవాట్లేసి అల్లుడిని క్షమాపణ అడుగుతాడు. అల్లుడు పట్టించుకోడు. కొడుకులు పంతం వీడరు. చిత్రంలో చూపించకపోయినా కొమురయ్య అందర్నీ కలపటానికి ప్రయత్నించే ఉంటాడు. ఐలయ్య ఆయన మాట విని ఉంటే అంతా కలిసిపోయేవారు. కొమురయ్య ఐలయ్య పంతానికి తలవంచాడు. ముసలితనం ఒక కారణమైతే కొడుకుని కాదని ఎక్కడికి పోవాలి అనే భయం ఇంకో కారణం. ఐలయ్య కొడుకు సాయిలు. పాతికేళ్ళు వచ్చినా సాయిలు ఐలయ్యకి భయపడుతూ ఉంటాడు. మానవసంబంధాల ప్రాముఖ్యత తెలియకపోతే సాయిలు కూడా రేపు ఐలయ్యని శాసిస్తాడు. సినిమాలో సాయిలే కాదు ఐలయ్య, నారాయణ కూడా మానవసంబంధాల విలువని తెలుసుకుంటారు. మన కుటుంబాల్లో కూడా తెలుసుకుంటే కుటుంబాలు బావుంటాయి, సమాజం బావుంటుంది. **కుటుంబమే మన బలమూ బలగమూ.**

శాసించే మగవాళ్ళకి మగవాళ్ళే భయపడుతుంటే ఇక ఆడవాళ్ళ మాట చెప్పేదేముంది? ఐలయ్య భార్య ఇంటి ఆడపడుచుని తన కొడుకు వరపూజకి (నిశ్చితార్థానికి) పిలవాలని అనుకుంటుంది. కానీ భర్తకి భయపడుతుంది. వదినకి ఉన్న ప్రేమ సొంత అన్నగారికి లేదు. ఇంటి ఆడపడుచు లక్ష్మి తన భర్త శాసనానికి లొంగి ఉంటుంది. ఇంతకీ తగాదా ఏమిటి? చిన్న తగాదాయే. దసరా పండక్కి అల్లుడు వస్తే సరిగా పట్టించుకోలేదని, భోజనంలో సరిగా వడ్డించలేదని. కానీ ఇదే పెద్దదవుతుంది. ఇంటి అల్లుడి కంటే ఊరి సర్పంచే ముఖ్యమనుకుంటారు ఐలయ్య కొడుకులు. కుటుంబసంబంధాలు ఎలా ఉన్నా రాజకీయ ప్రాపకం ఉండాలనుకోవటం ఎంతవరకు సమంజసం? అల్లుడు మాత్రం కాస్త ఓపిగ్గా ఉండొచ్చు కదా. ఎవరి అహంకారం వారిది. భోజనాల దగ్గర మేకమాంసంలోని నల్లి బొక్క లక్ష్మి తన అన్నకి వడ్డించిందని నారాయణకి కోపం వస్తుంది. మీ అన్నకి తెలియకపోతే నీకు తెలియదా?'అని ఆమెని కొడతాడు. ఆమె గర్భవతి. కడుపుతో ఉన్న నా చెల్లిని కొడతావా అని ఐలయ్య నారాయణని తోస్తాడు. నారాయణ అలిగి వెళ్ళిపోతాడు. మగవాళ్ళ తగాదాలో ఆడవాళ్ళు, ముసలివాళ్ళు, పిల్లలు నలిగిపోతారు.

ఈ పంతాలు ఎలా ఉన్నా పెద్దలకి ఇవ్వాల్సిన గౌరవం ఇస్తారు. ఒకరోజు కొమురయ్య హఠాత్తుగా మరణిస్తాడు. ఐలయ్య బాబాయి, మేనత్త వస్తారు. ఐలయ్య మొత్తం అన్ని పనులూ బాబాయికి అప్పగిస్తాడు. మేనత్త ఇంట్లో పనులు అజమాయిషీ చేస్తుంది. మాటలు కూడా విసురుతుంటుంది. ఒక్కోసారి ఆ మాటలు కొంప ముంచుతాయి. లక్ష్మి, నారాయణ, వారి కూతురు సంధ్య వస్తారు. నారాయణ బాగా సంపాదించాడు. తండ్రి శవాన్ని చూసి లక్ష్మి బావురుమంటుంది. ఇంక నేను ఎవర్ని బాపు అని పిలవాలి? అని ఏడుస్తుంది. చిన్న కొడుకు మొగిలయ్య సూరత్ నుంచి రావాలి. అందుకు అంత్యక్రియలు మర్నాడు

పెట్టుకుంటారు. ఆ రాత్రి ఒగ్గుకథ పెడతారు. ఇది తెలుగు రాష్ట్రాల్లో కొన్ని ప్రాంతాల్లో ఉన్న సంప్రదాయం: దీని వెనక ఉద్దేశం శవజాగారం చేయటం. ఇంత జరుగుతున్నా ఐలయ్య బావని పలకరించడు. ఇక్కడ భాషకి సంబంధించిన ఒక విషయం. తెలంగాణాలో మందలింపు అంటే పలకరింపు. ఆంధ్ర ప్రాంతంలో మందలింపు అంటే చీవాట్లు వేయటం అనే అర్థం ఉంది. తెలంగాణా మాండలికంలో కలిసిన 'దావత్' (విందు) 'ఇజ్జత్' (పరువు),'గోరి'(సమాధి) లాంటి ఉర్దూ పదాలు కూడా ఈ చిత్రంలో వినిపిస్తాయి.

మర్నాడు మొగిలయ్య కుటుంబం వస్తుంది. అంత్యక్రియలు జరుగుతాయి. ఆ సందర్భంలో వచ్చే పాట బలరామ నరసయో అద్భుతమైన వేదాంతగీతం. ఈ పాటని యూట్యూబ్ లో చూడవచ్చు. మన చుట్టూ ఉన్న ప్రపంచం, అందులోని బంధాలు అన్నీ మూణ్ణాళ్ళ ముచ్చటే అనే భావాన్ని మనసుకు హత్తుకునేలా చెప్పారు. చిత్రంలోని పాటలు రాసిన కాసర్ల శ్యాంని అభినందించకుండా ఉండలేం. అంతిమయాత్రకు బయల్దేరటపుడు అందరూ ఏడుస్తుంటే ఊరిపెద్ద ఒకడు ముసలాయన బంగారపు సావు సచ్చిండు, సంబురంగా పంపియ్యాలె అంటాడు. డప్పుల మోతలతో అంతిమయాత్ర జరుగుతుంది. శుభాశుభాలను సమానంగా చూడాలనే భగవద్గీత సందేశం ఇక్కడ ఆచరణలో కనపడుతుంది. తెలంగాణాలో ఎవరైనా మరణిస్తే మొదొద్దుల (మూడు రోజుల) పండగ, ఐదొద్దుల (ఐదు రోజుల) పండగ, పదకొండొద్దుల (పదకొండు రోజుల) పండగ అని చేస్తారు. మూడో రోజు కొడుకులు అన్ని ఏర్పాటు చేస్తారు. ఐదో రోజు కూతుళ్ళు చేస్తారు. బజ్జీలు, జిలేబీలు, అన్నం, నీసు కూర, మద్యంతో పిండం పెడతారు. పోయినవారికి ఇష్టమైన వస్తువు పెడతారు. కొమురయ్యకు పిండంలో చుట్ట పెడతారు. అయితే కాకి పిండాన్ని ముట్టదు. దీంతో అందరూ బాధపడతారు. కొమురయ్య మనసులో ఏదో కోరిక ఉండిపోయిందని ఊరివారందరూ అనుకుంటారు. అక్కడి నుంచి దెప్పిపొడుపు మాటలు. సాయిలు చిన్న చిన్న వ్యాపారాలు చేసి అప్పుల్లో ఉన్నాడు. కాకి పిండం ముట్టకపోవటాన్ని తన స్వార్థం కోసం వాడుకుందామని చూస్తాడు. తర్వాత ఏం జరిగిందనేది మిగతా కథ.

పల్లెల్లో ఉండే ఆప్యాయతలు, సరసాలు, ఎకసెక్కాలు ఈ చిత్రంలో కనిపిస్తాయి. కొమురయ్య ఊళ్ళో అందరినీ పలకరిస్తూ పొద్దున్నే పొలానికి వెళతాడు. అతని వేషధారణ చక్కని తెలంగాణా వేషధారణ. తలపాగా, జుబ్బా, పంచె వేసుకుంటాడు. చేతిలో కర్ర పట్టుకుంటాడు. నడివయసు ఆడవారిని ఏం పిల్లా వస్తావా అని సరసమాడతాడు. మనవడి వరపూజకి కొత్తబట్టలు కుట్టించుకోవటానికి దర్జీ దగ్గరకు వెళతాడు. నీకెందుకు కొత్త బట్టలు అని దర్జీ వేళాకోళం చేస్తాడు. వరపూజకు ఒచ్చేటోళ్ళు నన్ను సూడరా అంటాడు కొమురయ్య. దర్జీ భార్య భర్త కోసం తెచ్చిన చాయ్ తాను తీసుకుని, రెండు చెమ్చాల చక్కెర వేయించుకుని తాగుతాడు. చేపల కూర వాసన వస్తుంటే అడుగుతాడు. మా ఇంట్లో కాదు. పక్క పొంటి ఇంట్లో ఒండుతున్నరు అంటుంది దర్జీ భార్య. ఆరోజే కొమురయ్య చనిపోతాడు. దర్జీ భార్య వచ్చి శోకాలు పెడుతూ మా ఇంటికొచ్చి రెండు చెమ్చాల చక్కెరేసుకుని చాయ్ తాగేటోడు. చేపల కూర తింటా అంటే ఒండినా. తినకుండానే పోయిండు అంటుంది గడుసుగా. రాజయ్య అనేవాడు – తన కూతురి పెళ్ళికి ఇంటికి ఒక్కరికే భోజనం చెప్పినవాడు – నీ మనవని పెళ్ళికి నేను దావతిస్తా అన్నా: ఏం చేస్తం. పాయె అంటాడు. ఈ రాజయ్యే మూడోరోజు, ఐదోరోజు వచ్చి సుష్టుగా తింటాడు. పల్లెటూరి గడుసుతనం ఇలాంటి మాటల్లో చక్కగా చూపించారు. ఇంటి అరుగు మీద కూర్చునే దర్జీ పాతరోజుల్ని జ్ఞాపకానికి తెస్తే, బాకీ కోసం మనుషుల్ని కొట్టే అప్పులవాడు, పెద్ద టీవీ కోసం చిట్టీ పాడే ఇల్లాలు నేటి జీవితాన్ని ప్రతిబింబిస్తారు.

చిన్న చిన్న ఆచారాలను హృద్యంగా చూపించారు. అందులో దింపుడు కళ్ళం ఆశ ఒకటి. దహనం చేసే ముందు శవాన్ని దించి అందరూ చెవి దగ్గరకి వచ్చి పిలుస్తారు. ఈరోజుల్లో ఇదొక తంతు అయింది కానీ పాతరోజుల్లో చనిపోయిన రోజే దహనం చేసేవారు కాబట్టి ఇంకా ప్రాణం ఉంటే లేస్తాడని అలా పిలిచేవారు. దహనం అయ్యాక ఇల్లు కడిగి గడప బయట రోకలి పెట్టి, దాని మీద పేడ ముద్ద పెడతారు. శుభకార్యాల్లోలాగే అశుభకార్యాలప్పుడు కూడా రాత్రి వేళ అందరూ కలిసి మందు తాగటం ఒక సంప్రదాయం. మందు తాగటం అనే ప్రక్రియకి నోరు చేదు చేసుకోవటం అనే మారుపేరుని వాడతారు. ఇలాంటి ప్రయోగాలు ఎన్ని ఉన్నాయో తెలుగు భాషలో!

సంభాషణల్లో తెలుగుదనం ఉట్టిపడుతుంది. దహనం అయిన తర్వాత అల్లుడు నారాయణ ఇక్కడ ఎవరి కోసం ఉండాలె? అని బయలుదేరబోతాడు. అప్పుడు ఐలయ్య మేనత్త అన్నను తలచుకుంటూ అయ్యో అన్నా! నువ్వే బతికుంటే నీ అల్లుని కాళ్ళకి అడ్డుపడేటోనివి కదే. ఇప్పుడెవరు ఆపుతారు? అని ఏడుస్తుంది. ఐలయ్య బాబాయి

నారాయణతో ఆయన కని నీ సేతిల పెట్టినందుకు ఋణం తీర్చుకునే బాధ్యత నీకుంటది. పదకొండొద్దుల దాకా ఉండాలె అంటాడు. ఆ మాటతో నారాయణ ఉండిపోతాడు. తెలుగిళ్ళలోని పంతాలు, పెద్దలు సర్దిచెప్పే తీరు ఇక్కడ ద్యోతకమౌతుంది. ఇంకో సందర్భంలో మేనత్త ఐలయ్యకి లక్ష్మి మీద ఎంత ప్రేమ ఉండేదో చెబుతూ అంత దగ్గరుండేటోళ్ళని ఇంత దూరం సేసె పాపకారి దేవుడు అంటుంది. మంచి జరిగినా దేవుడి పనే, చెడు జరిగినా దేవుడి పనే. ఇదే అమాయకులైన పల్లెవారి నమ్మకం. కానీ ఈ మేనత్తే మొగిలయ్య భార్యని చీటికి మాటికి దెప్పుతూ ఉంటుంది. సాయిలుకి కుదిరిన సంబంధం ఈ మేనత్త వల్లే చెడిపోతుంది. కొమురయ్య చనిపోయిన బాధలో బిడ్డొచ్చిన యాల్ల, గొడ్డొచ్చిన యాల్ల అనటంతో మాటా మాటా పెరిగి సంబంధం తెగతెంపులు అవుతుంది. సాయిలు కట్నం మీద ఆశ పెట్టుకున్నాడు. అతని ఆశ అడియాస అవుతుంది. ఈ సందర్భంలో ఒక పాటతో సాయిలు అవస్థని హాస్యస్ఫోరకంగా చెప్పటం బలే బావుంది. అయ్యో శివుడా! ఏమాయె అనే ఆ పాటలో బర్రె బలిసిపాయె, దున్న దుంకిపాయె, నాగలిరిగిపాయె, నవ్వులపాలాయె అనటం జానపదగీతాల్లోని చమత్కారాన్ని ఆవిష్కరిస్తుంది. గొడ్డూగోదా, పొలంపుట్రా జనపదుల జీవితాల్లో ఎలా మమేకమైపోయాయో చెప్పకనే చెప్పారు.

తాత ఇక ఎప్పటికీ కనపడడు అని సాయిలుకి పూర్తిగా అర్థమైన సన్నివేశం కన్నీరు పెట్టిస్తుంది. అంతదాకా తన అప్పుల గురించి మాత్రమే ఆలోచించిన సాయిలు తాత ప్రేమకు దూరమయ్యానని ఆలస్యంగా గుర్తిస్తాడు. మళ్ళీ ఆ ప్రేమ ఎక్కడ దొరుకుతుంది?

నారాయణ కూతురు ఒక సందర్భంలో తండ్రి గురించి తల్లితో వీళ్ళు ఇంతే ఏమో, రేపు నాకొచ్చే మొగుడు కూడా గిట్లనే ఉంటడేమో, నేనెన్నాళ్ళు పుట్టింటికి దూరమైతనో? అంటుంది. ఆ మాట విని నారాయణ ఆలోచనలో పడతాడు. ఇంతకు ముందు 'నా పెళ్ళాన్ని నేను కొడితే ఎవరికీ అడిగే హక్కు లేదు' అన్నవాడు రేపు అల్లుడు కూతుర్ని కొడితే ఊరుకుంటాడా? తన దాకా వస్తే కానీ తెలియదు. నారాయణ మొండిగా ఉండకుండా పట్టు వదులుతాడు. ఇతర సినిమాల్లోలా పాత్రలు మూర్ఖంగా ఉండకపోవటం ఇక్కడ విశేషం. ఇవి మన జీవితాల్లో కనపడే పాత్రలు. చివర పదకొండొద్దుల పండగలో ఒగ్గుకథ మళ్ళీ పెడతారు. ఇది సాధారణంగా జరగకపోయినా సినిమా కోసం పెట్టారు. కొమురయ్యే ఒగ్గుకథ కళాకారుల గొంతుల్లో పలుకుతున్నాడని చూపించారు. పాటకి ఉన్న శక్తి ఏమిటో ఇక్కడ తెలుస్తుంది. అన్నదమ్ములు, బావామరుదులు తమ పంతాలని, స్వార్థాలని పక్కన పెట్టి క్షమాపణలు అడుగుతూ కాళ్ళు పట్టుకోవటం కంటతడి పెట్టిస్తుంది. ఒక్క పాటతో ఇదంతా జరుగుతుందా అనేవారు ఈ పాట వినాలి. ఈ చిత్రం చూడాలి. అమ్మభాషలో పాట గుండెల్ని తాకుతుంది. విడిపోయినవారిని కలుపుతుంది, అవసరమైతే విప్లవాన్ని కూడా రగిలిస్తుంది.

హాస్యనటుడు యెల్దండి వేణు తన అనుభావాల ఆధారంగా అల్లుకున్న కథ ఇది. ఆయనే దర్శకుడు. దర్జీ పాత్ర కూడా వేశాడు. ప్రఖ్యాత నిర్మాత 'దిల్'రాజు ఈ కథ మీద నమ్మకంతో నిర్మించాడు. ప్రియదర్శి (సాయిలు), రూపలక్ష్మి (లక్ష్మి), విజయలక్ష్మి (మేనత్త) అద్భుతంగా నటించారు. సరైన నటీనటులని ఎంచుకోవటానికి దర్శకుడు ఆరునెలలు జల్లెడ పట్టాడట. ఛాయాగ్రాహకుడు ఆచార్య వేణు ప్రతిభ కూడా చిత్రానికి దోహదం చేసింది. మొత్తానికి ఒక నిబద్ధతతో మనసు పెట్టి తీసిన చిత్రమిది. అఖండ విజయం అందుకుంది. 'శంకరాభరణం' లాంటి చిత్రాలు ఇలాగే ఏ అంచనాలు లేకుండా వచ్చాయి. దర్శకుని తపనే వీటిని విజయశిఖరాల మీద నిలిపింది. మనసుకి హత్తుకునే కథ, మనుషుల బతుకుల కథ ఉంటే ప్రేక్షకులు ఎప్పుడూ ఆదరిస్తారు.

దేశభాషాభిమానం తోడిదే దేశాభిమానము, ఏ కులమువారైనా, ఏ మతమువారైనా ఏ దర్జావారైనా తెలుగు మాతృభాషగా గలవారందరూ ఒక్క సంఘమువారనిన్నీ, సంఘమ్ములోని వారందరూ అభివృద్ధి పొందితేనే కాని, సంఘము అభివృద్ధి పొందదనిన్నీ, ఎవరు వెనుకబడ్డా సంఘమునకు నష్టమే అనిన్నీ ఎవరు త్రికరణశుద్ధిగా భావిస్తారో వారే దేశాభిమానము గలవారని చెప్పవలెను. - గిడుగు వెంకట రామమూర్తి

కవిత

## కవిత్వాన్ని రాస్తున్నాను

ఏమిటీ?
కాంతి
ముఖాన్ని వీడిపోతోంది
శరీరం
నీలంగా వాడిపోతోంది
పదిసార్లకు
ఒకసారి పలుగుతున్నావు
పదే పదే
దేనికోసమో పరితపిస్తున్నావు
చూసే కళ్ళకు
పిచ్చివాడిలా
పిలిచే నోటికి
పరిహాస చురకలా
నువ్విలా...ఎందుకిలా
భుజం తట్టిన పరిస్థితితో
ప్రాణమిత్రనై పలుకుతూ
ఒ సమకాలీనమా!
చీకటి చింతకు
దీపమివ్వటానికి
కుళ్ళుతున్న మనిషిపై
అక్షరాల్ని చల్లటానికి
గాయమైన సంఘానికి
పదాల ఔషధాన్నివ్వటానికి
దుర్మార్పు ప్రవాహానికి
వాక్యాలతో అడ్డుకట్ట వేయటానికి
ఆనంద సంద్రాలతో నిండిన
నవ జీవన హరివిల్లుల
ఇళ్ల నిర్మాణానికి
పరితపిస్తూ
పరిచరిస్తూ
పరిశ్రమిస్తూ
పరిభ్రమిస్తూ
నేను కవిత్వాన్ని రాస్తున్నాను.

డా. పొదిలి నాగరాజు
90520 38569

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136), RNI-APTEL/2015/62362




## అమ్మనుడి సంపాదకీయాల సమాహారం

### (రాష్ట్రీయం- జాతీయం, రాజకీయం - సిద్ధాంతం)

**అమ్మనుడి** పత్రికలో 'సంపాదక హృదయం' శీర్షికను పాఠకులు ప్రత్యేక శ్రద్ధతో చదువుతారు. మాతృభాషల కోసం దేశంలో నడుస్తున్న ఉద్యమాల గురించీ, ప్రభుత్వాలతో సాగుతున్న సంఘర్షణ గురించీ ఆ సంపాదకీయాలు అవగాహను కల్పిస్తాయి. ముఖ్యంగా తెలుగురాష్ట్రాలలో నడుస్తున్న తెలుగు భాషోద్యమ ధోరణులకు అద్దం పడుతాయి. ఆయా అంశాలపై చదవరులకు స్పష్టత కలిగించేందుకు 2015 మార్చి నుండి 2023 ఫిబ్రవరి వరకు 'అమ్మనుడి' మాసపత్రిక సంపాదకీయాలను 5 విభాగాలలో ఇచ్చాము. ఈ వ్యాసాలు భాషోద్యమకారులకు దిశాదర్శనం చేస్తాయి. తెలుగు ప్రజలకు ఈ సమస్యల లోతుపాతులను తెలియజేస్తాయి.

**300 పుటల పుస్తకం వెల రూ. 200/-**

## నడుస్తున్న చరిత్ర, అమ్మనుడి మాస పత్రికలలో ప్రముఖ కార్టూనిస్ట్




సరసి

తెలుగు భాషోద్యమంలో భాగంగా
అమ్మనుడి కోసం వేసిన
200 వ్యంగ్యచిత్రాలను
పుస్తకంగా వెలువరించాము.

వెల: 200/-




**బ్యాంక్‌ఖాతా వివరాలు**

ఆన్‌లైన్ ద్వారా పంపేవారు NEFT / RTGS ద్వారా
**'తెలుగుజాతి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
**TELUGU JAATHI - AXIS BANK, TENALI**
అకౌంట్ నెం. **914020020387880**
**IFSC Code : UTIB0000556**
ఈ QRకోడ్‌ను స్కాన్ చేసి లేదా QRకోడ్ క్రింద ఇచ్చిన యుపిఐ ఐడి నెంబరుకు పంపవచ్చును.

పుస్తకాల ధరను 'తెలుగుజాతి' ట్రస్ట్ ఖాతాకు పంపించి వివరాలు
9440448244 లేదా
9492980244 కు
తెలిపితే కొరియర్ / రిజిష్టర్డ్ పోస్టు ద్వారా పుస్తకాలను పంపిస్తాము
హైదరాబాద్‌లో "నవోదయ బుక్ హౌస్" కాచిగూడ, ఫోన్:040 - 24652387,లో కూడా లభిస్తాయి.

| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | VPVMDYA102 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |